చతుర

నవంబర్ 2003

310 వ సంచిక

# పగటిపూట చంద్రుడు

అక్కినపల్లి సుబ్బారావు

# చతుర ప్రపంచం

## లండన్ జూ

లండన్ జూ అతిపురాతనమైనది. వేలాది జంతువులకు నెలవైన ఆ జూలో ఏటా సుమారు 800 జంతువులు మరణిస్తుంటాయి. ఆ తర్వాత వాటి కళేబరాలను తగిన పద్ధతుల్లో తొలగిస్తూవుంటారు. అయితే చనిపోగానే మాత్రం ప్రతి జంతువు శరీరాన్నీ పోస్ట్‌మార్టం చేస్తారు. ప్రతి జంతువు చరిత్రకీ ఓ ఫైలుని మెయిన్‌టైన్ చేస్తారక్కడ. ఆ ఫైల్‌ను చదివి పేథాలజిస్ట్ కల్నల్ హేమర్టన్ పోస్ట్‌మార్టం కార్యక్రమాన్ని నిర్వహిస్తాడు. వివిధ జంతు శరీరాల్లోని అంతర్భాగాల గురించి ఇతనికి తెలిసినట్లు ప్రపంచంలో మరెవరికీ తెలియదంటే అతిశయోక్తి లేదు. అంతేకాదు ఈ పోస్ట్‌మార్టం రిపోర్ట్‌లని ఆయన ప్రపంచంలోని ఆసక్తిగల అన్ని జూల లోగల వైద్యవిభాగానికి ఉచితంగా పంపుతుంటారు.

పోస్ట్‌మార్టం అయ్యాక ఆ కళేబరాన్ని వివిధ వ్యక్తులకు అందచేస్తారు. వెటర్నరీ మెడికల్ కాలేజీల్లోని విద్యార్థులకి జంతువుల లోపలి భాగాల గురించి డిమోన్‌స్ట్రేట్ చేయడానికి పంపుతారు. లేదా జంతుకళేబరాలను గడ్డివేసి కుట్టి వాటిని మ్యూజియంలలో ప్రదర్శనకి వుంచుతారు. ప్రపంచంలోని వివిధ మ్యూజియంలు తమకు కావలసిన జంతువుల వివరాలు లండన్ జూకి తెలియజేస్తే ఎవరికి ఏవి అవసరమో వారికవి పంపుతుంటారు. కొన్ని మ్యూజియంలు ఓ జంతువు మరణానికి కొన్ని సంవత్సరాలముందునుంచే అది తమకి కావాలని బుక్ చేసుకుంటారు.

కొందరు ప్రయివేట్ వ్యాపారస్తులు (వీళ్లని టాక్సిడెర్మిస్ట్‌లంటారు) లండన్ జూ నుంచి జంతువుల కళేబరాలను కొని, వాటిలో గడ్డిచొప్పించి, గృహాలంకరణ సామగ్రిగా వాటిని అమ్ముకుంటారు. కొందరు జంతువుల ఎముకలకోసం కళేబరాలను కొంటారు. వీరిని ఆస్టియోలాజిస్ట్ లంటారు.




కొందరు సైంటిస్టులు కూడా వీటిని కొని లోపల ఎందుకు ఏ అవయవం చెడిపోయి మరణించిందో పరిశోధిస్తుంటారు.

జూలో వుండే జంతువులు అడవుల్లోని జంతువులకన్నా ఎక్కువకాలం జీవిస్తాయి. జూలలో ఇవి వృద్ధాప్యందాకా జీవించడానికి ప్రధాన కారణాలు చక్కటి పోషణ, సహజ అడవుల్లోలా ఇతర జంతువులనుంచి ప్రమాదం లేకపోవడం, సమయానికి వైద్య సదుపాయం అందడం.

కవర్ ఫొటోగ్రాఫర్: మధు     మోడల్: నాన్సీ

పోస్ట్‌మార్టంవల్ల కొత్త విషయాలు తెలుస్తూ వుంటాయి. ఓసారి ఓ ఆఫ్రికన్ సింహానికి అయిదు పిల్లలు పుట్టాయి. అందులో మూడు మరణించాయి. పుట్టేసమయంలో అవి మరణించాయనుకున్నారు కానీ పోస్ట్‌మార్టంలో తల్లే వాటిని చంపిందని తెలిసింది. పరిశోధిస్తే బలంగా వున్నవాటిని మాత్రమే వుంచి, బలహీనమైనవాటిని చంపేస్తుందని తెలిసింది. పరిశోధనలో తేలిన మరో విషయం ఏమంటే తన ఆహారాన్ని తానే సంపాదించుకోవాల్సిన అవసరం లేని జంతువులకి మనుషులకుండే హిస్టీరియా లాంటిది వస్తుంది. చిన్న కొరడా దెబ్బకి కూడా అవి మరణిస్తాయి. తన ఆహారాన్ని తనే సంపాదించుకునే జంతువుల్లో ఈ హిస్టీరియా వుండదని ఈ పోస్ట్‌మార్టంల వల్ల తేలింది.

## లండన్‌లో న్యూయార్క్

అమెరికాకు చెందిన కథ సినిమాగా అమెరికాలో కంటే యూరప్‌లో ముఖ్యంగా ఇటలీలో లేదా ఇంగ్లండ్‌లో తీయడం చవక అని నిర్ణయించారు నిర్మాతలు.

ఉదాహరణకి ఛార్లెస్ బ్రౌన్‌సన్ నటించిన 'డెత్ విష్' అనే చిత్రం బాగా ఆడింది. దాంతో డెత్‌విష్ పార్ట్ ఒన్, పార్ట్ టు అని తీశారు. కథంతా న్యూయార్క్ నగరంలోని ఈస్ట్‌సైడ్‌లో జరుగుతుంది.

లండన్ నగరం శివార్లలోని ఓ పాత హాస్పిటల్‌కున్న ఆవరణలో బ్రూక్‌లిన్ చివర ఉన్న ఈస్ట్‌సైడ్‌కి కార్బన్‌కాపీలా కనిపించేలా పెద్ద సెట్టుని నిర్మించారు. అక్కడున్న బిల్డింగ్ ముందుభాగాలని రోడ్డుకి అటూఇటూ వేశారు. షాపుల్లోని సరుకులన్నీ అమెరికాలో దొరికే వస్తు సముదాయమే. పబ్లిక్ టెలిఫోన్ బూత్‌లు, అందులోని పరికరాలు, గోడలమీద అతికించిన ప్రకటనలు మొదలైనవన్నీ ఈస్ట్‌సైడ్‌కి నమూనాలే. 74వ వీధిలోని పోలీస్ స్టేషన్ సెట్టుని యధావిధిగా వేశారు. ఇందుకు అనువుగా ఈస్ట్‌సైడ్‌లో 700 ఫొటోలు తీసి వాటిని దగ్గర వుంచుకుని ఆ భారీ సెట్టుని నిర్మించారు. ఆఖరికి ఇళ్ళ బయట వుండే నాచుని కూడా యధావిధిగా పెయింట్ చేశారు.

నేరస్థులు అధికంగా జీవించే న్యూయార్క్‌లోని ఈస్ట్‌సైడ్‌లో నేలమీది చెత్త, గోడలమీది పిచ్చిరాతలు, కాలిపోవడానికి సిద్ధంగా వున్న భవంతులు మొదలైనవాటిని ఈ సెట్టుకి యధాతథంగా కాపీ చేశారు. ఫలితంగా అక్కడ జరిగిన షూటింగ్ అచ్చం ఈస్ట్‌సైడ్‌లో జరిగినట్టుగానే ప్రేక్షకులకు భ్రమని కలిగిస్తుంది.




ఈస్ట్‌సైడ్‌లో నివసించేవారు కూడా దాన్ని అక్కడే తీశారని భావించేలా ఆ సెట్టుని నిర్మించారు.

ఈ సెట్టు మొత్తం నిర్మాణానికి ఏడున్నర లక్షల పౌండ్లు (సుమారు 3 కోట్ల రూపాయలు) ఖర్చు చేశారు నిర్మాతలు. కానీ న్యూయార్క్‌లోని ఆ సహజమైన వాతావరణంలో ఈ చిత్రాన్ని తీయాలంటే అందుకు 10 రెట్లు అధికంగా ఖర్చు చేయాల్సి వుంటుంది. పైగా ప్రజలని, ట్రాఫిక్‌ని

కంట్రోల్ చేయడం శ్రమతో కూడినపని.

అమెరికన్ చిత్రనిర్మాతలు ఇలాంటిసెట్లు నిర్మించి యూరప్ దేశాల్లో సినిమాలు తీయడానికి ఎక్కువ ఉత్సాహం చూపుతున్నారు. కొందరు దర్శకులు అలాంటి అవకాశంగల కథలకోసం ఎగబడుతున్నారట.

---

## ఇది ఆత్మహత్యలకి గైడ్

ఆత్మహత్యలు అధికంగా చేసుకునే ప్రజలుగల దేశం జపాన్. అక్కడ వాళ్ళ కేవో కష్టాలుండి ఆత్మహత్యలు చేసుకుంటున్నారనుకోకండి. సమస్యాత్మక ప్రపంచం నుంచి విడుదల కోరి కాక ఆధ్యాత్మిక వున్నతికోసం జపాన్ ప్రజలు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. 'సమురాయ్' అనే కత్తితో పొడుచుకుని మరణించడం అలాంటివారికక్కడ ఆచారం.

ఇటీవల జపాన్‌లోని ఓ రచయిత 'ది కంప్లీట్ మేన్యువల్ ఆఫ్ సూసైడ్' అనే పుస్తకాన్ని ప్రచురించాడు. అందులో 10 రకాలుగా ఎలాంటి బాధ లేకుండా ఆత్మహత్య చేసుకునే పద్ధతులని పేర్కొన్నాడు. ఛార్ట్స్ మేప్‌లతో సహా వేయబడి ఏ విధానం వల్ల ఎంత బాధ వుంటుంది, లేదా ఎంత త్వరగా లేదా ఆలస్యంగా మరణం సంభవించవచ్చు అన్న విషయాలన్నీ అందులో ప్రస్తావించబడ్డాయి. 200 పేజీలున్న ఆ పుస్తకంలో ఆత్మహత్యకి అనువైన ప్రదేశాల జాబితా, ముందుగా తీసుకోవలసిన చర్యలు అందులో విపులంగా ఇవ్వబడ్డాయి. విల్లు రాయడంలాంటి లౌకిక విషయాలతో పాటు, ఆధ్యాత్మికంగా వుపన్యాసం, నామస్మరణ ఎంతకాలం ముందునుంచి చేయాలి అన్న విషయాలు కూడా అందులో ప్రస్తావించాడారచయిత.

జపాన్‌లోని అగ్నిపర్వతం మౌంట్ ఫ్యూజి సమీపంలోని అకోగహర అనే అడవి అనువైన ప్రదేశంగా పేర్కొనబడింది. ఆ పుస్తకం విడుదలైనపుడు 74 శవాలని పోలీసులు కనుగొన్నారు. 12 లక్షల కాపీలు అమ్ముడైన ఆ పుస్తకం వివిధ ప్రపంచ భాషల్లోకి కూడా అనువదింపబడి అమ్ముడవుతోంది.

కొందరు ఈ పుస్తకాన్ని నిషేధించాలని గొడవ చేశారు కానీ జపాన్ ప్రభుత్వం మాత్రం చచ్చే హక్కు తమ ప్రజలకుందనుకుందో ఏమో అందుకు అంగీకరించలేదు. ఇప్పటికి అది చాలా ముద్రణలని చేసింది. విదేశాల్లో ఈ పుస్తకం నిషేధించమంటూ గొడవలు జరగలేదు. ఈ పుస్తకం జపాన్ దేశస్థుల్ని ఆకర్షించినట్లుగా విదేశస్థులని ఆకర్షించలేకపోవడమే అందుకు కారణం. కొన్ని విదేశీ భాషల్లో వెలువడ్డ ఇది 100 కాపీలు మించి అమ్ముడుపోక, పబ్లిషర్స్‌కి నష్టం వచ్చింది.




✤

# చతురకతలు

## రక్షరేకు

అరనిమిషం లేటయితే అగ్గిమీద గుగ్గిలం అయిపోతున్నాడు కొత్త మేనేజరు. ఒక్క రోజు కాదుగదా ఒక్క గంట పర్మిషన్ కూడా ఇవ్వకుండా చెండాడేస్తున్నాడు. పనిలో పెండింగ్ కుదరదు. కబుర్లొద్దు




పనీపనీ అని ఒకటే హెచ్చరికలు. రెండు రోజులు శలవు సంపాదించి అత్తారింటికి వెడదామంటే గురుడు మెమో, చార్జిషీటు అంటూ హడలగొట్టేస్తున్నాడు. వీడి కింద ఎలా పనిచెయ్యాలో కత్తిమీద సాములా వుంది. మంగలంలో పడ్డ ఆవగింజలా వేగిపోతున్నాను. కొత్తగా పెళ్ళి అయిన వాడి కష్టాలమీద కాస్త సానుభూతి కూడా లేదు రాక్షసుడికి. ఎంత ప్రాధేయపడినా జాలిపడలేదు.

ఆరోజు ఆఫీసుకు వెళ్ళేసరికి 'మేనేజరు గారు నన్ను ప్రేమగా పిలిచి, "మీది చవటా పురమా? " అని లాలనగా అడిగారు.

ఆఫీసులో అటెండర్లు నా సమాచారం అందించినట్టున్నారు. 'చవటాపురం' భూత వైద్యానికి ప్రసిద్ధి. ఆదివారం, బుధవారం మా ఊరు తిరునాళ్ళలా వుంటుంది. మా కుటుంబంవాళ్ళు భూతవైద్యం చేస్తారు అనే కంటే జనాల్ని నమ్మకంగా దోస్తారు అంటే కరెక్టు. కాలం ఎంతమారినా సైన్సు ఎంత పెరిగినా భూతవైద్యాన్ని నమ్మే మూర్ఖులు, అమాయకులు ఇంకా వున్నారు. అందులో మా మేనేజరు గారు ఒకరన్న విషయం నాకు అప్పుడే తెలిసింది.

6 నవంబర్ 2003



"మూర్తీ నువ్వు చవటాపురం వెళ్ళి నా భార్యకు రక్షరేకు తీసుకురావాలి. కాళ్ళు పట్లు, కదలలేకపోతోంది. తిన్నది సహించ డంలేదు. నిద్రపట్టడంలేదు, అలా పడు కుంటే ఇలా తుళ్లిపడి లేచిపోతోంది. భయంకర స్వప్నాలట. గుండెలు పట్టేసిన ట్లుగా వుండి ఊపిరి ఆడడంలేదుట. ఏదో గాలిదోషంగానీ, చేతబడి ప్రయోగంగానీ అయి వుంటుందని అంతా అంటున్నారు. చాలామంది డాక్టర్లని చూశాం, ఫలితం లేదు. ఆవిడను తీసుకెళ్ళడం సాధ్యపడదు. కాస్త నువ్వు వెళ్ళి రక్షరేకు తీసుకురావా లోయ్" అన్నారు మేనేజర్‌గారు.

ఈ సందర్భంలో భూతవైద్యం బూటకం అని నేను నచ్చచెప్పే ప్రయత్నం చేసినా ఫలితం వుండదు సరికదా తాను చెప్పిన పని తప్పించుకోవడానికి ఏదో సాకు చెబు తున్నానని అపోహపడే అవకాశం వుంది. వయస్సుపైబడ్డ స్థూలకాయులకు కీళ్ళనొ ప్పులు సహజం. తిన్న ఆహారంలో ఏదైనా లోపం వుంటే వాంతులు అవడం సహ జమే. జీర్ణవ్యవస్థ సక్రమంగా లేకుంటే నిద్ర పట్టకపోవడమూ సహజమే. అయినా పైకి ఏమీ అనలేక "తప్పక తెస్తాను సార్" అన్నాను. ఆయన నన్ను విడిచిపెట్టలేదు. "ఎప్పుడు రమ్మంటారో వైద్యానికి ఏమి కావాలో తెలుసుకో. ఫోన్ చెయ్యి" అంటూ గుండెలమీద కూర్చున్నాడు.

ఇక తప్పేదేముంది. ఆయన ఎదురు గానే నాకు బాగా పరిచయమున్న భూతవై ద్యుడికి ఫోన్ చేశాను. వాళ్ళు కావలసిన వివరాలు చెప్పారు. దారంతో ఆవిడ పొడుగు కొలత తీసుకుని ఆ కొలతదారం, ఆమె తల వెంట్రుకలు, రెండు నిమ్మకా యలు, ఓ కొబ్బరికాయ ఆమెకు దిష్టితీసి ఆ రాత్రికి ఆవిడ తల వద్ద వుంచి ఉదయం వాటిని తీసుకుని రమ్మని చెప్పారు. మీ వూరు దగ్గరేకదా. ఉద యమే వెళ్ళి ఆఫీసు టైమ్‌కి వచ్చేయమని ఆర్డర్ పాస్ చేశారు మేనేజరుగారు.

ఉదయం మేనేజరుగారింటికి వెళ్ళి ఆయన ఇచ్చిన సరంజామాతోపాటుగా ఆయన ఇచ్చిన రెండువేల రూపాయల క్యాష్ తీసుకుని ఆయన ఇల్లు దాటగానే సరంజామా డ్రైన్‌లో పారేసి, క్యాష్ జేబులో పదిలపరచుకుని ఇంటికి వచ్చాను. వెంటనే నాకు తెలిసినట్లుగా రక్షరేకు కట్టి ఓ గంట లేటుగా ఆఫీసుకు వెళ్ళాను.

గురుడు కిమ్మనలేదు. అప్పటికి నా గురించి ఓ వందసార్లు అడిగాడట. ఆ రక్ష రేకు సాంబ్రాణి ధూపం వేసి తల స్నానం చేసిన తరువాత కట్టుకోవాలనీ, ఆమెకు చేత బడి చెయ్యబడిందనీ, ఆరోజు వైద్యానికి వెళ్ళకపోతే ప్రాణాలకే ముప్పు వాటిల్లేదనీ, పిశాచాలతో మాట్లాడి స్పెషల్ పూజలు చేసి మరీ రక్షరేకు కట్టాడనీ నాకు బాగా తెలిసినవాళ్ళు కావడంవల్ల మంచి పవర్‌ఫుల్ వైద్యం జరిగిందనీ నమ్మకంగా చెప్పేశాను. నా మాటలకు మా మేనేజరు ప్లీజయిపోయాడు.

మర్నాడు నేను ఆఫీసుకు సకాలంలోనే వెళ్ళాను. మేనేజరుగారు రాగానే తన ఛాంబరుకు రమ్మన్నారని అటెండరు చెప్పారు. మేనేజరు ఛాంబరుకి వెళ్ళాను. నన్ను చూడగానే కౌగలించుకున్నాడు. వాళ్ళ శ్రీమతి ఆరోగ్యం రాత్రికి రాత్రే బాగు పడిపోయిందట. గొప్ప కష్టంనుంచి రక్షిం చానన్నాడు. నా రుణం తీర్చుకోలేనన్నాడు. ఆయన మాటలు విని హాయిగా ఊపిరి పీల్చుకున్నాను.

దారి ఖర్చులకు రెండువేలు ఎలానూ ఇచ్చాడు. ఇక రెండురోజుల సెలవుకి రేపే టెండర్ వెయ్యాలి. మేనేజరుకి నేను కట్టిన రక్షరేకు మహత్తు నాకిక శ్రీరామరక్ష. చేత బడి చేయిస్తానని భయపెట్టవచ్చు దొరికి పోయాడు మానవుడు.

– రతన్‌బాబు



- చతుర... 7

# పళ్లు

యాదగిరి వడ్డీవ్యాపారి. ముఖ్యంగా కాయగూరలు, పళ్ల వ్యాపారులకు రోజు వారీ వడ్డీమీద డబ్బు అప్పు ఇస్తుంటాడు. ఉదయంపూట వ్యాపారులు ఆ డబ్బుతో సరుకు కొని పగలంతా అమ్మేసి సాయంత్రానికల్లా అసలు, వడ్డీతో సహా యాదగిరికి ఇచ్చేసి చేతులు దులుపుకొంటారు. యాదగిరి వ్యాపారం మూడు పిందెలు, ఆరు పళ్లుగా వర్ధిల్లుతోంది. మోటారుసైకిలు కొన్నాడు. పెళ్లానికి పుస్తెలతాడు చేయించాడు. పిల్లాడిని ఇంగ్లీషు స్కూలులో చేర్పించాడు. రొక్కం లక్షల మీద తిరుగుతోంది. ఇది తోటి వడ్డీ వ్యాపారస్థులకు కంటగింపయింది. ఎలాగైనా యాదగిరిని, అతని వ్యాపారాన్ని దెబ్బతీసేందుకు కాచుక్కూచున్నారు.

ఓబులేసు పల్లెనుండి పట్నానికి వచ్చాడు. ఎంత తిరిగినా పనిదొరకలేదు. అతనితో పాటు మరో మూడు జీవులు పస్తులతో పడుకొంటుండేవి. ఎవరో సలహా ఇస్తే ఓబులేసు యాదగిరి దగ్గరకు వెళ్ళాడు. పళ్ల వ్యాపారం చేస్తాను. పెట్టుబడి పెట్టమన్నాడు. తనఖాకి ఏమీలేదు. తన పరిస్థితి వివరించి యాదగిరి కాళ్లు పట్టుకొన్నాడు. యాదగిరి పక్కా వ్యాపారస్థుడు. కాళ్లు పట్టుకొంటే కాదు, అసలు, వడ్డీ ఏ రోజుకారోజు తీర్చేయగలవా అన్నాడు. ఓ అలాగే అన్నాడు ఓబులేసు. ఒకవేళ మాట తప్పితే మర్యాద దక్కదని హెచ్చరించి డబ్బు చేతిలో పెట్టాడు యాదగిరి.



పట్టణంలో పళ్లకి కరువులేదు. మాటల చాతుర్యంతో, అమ్మాయిల్ని అంగడిలో కూచోబెట్టి ప్రజలను సమ్మోహనపరిచి పళ్ల వ్యాపారస్థులు చేసే వ్యాపారం ముందు ఓబులేసు తూగలేకపోయాడు. రెండవ రోజు కూడా నిరాశ ఎదురయింది. మూడ

పరోజుకి సరుకు తాజాదనం కోల్పోయి కుళ్ళిపోవడం మొదలయింది. ఓబులేసుకి దుఃఖం అగలేదు. దుఃఖాన్ని దూరం చేసు కొందామనుకొన్నాడు. గుడుంబా గుక్కెడు తాగాడు.

ఓబులేసు స్వయంగా వచ్చి డబ్బు అంద జేస్తాడని ఎదురుచూసిన యాదగిరికి చిర్రె త్తుకొచ్చింది. మోటారుబైకు మీదొచ్చి ఓబు లేసు దుకాణం ముందు ఆపాడు. "పైకం తియ్" అన్నాడు యాదగిరి.

"సరుకు అమ్ముడు కాలేదు. తర్వాత ఇచ్చుకొంటాను" అన్నాడు ఓబులేసు.

"మాటంటే మాట. డబ్బు తియ్ ముందు" గద్దించాడు యాదగిరి.

బండిమీదున్న యాదగిరికి, మందు మీదున్న ఓబులేసుకి మాటా మాటా పెరి గింది.

"నీయమ్మ!" అన్నాడు యాదగిరి కోపం పట్టలేక.

"ఊర్కోండి బాబయ్యా! ఆడితో తగు వేటి? తాగేసి ఉన్నాడు" అంది పక్కనే ఉన్న ఓబులేసు పెళ్లాం.

"దానమ్మ... ఎంత..."

మాటలు రాక వెళ్ళిపోయాడు యాదగిరి.

అంతవరకు చుట్టూ నిలబడి చోద్యం చూస్తున్నవాళ్ళు తేరుకున్నారు. గుక్కెడు తాగిన ఓబులేసుకి మరో బుక్కెడు తాగిం చారు. తోటి వడ్డీ వ్యాపారస్థుల మాట లకు ఓబులేసు దంపతులు తలలూపారు. ఫలితంగా యాదగిరి అట్రాసిటీస్ యాక్ట్ కింద అరెస్టు అయి కటకటాల పాల య్యాడు. ఓబులేసు నిమ్నవర్గానికి చెంది నవాడు. తోటి వడ్డీ వ్యాపారులు దావ తులు చేసుకున్నారు.

లాయరు లంబోదరం మంచి పేరున్న వకీలు. కేసు పూర్వాపరాలు బాగా స్టడీచేసి యాదగిరి మీద ఉచ్చు ఎలా బిగిసిందో గమనించాడు. నిజానికి పట్టణంలో ఆపాటి తిట్టు అంత పెద్ద తప్పుకాదు.

"నీయవ్వ, అమ్మ" అన్నది సర్వసాధారణ మైన విషయం.. మండీకి వెళ్ళి అక్కడి పరి స్థితులు ఆకళింపు చేసుకొని వచ్చాడు లంబోదరం.

కేసు జడ్జీగారి ముందుకి వచ్చింది. ప్రాసి క్యూషను లాయరు నిందితుడ్ని శిక్షించమని గట్టిగా వాదించి కూచున్నాడు. డిఫెన్సు లాయరు లంబోదరం లేచి బోనులో ఉన్న యాదగిరిని అడిగాడు.

"నీవు మండీకి ఎందుకు వెళ్లావు?"

"పళ్లు... కొందామని" అన్నాడు యాద గిరి దీర్ఘం తీస్తూ.

"ఎవరి దగ్గరకు వెళ్లావు?" అని మళ్లీ ప్రశ్న.

"అది...గో... అ...తగాడి... ద...గ్గ ర...కు" ఓబులేసుని చూపిస్తూ సాగదీస్తూ మాట్లాడాడు.

"వాడికీ నీకు ఏం సంబంధం?" మళ్లీ ప్రశ్న.

"ఏ...మీ లేదు..." జవాబు వచ్చింది అగి, అగి.

"ఓబులేసు దగ్గరకు వెళ్ళి ఏమిటి అడి గావు?" లంబోదరం ప్రశ్న కోర్టంతా ప్రతి ధ్వనించింది.

"నీ...మ్మ... దాని...మ్మ... ఎంతని?" యాదగిరి చిలకపలుకులు అందరికీ విన్పి స్తున్నాయి.

"దట్సాల్ రైట్ యువరానర్! నా క్లయిం టుకి దీర్ఘంగా మాట్లాడడం అలవాటు. అతను ఓబులేసు అమ్మిన పళ్లరేటు అడి గాడు. ధర ఎక్కువవడంతో వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు. తప్పుడు కేసు పెట్టినందుకు ఓబులేసుకి తగిన శిక్ష విధించమని కోర్టువా రిని ప్రార్థిస్తున్నాను"

జడ్జి కేసు కొట్టేశాడు. ఓబులేసు అమ్మిన వాటిలో నిమ్మ, దానిమ్మ పళ్లు కూడా ఉన్నాయి.

– అనందరావు పట్నాయక్

★



# చతుర

సంపుటి : 26 సంచిక : 10 నవంబర్ : 2003
310వ సంచిక

"ఇండియానుంచి వచ్చే ప్రొఫెసర్ రాఘవ నీకు ఇంతక్రితమే పరిచయమా మమ్మీ?" అని అడిగింది కూతురు తల్లిని.

"పరిచయమేమిటి, బాగా తెలుసు మీ మమ్మీకి. ఐదేళ్ళక్రితం ఆరు నెలలకు ఇండియా వెళ్ళి అతడు పనిచేసిన యూనివర్సిటీలోనే పని చేసింది మీ అమ్మ. ఇద్దరూ మంచి ఫ్రెండ్స్" అన్నాడు ఆ అమ్మాయి తండ్రి.

అతడి మాటలలోని వ్యంగ్యానికి ఆమెలో అలజడి రేగినా అంతలోనే ఆమె మనసు కళ్ళెం వదిలిన గుర్రంలా రాఘవ తాలూకు జ్ఞాపకాలను వెతుక్కుంటూ పరుగెత్తింది. వాళ్ళిద్దరిమధ్యా ఉన్నది స్నేహమో, ప్రేమో, వ్యామోహమోగానీ... పగలే వెన్నెలన్నట్లు నడిచిన ఆ అనుబంధం చివరకు ఏ మలుపు తిరిగింది?

మళ్ళీ అతడు అమెరికా వచ్చినప్పుడు ఎదురైన అనూహ్య పరిస్థితులు ఎలాంటివి?

'వరల్డ్ ట్రేడ్ సెంటర్' దుర్ఘటన తరువాత అమెరికాలోని సాంఘిక, ఆర్థిక వ్యవస్థల్లో చోటు చేసుకున్న మార్పులను కథానేపథ్యంలో విశ్లేషించిన

అక్కినపల్లి సుబ్బారావు రచన

# పగటిపూట చంద్రుడు

ఈనెల చతుర సమగ్ర నవల

"స బ్వే మేప్ ఉంటుంది. అది చూసి వరల్డ్ ట్రేడ్ సెంటర్‌కి వచ్చి అక్కడ ఉన్న వాల్‌గ్రీన్ దుకాణం దగ్గర నిలబడితే నేను అక్కడికి వచ్చి నిన్ను మా ఇంటికి తీసుకువస్తాను. కెనడీ ఎయిర్ పోర్ట్‌కి నేవ చ్చేవాడినే. కాని మా బాస్ ఎవరికీ చెప్ప కుండా మీటింగ్స్ శుక్రవారం మధ్యాహ్నం పెడతాడు. నీ కస్టమ్స్ చెకప్, ఇమ్మిగ్రేషన్ ఫార్మాలిటీస్ పూర్తిచేసుకుని సామాన్లతో సబ్‌వేలో ప్రయాణం చేసి వరల్డ్ ట్రేడ్ సెంటర్‌కి వచ్చేసరికి దాదాపు నాలుగున్నర అవుతుంది. మహా అయితే నా గురించి నువ్వు ఒక అరగంట నిరీక్షించాల్సి ఉంటుం దేమో. అక్కడ నిలబడి పరిగెత్తినట్లు నడిచి వెళ్ళే జనాభాని చూస్తుంటే నీకు కావలసి నంత కాలక్షేపం. ఆ దుకాణానికి ఎదురుగా ఒక రెస్టారెంట్ ఉంది, దానిలో మంచి కాఫీ దొరుకుతుంది. కావాలంటే అక్కడ కుర్చీ లలో కూర్చుని నా కోసం నిరీక్షించు" అని గోఖలే రాసిన ఉత్తరాన్ని మరోసారి చదివి, సబ్‌వే వెళ్ళడానికి గుర్తుల కోసం అటూ ఇటూ చూశాడు రాఘవ.

న్యూయార్క్ ప్రజలకి ఇతరుల గురించి పట్టదు. ఎవరి మానాన వాళ్ళు తమ తమ పరుగులో ఉంటారు. ఎయిర్‌పోర్ట్‌లో తమ బంధుమిత్రుల పరివారం కోసం నిరీక్షిస్తున్న ప్రజానీకంలో చైనీయులు, జపాన్ దేశస్థులు, ఆఫ్రికన్ అమెరికన్లు, ఏషియన్లు, పశ్చిమ ఆసియానుంచి వచ్చిన ప్రజలు, యూదులు అందరూ కలగాపులగంగా ఉన్నారు. ఆత్రంగా తెలిసిన మొహాల గురించి చూస్తు న్నారు.

సన్నిహితులైన వ్యక్తుల గురించి నిరీక్షణ! దానిలో ఎంత ఆనందం ఉందో! అను కుంటుంటే బిలబిలా ప్రజలు బైటకి చొచ్చుకు వస్తున్నారు. గాఢాలింగనాలు, సుతారంగా ముద్దులు, బుగ్గలమీద ముద్దులు, గాఢమైన ముద్దులు... అన్ని రకా లుగా వచ్చిన వ్యక్తులకి స్వాగతం పలకడం కనిపించింది రాఘవకి.

పోర్టర్లు సామాన్లని తీసుకువెళ్తున్నారు. ఆదరా బాదరాగా టెలిఫోన్ బూత్‌ల దగ్గ రకి ప్రజలు వెళ్తున్నారు. ఒకటే కోలాహలం. 'ఇన్ఫర్మేషన్' అన్నచోటకి వెళ్ళి సబ్‌వే చేర డానికి దారి గుర్తులు కనుక్కుని ట్రాలీతో బైటకి వచ్చాడు రాఘవ.

ఒక సంవత్సరం అమెరికాలో పనిచేయడా నికి వచ్చి న్యూయార్క్ చేరిన రాఘవ కెనడీ ఎయిర్‌పోర్ట్‌లోంచి సబ్‌వే చేరబోతూ బయ టికి చూసి ఎదురుగా కొన్ని, దూరంగా మరి కొన్ని మల్టీస్టోరీ భవనాలని చూసి నోరు వెళ్ళబెట్టాడు. ఎక్కువ అంతస్థుల భవనా లని టెలివిజన్, సినిమాలలో చూసినా వాటిని దగ్గరగా చూసేసరికి ఉక్కిరిబిక్కిర య్యాడు. బయట టాక్సీలు వరుసగా బారులు తీరుతున్నాయి. 'నేనంటే నేను' అంటూ పోటీపడకుండా యాత్రీకులని టాక్సీ లలో ఎక్కించుకుని కదిలివెళ్తున్నాయి. టాక్సీ నడిపేవాళ్ళలో ఇండియా ఉపఖండం నుంచి వచ్చిన వాళ్ళు ఎక్కువగా ఉండడం చూశాడు రాఘవ. వీలున్నంతవరకు ట్రాలీని తోసుకెళ్ళి సబ్‌వేలో ప్రవేశించి ముందు ట్రాలీని వదిలి, సామాన్లతో మెట్లు దిగసాగాడు రాఘవ.

"న్యూయార్క్ సబ్‌వే సిస్టమ్ చాలా బాగు పడింది. ఐనప్పటికీ రైలుపెట్టెలు రవ్వంత గలీజుగా ఉంటాయి. సబ్‌వే స్టేషన్‌లోనికి ప్రవేశించడానికి టోకెన్లు కావాలి. ఒక టోకెన్ ధర ఒక డాలర్. ఒకసారి లోపలికి ప్రవేశిస్తే బయటకి రాకుండా ఉన్నంతవరకు ఎన్ని రైళ్ళు మారినా మళ్ళీ టోకెన్ అవసరం లేదు. జాగ్రత్త, మేప్ సరిగ్గా చూడకపోతే ఎక్కడికో వెళ్ళిపోతావు. నీకు 'ఎఫ్' ట్రెయిన్ ఉపయోగపడుతుంది. దారి తప్పిపోతే నాకు ఫోన్ చెయ్. ఒక లోకల్ కాల్‌కి క్వార్టర్ కావాలి" అంటూ గోఖలే ముందరే అన్నీ వివరంగా రాయడంతో పర్స్‌లోంచి ఐదు డాలర్ల నోట్ ఇచ్చి "మూడు టోకెన్స్"





అన్నాడు. కటకటాల వెనకాతల కూర్చుని టోకెన్లు ఇస్తున్న వ్యక్తిని తాకడానికి వీలు లేకుండా టోకెన్లు మాత్రం అందుకునేంత చిన్న నెరదలో మూడు టోకెన్లు, రెండు డాలర్లు వదిలాడు.

"థాంక్ యూ" అంటూ టోకెన్లు, డాలర్లని అందుకున్నాడు రాఘవ.

న్యూయార్క్ పట్టణం అనగానే విభిన్న వ్యక్తులకి భిన్నాభిప్రాయాలు ఉద్భవిస్తాయి. వాటికి కారణం కొందరికి ప్రత్యక్ష అను భవం. మరికొందరికి పరోక్షంగా పేపర్ చదవడం వలన కలిగిన అభిప్రాయం. కాని న్యూయార్క్ అనగానే చాలామందికి క్రైమ్ అన్నది మదిలో మెదులుతుంది.

ఒకసారి న్యూయార్క్‌లో క్రైమ్ గురించి ఒక స్నేహితుడు, "నీకు తెలియదు బ్రదర్. మొన్నటికి మొన్న మావాడు సబ్‌వే వేపు నడిచివెళ్తుంటే కత్తి చూపించి డబ్బంతా లాగేసుకున్నారట" అన్న మస్తిష్కంలోనికి జారపడిన వాక్యం జ్ఞాపకానికి వచ్చింది రాఘవకి. నిజంగా అది జరిగిందా? లేక ట, ట, ట...ల బాపతా? " అన్నది వేరే విషయం. అది జరగకపోయినా ఆ నిజం లాంటి పుకారు దావానలంలా వ్యాపించి చివరికి అది నిజమే అయివుంటుందన్న భావన మనలో నాటుకుంటుంది. అలవాటు లేని దారి! సరిగ్గా అర్థంకాని గుర్తులని అన్వ యించుకుని, దక్షిణానికి వెళ్ళే 'ఎఫ్' ట్రెయిన్ ఎలా పట్టుకోవాలో కనుక్కుని, సరి అయిన ప్లాట్‌ఫారంమీద నిలబడానికి దాదాపు నలభై నిమిషాలు పట్టింది రాఘవకి.

రెండు నిమిషాలలో కావలసిన 'ఎఫ్' ట్రెయిన్‌లోనికి సామాన్లని తోసుకుని ఒక వారగా వాటిని ఉంచి, దగ్గరగా ఉన్న ఖాళీ జాగాలో చతికిలపడ్డాడు. ఈ 'ఎఫ్' ట్రెయిన్ తనని కావలసినచోటుకి తీసుకెళ్తుందా? అన్న పిరికి అనుమానం మెల్లిగా బలపడ డంతో ఎదురుగా కూర్చున్న వ్యక్తిని అడుగు దామని అతనివేపు ప్రశ్నార్థకంగా చూశాడు. ఎదుట కూర్చున్న వ్యక్తి మంచి నిద్రలో ఉన్నాడో, నిద్రలో ఉన్నట్లు నటిస్తున్నాడో తెలియడంలేదు. కారణమేదైనాసరే అతనితో మాట్లాడే అవకాశం దొరకలేదు రాఘవకి. ఆ పెట్టెలో ప్రయాణం చేస్తున్న ప్రయాణీ కులు ఇతరుల గురించి పట్టించుకోకుండా చెవులకి ఇయర్‌ఫోన్స్ పెట్టుకుని సంగీతం వింటూనో లేక నవల చదవడంలో నిమగ్ను లయో, కళ్ళు మూసుకునో కనిపించారు. ఇతరులతో మాటలాడడానికి అవకాశం లేకుండా అలా చేస్తున్నారా? అనిపించింది రాఘవకి. ఒక మూల సీట్లలో ఒక జంట ఒకరి కళ్ళలోనికి ఇంకొకరు చూసుకుంటూ ఇతర ప్రపంచాన్నే మరిచిపోయి ఉన్నారు. ఒక విధంగా చెప్పాలంటే రైలుపెట్టెలో ఒక రకమైన స్తబ్దత చోటు చేసుకుంది. ఆ నిశ్శ బ్దాన్ని ఛేదించి, కల్పించుకుని ఎవరినీ అడిగే చొరవలేక, బెరుకుగా ఇటూఅటూ చూస్తుంటే రైలుపెట్టెలో, గోడమీద చట్రం కట్టిన సబ్‌వే మేప్ కనపడింది. సీట్లోంచి లేచి నిలబడి వరల్డ్ ట్రేడ్ సెంటర్‌కి వెళ్ళే రైలు ఏ ఏ స్టేషన్లలో ఆగుతుందో చదివి, బైట ప్లాట్‌ఫారంమీద కనిపించిన పేరుతో పోల్చిచూసి తను సరైన రైలులోనే ప్రయాణం చేస్తున్నానని నిర్ధారణగా తెలుసు కునేసరికి రాఘవకి ఎక్కడలేని ధైర్యం వచ్చింది. నుదుటపట్టిన చమటని తుడుచు కుని సామాన్లు ఉంచినచోట ఉన్న ఖాళీ జాగాలో తిరిగి చతికిలబడ్డాడు.

మరో నలభై ఐదు నిమిషాలు ప్రయాణం చేసి, గోఖలే నిర్దేశించిన ప్రదేశానికి సామా న్లని తోసుకుంటూ వచ్చిన రాఘవ అలస టతో రొప్పుతున్నాడు. గోఖలే రాసినట్లు, ఏభై-అరవై అడుగులున్న కారిడార్‌లో ప్రయాణీకులు తొందరగా అంగలు వేస్తూ వివిధ దిశలలో వెళ్తున్నారు. ఇది పగలా? లేక రాత్రా? సాయంకాలమా? ఉద యమా? అని తెలియనివ్వకుండా ఉన్నాయి లైట్లు. తిండిదొరికే ప్రదేశాలు, పనిముట్లు,



మందులు, గిఫ్ట్ సామాన్లు దొరికే అంగడులు, పేపర్ల స్టేండ్, రకరకాల దుకాణాలు లైట్ల వెలుతురుతో మెరిసిపోతున్నాయి. వరల్డ్ ట్రేడ్ సెంటర్‌కి వచ్చి నిలబడి పదిహేను నిమిషాలైంది. గోఖలే జాడలేదు. న్యూయార్క్ ఎయిర్‌పోర్ట్‌లోంచి సామాన్లతో బైటపడినపుడు తొందరలో కాఫీ తాగడం వీలుపడలేదు. ఏరోప్లేన్‌లో వాళ్ళు ఇచ్చిన తిండి తిని దాదాపు నాలుగు గంటలు కావస్తోంది. కడుపు ఆకలి ఆకలి అంటుంటే ఎదురుగా కనిపిస్తున్న బోడీన్ అన్న కాఫీ ప్రదేశంవేపు సామాన్లని తోసుకుంటూ నడిచాడు రాఘవ.

క్రొసాంట్ తింటూ, కాఫీ తాగుతున్న రాఘవకి కారిడార్‌లో నడిచి వెళ్తున్న ప్రజానీకం స్పష్టంగా కనిపిస్తున్నారు. గోఖలే కనిపిస్తే బైటకి వెళ్ళవచ్చు అని మెల్లిగా కాఫీ తాగుతుంటే, "హలో రాఘవ్" అంటూ గోఖలే రాఘవ భుజంమీద తట్టాడు.

"అరె, నిన్ను చూడలేదే" అని రాఘవ ఆశ్చర్యపడ్డాడు.

"అంతమంది ప్రజలు అన్నిదేశాలనుంచి వచ్చిన ప్రజలు, అతివేగంగా ప్రవహించే ప్రవాహంలాంటి ప్రజా సమూహంలో పోల్చడం దాదాపు అసంభవం. నేను నిన్ను ఉండమన్న ప్రదేశానికి వెళ్ళి, నువ్వు కనిపించకపోతే, ఇక్కడ ఉంటావని వచ్చాను. ఎలా ఉన్నావు రాఘవా?" అంటూ ఆప్యాయంగా పలకరించాడు గోఖలే.

"ఐయామ్ ఫైన్, బాగున్నాను. మరి నువ్వో?" అని తిరిగి ప్రశ్నించాడు రాఘవ.

"అఫ్‌కోర్స్ ఐ యామ్ ఫైన్. కాఫీ తాగడం పూర్తయితే మనం వెళదాం. ఈ సమయంలో సబ్‌వే రైళ్ళు కిక్కిరిసి ఉంటాయి. బైటకి వెళ్తే టాక్సీలు దొరకవు. అయినా మనకి తొందర ఏమీ లేదుగా. టాక్సీకి ప్రయత్నిద్దాం" అన్నాడు గోఖలే.

కాఫీ తాగడం ముగిశాక, సామాన్లని తోసుకుంటూ వరల్డ్‌ట్రేడ్ సెంటర్ బిల్డింగ్ లోంచి బయట పడ్డారు ఇద్దరూ.

★ ★ ★

రెండు రోజులు న్యూయార్క్‌లో ఉన్న వింతలు, విశేషాలు, లిబర్టీ విగ్రహం, ఎంపైర్ స్టేట్ బిల్డింగ్, రాక్‌ఫెల్లర్ సెంటర్, వరల్డ్‌ట్రేడ్ సెంటర్, ఐక్యరాజ్యసమితి, మ్యూజియంలు చూసేసరికి రాఘవకి కాళ్ళ నొప్పులు మొదలుపెట్టాయి.

"ఇహనే తిరగలేను బాబూ" అంటూ గోఖలే ఇతర ప్రదేశాలకి తీసుకెళ్తానన్నా రాఘవ నిరాకరించాడు.

"రేపు నాకు ఆఫీసు ఉంది. అందుచేత నిన్ను ఎయిర్‌పోర్ట్‌లో నీ ఫ్లైట్ సమయానికి తీసుకువెళ్ళలేను. దాని నివారణకి రెండు మార్గాలున్నాయి. ఒకటి ఫ్లైట్ సమయానికి సరిపడేటట్టు ముప్పయి డాలర్లు ఖర్చు పెట్టి వెళ్ళడం. రెండవది నే ఉదయం ఆఫీసుకి బయలుదేరేటప్పుడు నాతో బయలుదేరి ముందరగా ఎయిర్‌పోర్ట్ చేరి అక్కడ ఫ్లైట్ టైమ్‌వరకు పడికాయడం. నువ్వే నిశ్చయించుకో. నాతో వచ్చేమాటుంటే ఉదయం ఎనిమిది గంటల నలభై ఐదు నిమిషాలకి బయలుదేరాలి. అలా బయలుదేరితే ఆఫీసుకి ఒక అరగంట మాత్రమే ఆలస్యంగా చేరుతాను" అంటూ గోఖలే హెచ్చరించాడు.

"ముప్పయి డాలర్లే? అంత ఖర్చు నేను భరించలేను. ఉదయమే లేచి తయారవుతాను. మనం ఇంటినుండి కలిసే బయలుదేరుదాం" అన్నాడు రాఘవ.

★ ★ ★

"మమ్మీ మీ డిపార్ట్‌మెంట్‌లో విజిటింగ్ ప్రొఫెసర్‌గా ఒక ఇండియన్ వస్తారేమో అన్నావు ఏమైంది?" అనడిగింది కాంచన మానసని.

"ఎవరినైనా పైదేశం నుంచి ఇక్కడ ఉద్యోగానికి రప్పించాలంటే చాలా పేపర్ వర్క్ ఉంటుంది. డిపార్ట్‌మెంట్ ఒక ప్రొఫెసర్‌ని తీసుకోవచ్చని సూచించింది. పేపర్ వర్క్







జరుగుతుంది. చూడాలి ఏమవుతుందో" అని జవాబిచ్చింది మానస.

"ఈ దేశంలో ఇంతమంది క్వాలిఫైడ్ సైంటిస్ట్‌లు ఉంటుండగా పైదేశం నుంచి తెప్పించడం ఇక్కడ ప్రజలకి అన్యాయం చేసినట్లే. ఇలా ఎక్కువ అవబట్టేకదా ఇక్కడ ఉన్న ప్రాంతీయులకి, పైదేశం నుంచి వచ్చి వాళ్ళ ఉద్యోగాలు విక్రయిస్తున్నారన్న అనుమానం వచ్చింది" అంది కాంచన తిరిగి.

"కంపెనీల సంగతి నేచెప్పలేను. అది మీ డాడీ చెప్పగలరు. కాని మా యూనివర్సిటీలో ఎందుకు ఇలా చేయాల్సివచ్చిందో వివరించగలను. ప్రస్తుతం కంప్యూటర్ సైన్స్ విభాగంలో ఎక్కువ విద్యార్థులు చేరుతున్నారు. ఎక్కువ విద్యార్థులు ఉంటే ఉపాధ్యాయుల సంఖ్య పెంచితీరాలి, లేదా కొంతమంది విద్యార్థుల ఎడ్మిషన్ నిరాకరించాలి.

ఉపాధ్యాయులని శాశ్వతంగా నియమించితే వాళ్ళమీద యూనివర్శిటీ అదని, ఇదని సౌకర్యాల కోసం ఖర్చు చేయాలి. రేపు కంప్యూటర్ సైన్స్‌కి పరపతి పడిపోతే శాశ్వతంగా నియమించిన ప్రొఫెసర్‌కి ఉద్వాసన చెప్పాల్సివస్తుంది. అందుచేత తాత్కాలికమైన నియామకాలు చేస్తారు. ఒక కోర్స్ పాఠం చెప్పడానికి నాలుగు ఐదువేల డాలర్లు ఇస్తారు. సంవత్సరంలో మాకు ఐదువేల కోర్స్‌లు చెప్పే వ్యక్తి కావాలి. ఇండియానుంచే ప్రొఫెసర్‌కి ఇరవైరెండు- ఇరవైమూడు వేల డాలర్లు ఇచ్చి ఆ కోర్స్‌లు చెప్పమంటారు. పిహెచ్‌డి డిగ్రీ ఉన్న స్థానిక వ్యక్తి ఆ జీతానికి ఎవ్వరూ దొరకరు. ఆ ఇరవైరెండువేలు చాలా ఎక్కువనుకుంటూ పైదేశంనుంచి పరిగెత్తుకువస్తారు. అంటే ఇక్కడ ప్రజలకి అక్కరలేని ఉద్యోగాలకి, సాంకేతికంగా బాగా క్వాలిఫైడ్ అయిన పైదేశప్రజలు వస్తున్నారు. అంతేకాని వాళ్ళు ఉద్యోగాలు తీసేసుకోవడంలేదు" అంది మానస.

"ఇండియానుంచి రాబోయే ప్రొఫెసర్ పేరేమిటి? " అనడిగింది కాంచన.

"డాక్టర్ రాఘవ" అంది మానస.

సంభాషణ అంతా వింటున్న సంతోష్ "ఎవరు? నీ ఫ్రెండ్ రాఘవా వస్తోంది? " అని కల్పించుకున్నాడు.

"నీకు ఆ ప్రొఫెసర్ పరిచయమా మమ్మీ? "

"తెలియడమేమిటి, బాగా తెలుసును. ఓ ఐదేళ్ళక్రితం ఆరునెలలకి ఇండియా వెళ్ళి ఆ ప్రొఫెసర్ రాఘవ పనిచేస్తున్న యూనివర్శిటీలోనే పనిచేసింది. ఓల్డ్ ఫ్రెండ్స్" అన్నాడు సంతోష్ నవ్వుతూ.

మానస ఇబ్బందిగా కుర్చీలో కదులుతోంది. ఆ చర్చ ముగిసిపోవాలని, "ఇద్దరమూ కలిసి ఒక గైడ్‌కింద పనిచేశాం అంతే" అంటూ రిమోట్ కంట్రోల్‌తో టెలివిజన్ ఆన్‌చేసి ఛానల్స్ మార్చసాగింది మానస. "మమ్మీ ఏదో ఒకటి ఉంచమ్మా" అంటూ కాంచన రిమోట్ మానస చేతిలోంచి లాక్కుని దెయ్యాల సినిమా ఒకటి పెట్టింది. దానిని చూసే ఉద్దేశంలేని మానస ఆలోచనలోకి దొర్లింది.

రాఘవని చూసి ఐదేళ్లయింది. ఇప్పుడు ఎలా ఉన్నాడో! నలభైరెండు, నలభైమూడేళ్ళ మనిషికి చత్వారం వచ్చే సమయం అది. రిమ్‌లెస్ కళ్లద్దాలు ధరించి ఉంటాడా? లేక పాత తెలుగు మాస్టర్లు వేసుకునే గుండ్రటి కళ్ళజోడు వేసుకుని ఉంటాడా? తనకి కళ్ళజోడు వచ్చింది, జుత్తు నెరిసింది. తన ఈడువాడైన రాఘవకి ఇవన్నీ వచ్చి ఉంటాయా? రాఘవ కొడుకు ఇంజనీరింగ్ చదువుకి మైసూరు వెళ్ళాడని రాశాడు. ఇంజనీరింగ్ పూర్తవడానికి ఇంకా ఎంత కాలం ఉందో! విశాఖపట్నంలో గడిపిన రోజులు ఒకటి తరువాత ఇంకోటి జ్ఞాపకానికి రాసాగాయి. హైదరాబాదు నుంచి విశాఖపట్నం విమానంలో తను ప్రయాణం చేస్తూ రాఘవ గురించి ఆలోచించసాగింది. రాఘవని చూసి చాలా సంవత్సరాలైంది అనుకుంది తను అప్పుడు.

పదిహేనేళ్లక్రితం చెరగని చిరునవ్వు, ముభావత్వం, బెరుకుతనంతో ఉండే రాఘవలో అవన్నీ ఇంకా ఉన్నాయా? శాంతంగా తొందరపడకుండా తనపని తాను చేసుకుంటూ రీసెర్చ్‌లో దిట్ట అనిపించుకుని ప్రొఫెసర్ అయిన రాఘవలో వ్యక్తిగా ఏమైనా మార్పు వచ్చిందా? తనతో చాలా కలుపుగోలుతనం ప్రదర్శించేందుకు ఆ రోజుల్లో అతని కళ్లలో తనంటే అదొక రకమైన గౌరవం కనిపించేది. అది ఇప్పుడు ఉందా? లేక జీవితపు ఒడిదుడుకులలో పడి అది మాసిపోయి ఉంటుందా? అప్పటిలాగే రాఘవ మారకుండా ఉంటే బాగుండును అనుకుంది విశాఖపట్నంలో విమానం దిగుతుంటే. గుండె తీవ్రంగా కొట్టుకుంటుంటే అదురుని అదిమిపెట్టి ఎయిర్‌పోర్ట్




లాండ్‌లోనికి వచ్చింది.

చెరగని చిరునవ్వుతో చేయి ఊపుతూ ఎదురువచ్చాడు రాఘవ.

కంటికి కళ్ళజోడు లేదు, జుత్తు నెరవ లేదు. పదిహేనేళ్ళలో మహా అయితే పది పౌన్లు బరువు పెరిగేడేమో! గోధుమరంగు పాంట్‌లో, టక్‌చేసిన ఎర్ర షర్ట్‌లో స్వచ్ఛంగా కనిపిస్తున్నాడు. గభాలున తన చత్వారపు కళ్ళజోడుని తీసి చేతిసంచీలో దాచేసింది.

"ఎలా ఉన్నారు మానసా?" అంటూ గౌరవం జొనిపిస్తూ ప్రశ్నించాడు రాఘవ.

"బాగానే ఉన్నాను, కాని ఈ కొత్త సంబో దనే బాగాలేదు. నువ్వెలా ఉన్నావు?" అన డిగింది తను. పదిహేనేళ్ళ అగాధం ఒక్క సారి పూడుకుపోయి ముందరరోజే విడిపో యినట్లు మాటల్లో పడ్డారు ఇద్దరూ.

అరగంట తరువాత సామాన్లతో బైటకి వస్తుంటే "టాక్సీ బేరమాడి తీసుకువచ్చాను. ముందర మా ఇంటికి వెళ్ళి స్థిమితపడి రెండు, మూడు రోజులు తరువాత మీకై నిర్దేశించిన చోటకి వెళ్దురుగాని" అంటూ తను ఏమంటుందో అనైనా ఎదురుచూడ కుండా టాక్సీలో సామాన్లు ఎక్కించాడు.

రకరకాల పిండివంటలతో, ఉక్కిరిబిక్కిరి అయ్యే ఆతిథ్యంతో సంధ్యతో రెండు రోజులు గడిచాక "రేపు ఫ్లాట్‌కి మారతాను" అంది తను. ఫ్లాట్‌కి వచ్చి కావలసిన సామాన్లని అమరుస్తుంటే తను ఏదేదో సలహాలు ఇవ్వగా, "రాఘవ టేస్ట్, మీ టేస్ట్ అన్నీ ఒక్క లాగే ఉన్నాయి" అంది సంధ్య ఆశ్చర్యంగా తనవేపు చూస్తూ. మనస్సు ఒక్కసారి గతు క్కుమంది. తన మొహంలో భావాలేమైనా ఉంటే పసికడుతుందేమోనని మొహాన్ని రెండవవేపు తిప్పుకుని బాత్రూంలోనికి పరి గెత్తింది. ఎదురుగా అద్దంలో తన మొహం లోనికి రక్తం తన్నుకు వచ్చినట్లు ప్రస్ఫుటంగా కనిపించింది. సంధ్య మాటలకి తన మొహంలోనికి రక్తం తన్నుకు రావడా నికి ఏమిటి సంబంధం? తరువాత ఎంత సేపు ఆలోచించినా తనకి వివరణ దొరక లేదు.

అడపాదడపా సంధ్య బలవంతంతో రాఘవ ఇంటికి భోజనానికి వెళ్తూ నెల్లాళ్ళ య్యేసరికి ఒక రకమైన రొటీన్‌కి అలవాటు పడింది. రాఘవతో కలిసి పనిచేయడం, కబుర్లు చెప్పుకోవడం కలిసి బజార్లకి వెళ్ళి సామాన్లు కొనడంతో జీవితం అంటే తనలో ఉత్సాహం తిరిగి బాగా రాజుకుంది. ఈ ఉత్సాహం, ఈ కలిసి పనిచేయడం కేవలం తాత్కాలికం అని మనస్సు హెచ్చరిస్తున్నా దాని పీక నొక్కేసి రోజులు గడపనారంభిం చింది. విశాఖపట్నం వచ్చి రెండు నెలల యింది. రాఘవ సహాయంతో ఏ అవాంత రమూ లేకుండా రెండు నెలలు గడిచేసరికి తను రిలాక్స్ అయి శాంతంగా రోజులు వెళ్ళదీస్తుంటే ఒకరోజు ఉదయం రాఘవ "థీసిస్ ఎగ్జామినర్‌గా బొంబాయి నాలుగు రోజులు తరవాత వెళ్తాను. తిరిగి రావడా నికి ఆరురోజులు పడుతుంది. నేవెళ్ళే ముందు నీకేమైనా సహాయం కావాలా? అఫ్‌కోర్స్ సంధ్య ప్రతిరోజూ వచ్చి నీ సంగతి చూస్తుందనుకో" అన్నాడు.

"నాకేమీ అవసరంలేదు. అయినా నేనే మైనా చిన్నపిల్లనా? నా సంగతి నేను ఆమాత్రం చూసుకోగలను" అంది తను నవ్వుతూ.

"నాకేమైనా కావలిస్తే నేనే వచ్చి అడుగు తాను సంధ్యని అని చెప్పు" అంది రాఘవ ఊరికి వెళ్ళే ముందురోజు.

రాఘవ వెళ్ళి మూడు రోజులయింది. రాఘవ లేకపోతే ఏదోలా అనిపించింది. ప్రతిదానికీ తడుముకుంటూ వెళ్ళాయి మూడురోజులు. "ఆరు రోజులు రాఘవ పనిమీద వెళ్తే నువ్వు కంగారుపడుతూ గడు పుతున్నావు. త్వరలో తిరిగి అమెరికా వెళ్ళాక నీ పరిస్థితి ఎలా ఉంటుంది?" అంటూ మెదడు హెచ్చరిస్తుంటే, పొడు

## సచిత్ర విచిత్రం

# అతిపెద్ద పువ్వు



ప్రపంచంలోని అతిపెద్ద పువ్వు 'టిటాన్ అరుమ్' అనే మొక్కకు సంవత్సరానికి ఒకసారి మాత్రమే పూస్తుంది. *257* సెం.మీ. ఎత్తు వరకూ ఆ మొక్క ఎదుగుతుంది. *78* కేజీల బరువైన మొక్క అది. ఆ పుష్పం ఎత్తు *2.67* మీటర్లు. టిటాన్ అరుమ్ పుష్పాలు అసుమత్రలోగల అడవుల్లో వర్షపాతం హెచ్చుగా ఉండడం వలన ఎక్కువగా పూస్తాయి.

బాన్ నగరంలోగల యూనివర్శిటీలోని బొటానికల్ గార్డెన్స్‌లో ఈ చెట్టు ఉంది. దీనికి ఈమధ్యనే ఆ పుష్పం అందంగా వికసించింది. ఆ బొటానికల్ గార్డెన్స్‌లో ఇప్పటికి *8* సార్లు ఆ పువ్వు పూసింది. ప్రతీ సంవత్సరం *15* వేల మంది వెళ్ళి ఆ పుష్పాన్ని చూసి ఆనందిస్తారు. ఈ సంవత్సరం ఇంకా ఎక్కువమంది సందర్శకులు రాగలరని అచ్చటి గార్డెన్ వారు అన్నారు.

స్తుంటే ఈ ప్రశ్నకి సరైన సమాధానం ఇవ్వ లేక ఎక్కువసేపు డిపార్ట్‌మెంట్‌లో ఇతర లెక్చరర్లతో కబుర్లలో పడి ఒంటరితనాన్ని తగ్గించ ప్రయత్నించింది.

నాల్గవరోజు ఉదయమే సంధ్య వచ్చి "రేపు మీరూ, నేనూ మా బావగారి ఇల్లు గృహప్రవేశానికి వెళ్తున్నాం. "నేను రాను" అనడానికి వీలు లేకుండా, మిమ్మల్ని తీసుకు వస్తున్నానని అందరికీ చెప్పాను. రాఘవ ద్వారా అందరికీ మీ గురించి తెలుసు. మిమ్మల్ని కలవడానికి అందరూ కుతూహల పడుతున్నారు. ముహూర్తం ఉదయం తొమ్మిదిన్నరకి. పాలు పొంగించడం, సత్య నారాయణ వ్రతం, భోజనాలు అయ్యేసరికి ఒంటిగంట అవుతుంది" అంది.

"నాకు ఇలాంటివారిమీద నమ్మకాలు తక్కువ. అదీకాక మీరుకాక నాకు ఇంకె వరూ తెలిసినవాళ్ళు అక్కడ ఉండరు. గుంపులో నే దారి తప్పుతాను ప్లీజ్ నన్ను వదిలేయండి" అంది తను ప్రాధేయప డుతూ.

"రాఘవ మిమ్మల్ని అందరికీ పరిచయం చేస్తానన్నాడు. ఆయన ఊరు వెళ్ళడంతో ఆ పని నాకు తగిలింది. ఇప్పుడు మీరు రానంటే నా పరువు, రాఘవ పరువు పోతాయి. తరువాత మీ ఇష్టం" అంది సంధ్య.

రాఘవ పరువు పోతుందన్నమాట విన గానే తను మెత్తబడి, "సరే, కాని నన్ను మీరు అక్కడ వదిలిపెట్టకూడదు" అంది బెరుకుగా.

సంధ్యతో మర్నాటి ఉదయం తొమ్మిదిగం టలకి సీతమ్మధార దగ్గర ఉన్న రాఘవ అన్నగారింటికి చేరింది. ఇంటిలోపల పురో హితుడు మంత్రాలు చదువుతూ గృహప్ర వేశం తంతు పూర్తిచేస్తుంటే ఇంటి బయట షామియానా కింద వచ్చిన అతిథులు కూర్చుని కబుర్లలో పడ్డారు.

సంధ్యతో ఆటోరిక్షా దిగగానే షామి యానా కింద కూర్చున్న జనాభా కళ్లన్నీ సంధ్యమీద, తనమీద పడ్డాయి. అంతవరకు పెద్ద వాల్యూమ్‌తో నడుస్తున్న సంభాషణ తాత్కాలికంగా తగ్గింది. సంధ్య కొంతమం దిని పరిచయం చేసి ఈ పూజ సామాన్లు లోపలి ఇచ్చివస్తానని లోపలికి వెళ్ళింది, తను ఒంటరిదయింది. తనకి అలాంటి వాతావరణం కొత్త, ప్రదేశమూ కొత్తదే. దానికితోడు చాలాకాలంగా తెలుగు సంస్కృ తికి దూరంగా ఉండడంతో ఏంచేయాలో నిర్ధారణగా తెలియక ఎదురుగా ఖాళీగా ఉన్న కుర్చీలో చతికిలపడింది. కూర్చున్న తరువాత స్త్రీలందరూ ఒకపక్క గుంపుగా, పురుషులందరూ ఇంకోవేపు కూర్చున్నట్లు గమనించింది. విశాఖపట్నం ఇంకా మార్పు చెందలేదన్నదానికి నిదర్శనగా తన పక్కన కుర్చీలో కూర్చున్న వ్యక్తి ఏదో పని ఉన్నట్లు లేచి ఇంట్లోకి నడిచాడు. అది తన ఊహే కావచ్చు భ్రమే కావచ్చు షామియానా కింద కూర్చున్న స్త్రీలు తననే గమనిస్తున్నా రనిపించింది. మగవాళ్ళ మధ్య జరుగు తున్న సంభాషణ కొంత వినిపిస్తోంది. స్పష్టంగా కాకపోయినా, ఎవరు మాట్లాడుతు న్నారో తెలియకపోయినా మాటలలో ఉన్న సారాంశం తెలుస్తోంది.

రాఘవా వాళ్ల అన్నయ్య రైల్వేలో ఇంజనీ రని, అతను ఐదు సంవత్సరాల క్రితం కట్టిం చిన ఇంటిని దాదాపు పూర్తిగా పడకొట్టి కొత్తగా కట్టించాడని, దానికి కారణం మర మ్మత్తు ముందర ఆ ఇల్లు వాస్తుశాస్త్ర ప్రకారం లేదని, దానివలన రాఘవ వదిన గారికి అనారోగ్యం, కంప్యూటర్ కోర్స్ చదివి విదేశాలకి చదువుకి వెళ్దామనుకుంటే కొడు కుకి వీసా నిరాకరణ లాంటి ఇబ్బందులు చాలా అనుభవించాడట. ఒక వాస్తు శాస్త్ర వేత్త రాఘవ కుటుంబానికి ఎదురవుతున్న సమస్యలకి కారణం ఉంటున్న ఇల్లు శాస్త్రవి రుద్ధంగా కట్టడమేనని చెప్పి, వివరించి, నమ్మించి కొత్తగా ఇల్లుని రూపుదిద్దేలా చేశా

డని తెలిసింది. అది జరిగి ఒక సంవత్సరం అయింది. రెండవసారి వీసాకి వెళ్తే వీసా ఆమోదించడంతోపాటు రాఘవ వదినగారి ఆరోగ్యం, మంత్రం వేసి నొప్పి తీసేసినట్లు అతితక్కువ కాలంలో బాగుపడిందిట. అందుకే ఆర్భాటంగా, శాస్త్రప్రకారంగా, మంచి ముహూర్తం చూసి గృహప్రవేశం అధికారపూర్వకంగా చేస్తున్నారు.

"నేను రాఘవ మేనమామని. నా పేరు రమేష్. మా అబ్బాయి కాలిఫోర్నియాలో పనిచేస్తున్నాడు. వాడు అక్కడకి వెళ్ళి చాలా కాలమైంది" అంటూ తననితాను పరిచయం చేసుకున్నాడు. దాదాపు ఆరడుగుల ఎత్తు మనిషి, కంటి అద్దాలలోంచి తనని చూస్తుంటే ఇబ్బందిగా కదిలింది తను.

"ఆహా అలాగా" అంది తను.

ఆ వ్యక్తి వదిలిపెట్టకుండా "మా వాడు ఇల్లు అక్కడ కొన్నప్పుడు ప్లాన్ పంపాడు. ఏమిటో నాకు నచ్చలేదు. కొన్ని మార్పులు చేయించాలి దానిలో. లేకపోతే అనర్థాలు జరుగుతాయి. ఈ ఇంటికి వాస్తుశాస్త్ర ప్రకారం మలిచింది నేనే. చూడండి, వాళ్ళ జీవితాలు ఎంత బాగుపడ్డాయో" అన్నాడు.

పచ్చని శరీరం, మల్లుపంచె, జుబ్బా ధరించిన వ్యక్తి మెడలోంచి తెల్లని పూసలదండ తళతళా మెరుస్తుంటే ఆశ్చర్యంగా అతని వేపే చూస్తూ మౌనంగా ఉండిపోయింది తను. లోలోపలనుంచి అసహనం పెరుగుతున్నా తమాయించుకుంది.

"అక్కడ ఈ వాస్తుశాస్త్రం గురించి ఎవరికీ తెలియదుకదూ? ఆ దేశం ఈమధ్యనేగా ఉద్భవించింది" అంటూ ఉపన్యాసం కొనసాగించబోతుంటే "బాబాయ్ అక్కడ అంటూ సొంటూ ఉండవు. ఆచారాలు, మడి ఉండవు కిరస్తానీయులకి" అన్నారు వెనక నించెవరో.

"మీరు ప్రభోదిస్తున్న వాస్తుశాస్త్రం ఉందని ఆ దేశం ప్రజలకి తెలియదు. దానికి కారణం చరిత్ర తిరగేసి చూస్తే అలాంటిది ఒకటి ఉందన్నదానికి తార్కాణం ఎంత వెతికినా ఎవరికీ కనిపించదు. గాలి, నీరు, వెలుతురు, వానల ప్రభావానికి ఇల్లు అన్ని విధాలా సదుపాయంగా ఉండాలన్న అల నాటి రాతకి, ఇప్పుడు ఇళ్లు పడకొట్టే సిద్ధాంతాలకీ పోలికే లేదు. వాస్తుశాస్త్రం గురించి మీకు ఎలా తెలిసింది? " అనడిగింది మానస.

చుట్టూ మూగి కూర్చున్న ప్రజలు ఆసక్తిగా పూసలదండ పెద్దమనిషి ఏం సమాధానం చెబుతాడా అని చూస్తున్నారు.

"అదేమిటి అలా అడిగారు? నేచెప్పే వాస్తుమీద పుస్తకాలు రాశారు. మన శాస్త్రాలని చదివి, మనకి అర్థమయ్యేలా రాసినవే. హైదరాబాదులో ఒక వాస్తుశాస్త్రవేత్త ఎనభై ఇళ్లని, వాటిలో నివసించే ప్రజల కష్టసుఖాలని, లాభనష్టాలని గణనలోనికి తీసుకుని అర్థం చేసుకుని రాసిన పుస్తకం అది" అన్నాడు ఆయన.

"యీ ఊరికి దగ్గరగా ఉన్న చికాగో పట్టణంలో పసుపతిగారని ఒక ప్రొఫెసర్ ఉన్నారు. ఆయనకి అరవై ఏళ్లు రాగానే రిటైరయ్యారు. మనిషి మంచి ఆరోగ్యవంతుడు. దేహధారుడ్యం కలవాడు. ఉద్యోగం చేసేటప్పుడు హాబీలు అవీ ఏమీలేవు. అందుచేత ఆయన చికాగో దరిదాపులలో ఉన్న ఇండియన్ల ఇళ్లకి తరచు వెళ్లి బాతాఖానీ వేసి వాళ్ల సమయం వృధా చేసేవాడు. ఉన్నట్టుండి ఆయన థియరీ ఆఫ్ పసుపతి లేదా పసుశాస్త్రం అంటూ ఓ ముప్ఫయి పేజీలు పుస్తక రూపంలో వేయించి అందర్నీ చదవమనేవాడు. ఒక ప్రతి నా దగ్గర ఉంది, మీకు తరువాత ఇస్తాను. ఆయన శాస్త్రం కార్ల నెంబర్ల మీద ఆధారపడి ఉంది. అమెరికాలో కార్ల నెంబర్లు వరుసవారీగా ఇవ్వరు. రేండెమ్‌గా ఇస్తారు. ఆ కార్ల నెంబర్‌లో ఉన్న అంకెలని కూడితే అది తొమ్మిది అంకెతో భాగింపబడాలి, ఇఫ్‌నాట్ మంచిది కాదు. కొందరి కార్లకి అలాంటి





నెంబర్లులేక బాధలకి లోనవుతుంటే ఆయన వాళ్లని మోటారు కార్ల డిపార్ట్‌మెంట్‌కి తీసు కెళ్లి కార్ల నెంబర్లని మార్పించి వాళ్ల జీవి తాలు తరువాత మెరుగవడం చూశారు. అదొకటేకాదు మనదేశంలో ఉదయం పనికి వెళ్లే ముందర పునిస్త్రీ కాని పాలవాడు కాని ఎదురయితే పనులన్నీ సక్రమంగా జరుగు తాయన్న నమ్మకంలాగే ఆయన ఇంటి నుంచి బైటకి రాగానే మొదట కనపడే కారు నెంబర్ తొమ్మిది చేత భాగించపడితే శుభం జరుగుతుందని తన పశుశాస్త్రానికి మరో థీరమ్‌ని జతచేర్చారుట ఈ మధ్యనే" అంటూ ఆగింది తను అటుఇటూ చూసి. ఎవ్వరూ నోరు విప్పలేదు.

"ఇక్కడ నిలబడి కొంత బలంతో ఒక ఏంగిల్‌లో విసిరిన రాయి ఎక్కడ పడు తుందో చెప్పగలిగేది శాస్త్రం. తప్పకుండా భూమిలో నీళ్లు ఉన్నాయో లేవో చెప్పగలి గేది శాస్త్రం. సూర్యుడు ఉదయం పదకొండు గంటలకి ఎలాంటి దిశలో ఉంటాడో చెప్పగ లిగేది శాస్త్రం. స్టౌమీద గిన్నెలో నీళ్లు ఉంచి ఆన్ చేస్తే ఎంత సేపటిలో నీళ్లు వేడెక్కగ లవో చెప్పేది శాస్త్రం. ఇలాంటిది మీరు చెప్పే వాస్తు శాస్త్రం చెప్పగలదా! ఉదాహర ణకి నేను కట్టిన ఇళ్లు మీ లెఖ్ఖ ప్రకారం వాస్తుగా తప్పులు ఉన్నాయని అనుకుందాం. నాకు బాధలు ఉన్నాయి. మీరు చెప్పినట్లు చేస్తే నా బాధలు తీరతాయా? గ్యారంటీ ఇవ్వగలరా? వాస్తు ఒక శాస్త్రం అయితే ఇద్దరు వాస్తు శాస్త్రులు చెప్పినదాంట్లో తేడాలు ఎందుకు ఉంటాయి? మరో వాస్తు రచయిత నూరు ఇళ్లని ఆ ఇంటిలో ఉన్న వ్యక్తుల కష్టసుఖాలు పరిశీలించి క్రోడీకరించి ఇంకో విధంగా, అదే మీరు చదివిన పుస్తకా నికి విరుద్ధంగా రాస్తే దేనిని అనుసరించాలి ప్రజ? మేడమీదకి మెట్లు ఎక్కడ పెట్టుకుంటారు? ఏడు తలుపులు ఉండాలా? లేక ఎనిమిది ఉండాలా" అంటూ అతి సౌమ్యంగా ప్రశ్నించింది ఆయ నని. పూసలదండ ధారి మొహంలో కత్తివే టుకి నెత్తురు చుక్కలేదు.

"మీ పసుపతిగారు ఇండియా వస్తారా ఎప్పుడైనా?" అనడిగారు ఎవరో వెనక నుంచి.

"వద్దామనే ఉంది ఆయనకి. కానీ ఆయన ఆగకూడని చోట కారుని ఆపి, కార్ల నెంబ ర్లని పుస్తకంలో నోట్ చేసుకుంటుంటే ఇతర ప్రజలకి ఇబ్బందిగా ఉందని ఆయనని బైటకి వెళ్లకుండా కాపుదల పెట్టారు. ఆరు నెలల క్రితం ఆయన కనిపించినపుడు 'నాకు అంతర్జాతీయ ప్రైయిజ్ వస్తుంది. థియరీ కూలంకషంగా రాసి పంపేను' అని నాతో అన్నారు" అంటూ చర్చని ఆపుచేసి సంధ్య కోసం ఎదురుచూడసాగింది తను.

చేతిలో గ్లాసుతో సంధ్య తిరిగి వచ్చి కాఫీ గ్లాసందిస్తూ,

"ఆ మగాళ్ల మధ్య మనకెందుకు? ఆ వైపు వెళ్లి కూర్చుందాం" అంటూ తనని కుర్చీలోంచి లేవదీసి స్త్రీలు కూర్చున్న చోటుకి తీసుకెళ్లింది.

"నీకు రాఘవ దగ్గిర బంధువులని పరి చయం చేస్తాను" అంటూ తన చేయి పట్టుకు లేవదీయబోతే వద్దని వారించి సంధ్యతో కబుర్లలో పడింది.

"శుభవార్త విన్నాను నిజమేనా?" అంటూ ఒక ప్రశ్న వినపడింది వెనకాల నుంచి.

"అంతా వెంకటేశ్వరస్వామి దయ, ఈ మూఢాలు వెళ్లాక ముహూర్తాలు పెట్టి కుంటాం. అన్నీ సవ్యంగా జరిగితే స్వామికి కళ్యాణం చేయిస్తానని మొక్కుకున్నాను. దానికి నాలుగు నెలలు ముందరే రాయిం చుకోవాలట" అంది రెండవ స్త్రీ.

"మీ అబ్బాయి ఆగస్ట్‌లో అమెరికా వెళ్తు న్నాడుట. స్కాలర్‌షిప్ కూడా వచ్చిందని విన్నాను. కంగ్రాట్స్. ఇల్లు మారేరుట?" అంది మరో కంఠం.

"మేము ఉంటున్న ఫ్లేస్‌లో ఏదో దోషం ఉందిట. ఎందుకైనా మంచిదని మురళీనగ



ర్‌కి మారి ఒక సంవత్సరమైంది. ఇప్పుడు అంతా బాగుంది వదినా" అంది ఇంకో స్త్రీ. "మన వాళ్లు సరిగ్గా తెలియక చాలా వాటిని చాదస్తాలు, పాత ఆచారాలు అని కొట్టిపారే స్తారు అంటారు మావారు. త్వరలో మావాడు అమెరికా వెళ్లేముందు సత్యనారాయణ వ్రతం చేద్దామనుకుంటున్నాం వదినా! నీకు ముందరగా కబురు పంపుతాను. తప్పకరావాలి వదినా" అంటూ తిరుగు సమాధానం వినపడింది.

ఇంతలో ఎవరో "సంధ్యా" అని పిలవడంతో సంధ్య లేచివెళ్లింది.

కాఫీ తాగాక సంధ్య కోసం కాసేపు చూసినా సంధ్య తిరిగి రాలేదు. ఖాళీ గ్లాసుని చెత్త డబ్బాలో గిరవాటేసి షామియానా లోంచి బైటపడి రోడ్డు మీదకి వచ్చి ఆటో ఎక్కింది. షామియానా లోంచి లేచి ఆటో ఎక్కేంతవరకు షామియానా కిందున్న చాలామంది దృష్టి వీపు మీదపడుతుంటే భరించలేక "తొందరగా పోనీయ్' ' అంది ఆటో డ్రైవర్‌తో.



"మీరు ఫైర్‌బ్రాండ్ అన్న బిరుదు సంపాదించారు మానసగారూ! రాఘవ మేనమామని మీరు దుయ్యపట్టారుట. అందరూ చెవులు కొరుక్కుంటున్నారు. ఆయన ధుమ ధుమలాడిపోతున్నారు" అంటూ నవ్వసాగింది సంధ్య.

సంధ్యతో శృతి కలిపింది తను.

"రాఘవకి ఇలాంటి వాటిమీద నమ్మకం లేదు. చిన్నప్పటినుంచీ అందరూ వాడే కర్మ, గిర్మ, రాసిపెట్టింది... లాంటి పదాలని ఊత పదాలుగా అప్పుడప్పుడు వాడతారే తప్ప వాటికి విలువ ఇచ్చికాదు" అంది సంధ్య.

"ఐయామ్ సారీ. ఏమీ మాటలాడకూడదనుకున్నా! ఎంత నిగ్రహించుకున్నా రాఘవ మేనమామ నన్ను సంభాషణలోకి లాగాడు. ఒకసారి నేను విరుచుకుపడటం మొదలుపెడితే నన్ను నేను సంభాళించుకోలేను. గుడ్డిలో మెల్ల అన్నట్లు నేను అరవలేదు" అంటూ తను సంజాయిషీ ఇచ్చింది.

"మరేమీ ఫరవాలేదు. మీరు మరో మూడు నెలల తరువాత అమెరికా వెళ్లిపోతారు. మీరు అనవసరంగా ఎందుకు మథనపడతారు" అంటూ కేరియర్‌లో తెచ్చిన తిండి పదార్థాలని టేబిల్ మీద అమర్చిపెట్టి "కేరియర్ తరువాత తీసుకెళ్తాను, నాకు పని ఉంది" అంటూ సంధ్య వెళ్లిపోయింది.

'మీరెందుకు మథనపడతారు? ' అనడిగింది సంధ్య. మథనపడడ తన గురించి కాదని, తన ధోరణి వలన రాఘవని వాళ్లు ఎలాంటి ప్రశ్నలు వేసి ఇబ్బంది పెడతారోనని సంధ్యకి తను చెప్పలేదు. రాఘవ గురించి అంతగా తను ఆలోచిస్తోందని తను ఎలా చెప్పగలదు? అది వింటే సంధ్య ఏమనుకుంటుందో అనుకుని మౌనం వహించింది తను ఆ రోజు.

"ఏమిటి నేను లేని వారం రోజులలోనే విశాఖపట్నం సీతమ్మధార ప్రాంతంలో ఉన్న అందరినీ చెరిగేసి ఫైర్‌బ్రాండ్ అన్న బిరుదుని సంపాదించేవుట" అంటూ మానస కూర్చున్న ఆఫీసు గదిలోకి ప్రవేశించాడు రాఘవ.





"నీ పరువు పోతుందని నన్ను అక్కడకి సంధ్య తీసుకెళ్ళింది. నీ వలనే నాకు ఆ బిరుదు వచ్చింది. దానికి పరిహారంగా నువ్వు నాకు కాఫీ ఇప్పించాల్సిందే" అంటూ కుర్చీలోంచి లేచి కేంటీన్‌వేపు రాఘవని తోడుకెళ్ళింది.

"ఆ ఫైర్‌బ్రాండ్ టైటిల్‌తోపాటు వెరీ బ్యూటిఫుల్ అని కూడా సర్టిఫికెట్ ఇచ్చారని సంధ్య చెప్పింది" అన్నాడు రాఘవ.

"నిజం? ఆ సంగతి నాకు సంధ్య చెప్పలేదే" అంటూ ఆశ్చర్యపడింది తను.

"ఒక స్త్రీకి ఇంకో స్త్రీని పొగడడం ఇష్టం ఉండదుకదా? అదీకాక నీలో సంధ్యకన్నా ఇతర క్వాలిఫికేషన్లు ఉన్నాయి" అన్నాడు రాఘవ.

ఒక్కసారి సిగ్గుతో, ఆనందంతో మొహంలోకి రక్తం తన్నుకువచ్చి ఉండాలి. లేకపోతే రాఘవ తన మొహం వేపు ఆశ్చర్యంగా ఎందుకు చూశాడు?

అలజడిని అదుపులో పెట్టుకుని "ఇంకేమిటి సంగతులు? " అనడిగింది తను.

"ఆవేళ నీతో మాటలాడదామనుకున్న వాళ్ళకి నువ్వు అర్థాంతరంగా ఆటో ఎక్కేయడంతో ఆ అవకాశం లభించలేదు. ఈవేళ మధ్యాహ్నం ఇద్దరు భావి అమెరికన్ పౌరులు, వాళ్ల తల్లితండ్రులు నీతో మాటలాడడానికి వస్తారు. వాళ్లు వచ్చేటప్పుడు నేనూ ఉంటాను" అన్నాడు రాఘవ నవ్వుతూ. రాఘవ తను ఉంటానన్న తరువాత శాంతపడింది.

"ఈ రోజుల్లో అమెరికాలో ఉద్యోగ అవకాశాలు బాగా పెరిగాయి. అందులో ముఖ్యంగా కంప్యూటర్ డిగ్రీలు ఉన్న వాళ్లకి మరీను. రాబోయే ఐదారేళ్లలో తగిన అర్హతలు ఉన్న అమెరికన్ పౌరులు లేరు. అందుచేత పై దేశస్తులని ఉద్యోగాలలో నియమించి గ్రీన్‌కార్డ్ ఇప్పిస్తారు" అంటూ మార్కెట్ గురించి చెప్పింది తను వచ్చిన వాళ్లకి. ఆ మాటలు విని అందరూ చాలా ఆనందంగా వెళ్లిపోయారు.

తను చెప్పినట్లు ఆ రోజుల్లో కొత్తగా కాలేజీనుంచి కంప్యూటర్ సైన్స్‌లో డిగ్రీ ఉంటే సంవత్సరానికి ముప్ఫయి ఐదు వేలు నుంచి నలభై వేల డాలర్ల జీతం ఇచ్చినా అభ్యర్థులు దొరికేవారు కాదు. ఉద్యోగంలో చేరినా చేరిన ఆరు నెలలకే ఇంకో కంపెనీకి ఎక్కువ జీతం మీద మారిపోయేవారు. అది దాదాపు ఏడేళ్ల కిందటి మాట అనుకుంటుంటే "మమ్మీ డిన్నర్ తినేద్దామా? " అంటూ కాంచన ఆలోచనల్లోంచి మానసని మేల్కొలిపింది.

"నాకు పని ఉంది" అంటూ డిన్నర్ అయేక తన గదిలోకి వెళ్లి కాగితాలు ముందర వేసుకుని పనిచేయబోయింది. కాని మనసు పనిమీద లగ్నంకాక జ్ఞాపకాలలోకి మానస ఒరిగింది.

రోజులు తొందర తొందరగా గడిచిపోతుంటే, రాఘవ ఒకరోజు,

"ఒక స్నేహితుడు ఒక్కడూ జీప్‌లో అరకులోయకి పని మీద వెళ్తున్నాడు. మనల్ని తీసుకెళ్తానన్నాడు. రెండు రాత్రుళ్లు అరకులో గడిపి మనం రైలులో తిరిగి వచ్చేద్దాం. వస్తావా మానసా? " అనడిగాడు.

ముందు "నేను ఎందుకులే" అని బెట్టు చేసి చివరికి ఒప్పుకుంది తను.

దారిలో అనంతగిరి దగ్గర దిగి కాఫీ తోటలు చూసి భిల్లు యువతులు వేసుకున్న దుస్తులలో ప్రత్యేకత గమనిస్తూ అరకు చేరేసరికి దాదాపు ఒంటిగంటన్నరయింది. లంచ్ తిని కాస్సేపు నిద్రపోయి లేచేసరికి చల్లని గాలి వీచడం మొదలయింది. ఒక్కసారి వాన అతి దట్టంగా కురిసి, దగ్గరగా ఉన్న కొండల మీదున్న మేఘాలన్నింటినీ కరిగించి వేసి చీకటిపడుతుంటే మేఘాలు లేని ఆకాశం మీద వెలుతురు రావడం ఆరంభమైంది. పౌర్ణమి రోజు కాబోలు, చంద్రుడు విచిత్రంగా వెలిగిపోతూ ఆకాశం మీదకి సిగ్గుపడకుండా ఉబికి బైటకి

వచ్చాడు.

"తొందరగా డిన్నర్ కానిచ్చి కాసేపు అలా లోయలో నడిచివద్దామా?" అన్నాడు రాఘవ.

"నాకు భయం బాబూ! నేరాను. ఇక్కడ చిరుతపులులు ఉంటాయంటారు" అంది సంధ్య.

"కమాన్ మమ్మీ, మనం నలుగురం. మనల్ని ఏ చిరుతపులి భయపెట్టదు" అన్నాడు పదహారేళ్ల రవి సంధ్యతో.

డిన్నర్ తొందరగా కానిచ్చి ఏడు గంటలకి నడకకి బయలుదేరారు. రోడ్డుమీద జనసంచారంలేదు. పడ్డ వానంతా ఏమైందో తెలియదు కాని రోడ్డు అంతా శుభ్రంగా ఉంది. రోడ్లమీద ఉన్న వీధి లాంతర్లు కొవ్వొత్తులు వెలిగినట్లు వెలుగుతూ, చంద్రకాంతితో ఓడినట్లు నీరసంగా ఉన్నాయి.

"కాస్త తొందరగా నడిస్తే తిన్న తిండి అరుగుతుంది" అంటూ రాఘవ తొందరగా నడుస్తుంటే తను రాఘవని వెంబడించింది. సరిగ్గా వ్యాయామం అలవాటులేని సంధ్య వెనకపడుతూ, "రవీ నన్ను వదిలేయకు ఒంటరిగా, పులులు ఉంటాయి" అంటూ రవిని ఆపింది.

పిండారపోసిన వెన్నెల! వెండి రంగుని చెట్లకి, భూమికి, మనుష్యులకి పూత పూసిన వెన్నెల.

చురుకుగా నడుస్తున్న రాఘవ వెనక్కి తిరిగి ఆగాడు. సంధ్య, రవిలు దాదాపు నూట ఏభై, రెండు వందల అడుగులు వెనకపడి కబుర్లు చెప్పుకుంటూ మెల్లగా నడిచి వస్తున్నారు. రవ్వంత ఒగరుస్తున్న తను, రాఘవ దగ్గరగా చేరే సమయానికి వేగం పెంచి రాఘవని దాటబోయింది. చీర మడతపడిందో, కాలు లోతుగా ఉన్న ప్రదేశంలో ఆనుకుందో కాని తూలి భూమిమీద వాలబోతుంటే రాఘవ వచ్చి అందుకున్నాడు. వెన్నెల కాంతిలో రెండే రెండు సెకన్లు, రాఘవ భుజానికి తన భుజం తగిలింది. సొంతం తన మీద వాలిపోయిన మానసని తిరిగి నిలబెట్టాడు రాఘవ. రాఘవని అలా స్పృశించినందుకు అలజడి, ఆనందం. వెనకాల నడిచి వస్తున్న సంధ్య, రవి తను రాఘవ భుజం మీద ఆనుకుని పోవడం చూశారేమోనని భయం. రాఘవ ఏమనుకున్నాడో అని సిగ్గు. అన్నీ ముప్పిరికొనగా, అంత చలిలోనూ ఒంట్లోంచి వేడి పుట్టి, నుదుటని చమట ఉబికింది. బొడ్డున దోపుకుని ఉన్న రుమాలుని తీసి మొహం తుడుచుకుంటుంటే సంధ్య "తొందరగా నడిచేసరికి చమట పట్టేసింది" అంటూ తనూ రుమాలుని ఊడతీసి నుదురుమీద రుద్దుకుంది. తనేమీ మాటలాడలేదు.

"జనసంచారానికి దూరంగా వచ్చేసినట్లున్నాం. మెల్లిగా నడుస్తూ వెనక్కి వెళ్దాం" అన్న రాఘవ మాట విని వెనక్కి మళ్లారు. ముందర రాఘవ, సంధ్య నడుస్తుంటే వెనకాల రవితో కబుర్లు చెబుతూ తను నడిచింది. అరగంట గడిచేక గెస్ట్‌హౌస్ చేరారు.

"మీరు రావడం వలనో ఏమో కాని ఈ ట్రిప్‌కి వచ్చేం. ఇన్నాళ్లయి విశాఖపట్నంలో ఉంటున్నా రవి స్కూల్ పిల్లలతో ఈ లోయ చూడడానికి వచ్చాడు కాని నేను చూడలేదు. వెన్నెలలో నడక, కలుషితం కాని గాలి, కార్ల మోత లేకుండా ప్రశాంతంగా ఉంది. భలే బాగుంది కదూ? రేపూ వద్దాం" అంది సంధ్య ఉత్సాహంగా.

"లోయలో వాతావరణం ఇట్టే మారిపోతుంది. వాన పడకపోతే ఏమైనా చేయవచ్చు" అన్నాడు రాఘవ.

★ ★ ★

కొత్త ప్రదేశంలో నిద్రపట్టదు తనకి. దానికి తోడుగా ఒకటి రెండు ఎలుకలు అటూ ఇటూ జంటగా పరిగెడుతూ తను పడుకున్న మంచం మీద నుంచి గెంతుకుంటూ వెళ్లడంతో సరిగ్గా నిద్రపట్టక ఉదయమే లేచి కటకటాలతో మూసి వేసి ఉన్న





వరండాలో కుర్చీలో రగ్గు కప్పుకుని కూర్చుంది. రాఘవ అన్నట్లు లోయలో వాతావరణం మారింది. రాత్రి ఎప్పుడు మొదలైందో తెలియదు కాని వాన కురుస్తోంది. ఉన్నట్టుండి పెద్దగాలి కెరటం రాగానే నిలువుగా పడుతున్న వాన చినుకులు వంకర్లుపోతున్నాయి. గాలి ఉధృతం ఎక్కువైనపుడు పల్చని నీటి తుంపరలు కొన్ని కటకటాల కన్నాలలోంచి లోపలికి కొట్టుకువచ్చి తన మొహాన్ని తాకుతుంటే ఉక్కిరిబిక్కిరి అయింది తను. బైట కలగాపులగంగా పరిగెడుతున్న మేఘాలలాగే తన మనసులో వివిధ రకాల ఆలోచనలు పరిగెడుతున్నాయి. ముందర రోజు రాత్రి జరిగిన సంఘటనకి ప్రాధాన్యం లేదు. కేవలం యాదృచ్ఛికం. అయినప్పటికీ తన శరీరానికి గగుర్పాటు కలిగింది. రాఘవతో దగ్గరగా ఉంటూ ఆరు నెలలు గడపడానికే తను విశాఖపట్నం వచ్చింది. కాని రాఘవతో మసలడంలో ఆనందం ఉన్నా ఏదో ఒక వెలితి, ఒక అసంతృప్తి, ఏం చేయాలో తెలియని అస్తవ్యస్త పరిస్థితి. తనని పట్టుకున్నపుడు రాఘవలో ఏదైనా స్పందన ఉందా? అన్న ప్రశ్న ఉదయించినా... ఉంటే ఏం? లేకపోతే ఏవిటి? అన్న సమాధానం దానిని త్రుంచింది.

ఎంతసేపు అలా కూర్చుందో తెలియదు కాని కొండల వెనకనుంచి మీదకి ఎగప్రాకుతున్న బాలభానుని కిరణాలు కంటిలో పడగానే ఆలోచనలు ఆగిపోయాయి. మహా అయితే అర నిమిషం మాత్రమే ఆ రవితేజుని ఆనందంగా చూడగలిగింది. తరువాత కిరణాల తీక్షణతని తట్టుకోలేక కళ్లు మూసుకుంది. చెట్లు, చేమలు ఉన్నాయని కాని, నదిలో నీళ్లు పరిగెడుతున్నాయని కాని తన వేడికి మనుషులు మలమలా మాడిపోతున్నారనికాని గమనించకుండా, పట్టించుకోకుండా, ఎమోషన్ ఏమీ లేకుండా ప్రతీరోజూ యాంత్రికంగా పరిగెడతాడు సూర్యుడు.

ఎదుటవ్యక్తి ఉనికే గమనించడు, అనుకుంటుంటే రాఘవ మదిలో మెదిలేడు.

"చాలా సమయం అయిందాలేచి?" అంటూ రాఘవ వరండాలోకి వచ్చాడు.

"ఎక్కువసేపు చూడలేం కాని కొండల వెనకాల ఉదయిస్తున్న సూర్యుడు ఎంత బాగున్నాడో" అంది తను.

సంధ్య, రవి కళ్లు నులుముకుంటూ బైటకి వచ్చారు. వాచ్‌మన్ తెచ్చిన కాఫీ తాగుతూ కబుర్లలో పడ్డారు నలుగురూ.

★ ★ ★

అందరూ మధ్యాహ్నం నిద్రపోతుంటే గెస్ట్‌హౌస్ తలుపు తీసుకుని బైటకి వచ్చింది తను. ఉదయం నుంచీ కురుస్తున్న వాన తెరిపి ఇచ్చి మేఘాలలోంచి నీలం ఆకాశం కనిపిస్తుంటే ఇంక వాన పడదన్న నమ్మకంతో భుజం మీద షాల్ వేసుకుని నాలుగు అడుగులు వేద్దామని బయలుదేరింది.

"ఇక్కడ వాన ఎప్పుడు కురుస్తుందో తిరిగి ఎప్పుడు మొదలవుతుందో నిర్ధారణగా చెప్పలేం" అంటున్న గెస్ట్‌హౌస్ వాచ్‌మెన్‌తో "అదిగో ఆ చెట్లవేపు రెండు అడుగులు వేసి వస్తాను. ఉదయం నుంచీ గదిలో కూర్చుని విసుగుపుట్టింది" అంటూ మెల్లగా నడక ఆరంభించింది.

ఒక ఫర్లాంగ్ నడిచేసరికి ఆకాశంలో మేఘాలలో కనిపిస్తున్న చిల్లు క్రమేణా పెద్దదైంది. అంత వరకు హానపడుతుందేమోనన్న రవ్వంత అనుమానం మాయమవడంతో అడుగులు తొందరగా పడసాగాయి. ఎదురుగా పక్క దిశలలో కొండల నిండా చలి కాలంలో కొబ్బరి నూనె పేరుకున్నట్లు, దూదేకులవాడు దూది ఏకుతున్నపుడు కుప్పగా పడి ఉన్న పలచని ఏకిన దూదిలా తెల్లగా బరువురహితంగా కొండల్ని మేఘం గుండెకి హత్తుకున్నట్లు కనపడింది.



ఎత్తుగా ఉన్నా కొండంత ఎత్తులేని లోయలో చెట్లు ఈర్ష్యగా ఆ కౌగిలిలాంటి స్పర్శని అనుభవిస్తావా? అని అడిగితే కొండ దయతలచి కొన్ని మేఘాల తునకలని జార్చితే అవి పడిపోకుండా కొమ్మల్ని చాచి ఆప్యాయంగా మేఘాల్ని పొదివిపట్టుకుని తృప్తిపడినట్లున్నాయి చెట్లు. ఇంకా దగ్గరగా వాటిని చూస్తే బాగుంటుందని రోడ్డు మీద పరవశంతో నడిచి చాలా దూరం వచ్చిందని గ్రహించలేదు తను. ఉన్నట్టుండి గాలులు మొదలయి, క్రమేణా పెరుగుతుంటే ఆకాశం మీద వెలుతురు తగ్గి కారు మేఘాలు ఎక్కువవుతుంటే చలివేసి శాలువని కప్పుకుని వెనక్కి తిరిగి గబగబా నడవసాగింది. గెస్ట్



హౌస్ దూరంగా కనిపిస్తోంది. అది చేరడానికి కనీసం ఇరవై ఇరవై ఐదు నిమిషాలు కావాలి అనుకుంటుంటే వాన జల్లు మొదలైంది. రోడ్డుకి రెండు వైపులా లోయ. రోడ్డుని ఆనుకుని చెట్లులేవు. ఒక చిన్న చెట్టు మెంతికూర ఆకులాంటి ఆకులతో ఉంది. ఏడెనిమిది అడుగుల ఎత్తు చెట్టుకి అడ్డు కొమ్మలు లేకుండా నిటారుగా పెరిగి వాన నుంచి అట్టే రక్షణ ఇవ్వలేకుండా ఉంది. కాస్సేపటిలో జల్లు ఆగిపోతుందిలే అనుకుని దాని కింద పది పదిహేను నిమిషాలు నిలబడింది. అదే తను చేసిన తప్పు. వాన చినుకులు పెద్దవయి సన్నని రాళ్లతో కొడుతున్నట్లు మీదపడుతున్న చినుకులు బాధించ సాగాయి. వానలో పూర్తిగా తడుస్తూ వెళ్లడమా? లేక నిరీక్షించడమా? నిరీక్షణలో అర్థం ఉందా? ఏమైతే అదయిందని వానలో నడక ప్రారంభించింది. చల్లని వాన నీటితో తడిసిన చీర ఒంటికి అంటుకుంటోంది. తల, శరీరంలో

ప్రతీభాగమూ తడిసి ఒంటిమీదున్న చల్లని బట్టలు మరో ఐదు కిలో గ్రాములు పెంచ డంతో అడుగులు త్వరగా పడడంలేదు. రోడ్ల మీదున్న నీరు విస్తరించి ఉన్నపుడు తడి మట్టిలో కాళ్లు కూరుకుపోతున్నాయి అప్పుడప్పుడు. మరో రెండు నిమిషాలు గడి చేసరికి కాస్త పెద్ద చెట్టు కనిపిస్తే సేదతీర్చు కోవడానికి దానికింద నిలబడింది. అంతరం గాలలోంచి శరీరంలో ప్రతీ అణువు నుంచి వెలువడుతున్న చలి భరించడానికి వీలులే నంతగా ఉంది.

"మానసా" అన్న రాఘవ పిలుపు వినిపించగానే ఆనందంతో కళ్లు తెరి చింది. గొడుగు కింద రాఘవ, ఇంకో గొడుగుతో నిలబడి ఉన్నాడు.

"వాచ్‌మెన్ చెబుతున్నా విన కుండా బయలు దేరి వచ్చావు. చూడు ఎలా తడిసి పోయేవో" అంటూ గొడుగు తెరిచి అందిం చాడు. ఒంటి మీదున్న చలిని తగ్గించకపోయినా కనీసం మీదనుంచి పడుతున్న ముళ్ల లాంటి చినుకులు బారినుంచి రక్షణ లభిస్తుందని గొడుగు అందుకుని రాఘవ పక్కనే నడవసాగింది. ఒక్కసారి సుడి గాలి లాంటి గాలి వచ్చి తన చేతిలో గొడుగు ఎగి రిపోయింది. రాఘవ గొడుగు తిరగప డింది. వానలో తడుస్తూ గాలికి ఎదురుగా గొడుగుని ఉంచగా రాఘవ గొడుగు మామూలవడంతో రాఘవతో పాటు గెస్ట్ హౌస్ చేరారు అరగంట తరువాత. తడిసి లోపలికి వస్తున్న ఇద్దర్నీ చూసి





"అదేమిటి అలా తడిసిపోయారు? " అన డిగాడు రవి.

అరగంట తరువాత వాచ్‌మెన్ ఇచ్చిన వేడి టీ తాగుతూ తను రెండు తుమ్ములు తుమ్మింది. "జలుబు మొదలైంది. మీకు అరకు బాగా జ్ఞాపకం ఉంటుంది" అంది సంధ్య. నలుగురూ నవ్వుకున్నారు.

టీ తాగడం పూర్తయేలోగా మరో ఐదు సార్లు తుమ్మింది తను.

"మీకు అరకు బాగా జ్ఞాపకం ఉంటుంది" అంది సంధ్య రెండోసారి. అది నిజం. ముందు రోజు వెన్నెలరాత్రిలో జరిగిన సంఘటన, ఈవేళ ఒకే గొడుగు కింద వానలో నడక... అవును అరకు నాకు చాలా జ్ఞాపకం ఉంటుంది అను కుంటూ నిద్రలోకి ఒరిగింది తను.

అరకులోయకి వెళ్ళి వచ్చాక తనలో కొత్త రకం భయాలు చోటుచేసు కున్నాయి.

ఆ రెండు సంఘటనలు జరిగాక రాఘవ ధోరణిలో ఏమైనా మార్పు కనిపిస్తుందా? అని ఎదు రుచూసిన తనకి నిరాశే మిగిలింది.

అనుమానించినట్లే అరకులో వానలో తడి సాక జలుబు, తరువాత జ్వరం పట్టుకు న్నాయి. దానితోపాటు విపరీతమైన దగ్గు. రెండురోజులు జ్వరంతో మంచంమీద పడు కుని ఉన్నపుడు ఒకరోజు సెలవు పెట్టి రాఘవ తన గురించి శ్రద్ధ తీసుకున్నాడు. మర్నాడు సంధ్య పళ్ళు, ఫలహారాలు తెచ్చి కూర్చుని కబుర్లు చెప్పి వెళ్ళింది.

జరిగితే జ్వరం అంత సుఖం లేదంటారు, రాఘవ తన గురించి అంత శ్రద్ధ తీసుకు న్నాడనే నిజం తనని జ్వరం నుంచి త్వరగా

కోలుకునేలా చేసింది.

అయితే రాఘవ ధోరణిలో ఏమీ మార్పు కానరాలేదు. అంతర్లీనంగా ఎలాంటి ఆలోచనలు ఉన్నాయోకానీ బైటకి ఎప్పటిలాగానే ప్రవర్తించేవాడు.

తన ఉనికి రాఘవలో ఏమీ చలనం, స్పందన కలిగించలేదా? అన్న ఆలోచన తను ఒంటరిగా ఉన్నప్పుడు బైటకి వచ్చి మెదడుని కొరకనారంభించింది. ఒంటరితనాన్ని తగ్గించడానికి ఎక్కువకాలం డిపార్ట్‌మెంట్‌లో గడపసాగింది.

"నువ్వు ఇక్కడకి సెబాటికల్‌కి వచ్చావు. ఈ ఆరు నెలలలో యాంత్రికంగా నడుస్తున్న నీ జీవితానికి ఉత్తేజం కోసం వచ్చావు. అదేగా సెబాటికల్ సెలవుకి కారణం. కానీ ఇక్కడికి వచ్చి సామాన్యంగా నువ్వు కష్టపడే దానికంటే ఇక్కడ ఎక్కువ కష్టపడుతున్నావు. ఇంక నీకు రిలీఫ్ ఎలా వస్తుంది? " అంటూ ఒక సాయంకాలం తన ఆఫీసు గదిలోకి వచ్చాడు రాఘవ.

ఏవేవో చెప్పాలనిపించింది. అనుమానాలన్నీ తీర్చుకోవాలనిపించింది. కానీ సాంప్రదాయం, నాగరికత, మనసులో మాట బైటకి చెప్పాక ఏమౌతుందో, ఎలా రియాక్ట్ అవుతాడో అన్నది ఊహించలేక, చిరునవ్వు నవ్వింది తను.

"థాంక్స్ నువ్వు వచ్చి నాలుగునెలలు కావస్తోంది. మొండిగా, చాలాకాలంగా వదిలేసిన కొన్ని ప్రాజెక్ట్స్ ఒక కొలిక్కి తీసుకురావడానికి చాలా సహాయం చేశావు. జీవితంలోలాగే, రీసెర్చ్‌లో కూడా ఒకే ఆలోచనాసరళి, ధోరణి ఉంటే రీసెర్చ్ ఆనందంగా పరుగెడుతుంది. రెండునెలల తరువాత, మేం మళ్ళీ మా పాతధోరణికి వచ్చేస్తాం" అన్నాడు రాఘవ. ఆ మాటలు విన్నాక తన గుండె ఆనందంతో గెంతులు వేసి తరువాత మూగగా మూలిగింది.

★ ★ ★

సముద్రంనుంచి వస్తున్న చల్లగాలి వేడెక్కిన తన మనసుని చల్లపరచలేకపోయింది. కె.జి.హెచ్. బీచ్ దగ్గర ఆటో దిగి రామకృష్ణా మిషన్ బీచ్ దాటిన సంగతి గ్రహించకుండా నడక కొనసాగించింది. దాదాపు పార్క్ హోటల్‌వరకూ వచ్చాక ఒక పండు ముదుసలి శరీరంమీద ఆచ్ఛాదన ఏమీ లేకుండా చలికి ఒణికిపోతూ, "ఒక రూపాయి ఇప్పించండమ్మా. చలి బాధ తట్టుకోలేకపోతున్నాను" అన్న ఆర్తనాదం లాంటి బీద అరుపు వినగానే ఉలిక్కిపడింది. పర్స్‌లోంచి ఒక రూపాయితీసి అతనికి అందించింది.

"పిల్లాపాపలతో కలకాలం జీవించమ్మా" అంటూ దీవించి ఒదిగి మానసకి దారి ఇస్తూ తప్పుకున్నాడు. మానస తను ఎక్కడ ఉన్నానో గమనించడానికి అటూఇటూ చూసింది.

వెలుతురు, జనసంచారం ఎక్కువగా ఉన్న ప్రదేశంనుంచి జనసంచారం తక్కువగా ఉన్న ప్రదేశానికి వచ్చానని గ్రహించి ఒక్కసారి గతుక్కుమంది.

"ఈ ప్రాంతం అంత మంచిది కాదమ్మా, వెనక్కి మళ్ళండి" అన్నాడు రూపాయి అందుకున్న ముసలి.

వెనక్కి తిరిగి వడివడిగా నడక మొదలుపెట్టింది మానస. భయం తాత్కాలికంగా మనసుని ఆక్రమించడంతో ఆలోచనలు నడకమీదే కేంద్రీకృతమయి పదిహేను నిమిషాలలో తిరిగి జనసంచారం ఉన్నచోటకి చేరగానే ఆలోచనలు మళ్ళీ రొదచేయడం మొదలుపెట్టాయి.

ఈవేళ తను అంత దూకుడుగా రాఘవతో ఎందుకు ప్రవర్తించింది? రాఘవ తనకేమీ అపరిచయస్తుడుకాదు. అతని ముభావత్వం, చొరవలేనితనం తనకి కొత్తేమీకాదే? తను ఆశించినట్లు రాఘవ ప్రవర్తించలేదని మనసులో అతనిమీదకోపం పెంచుకుందా? అసలు అతనిమీద తను కోపం పెంచుకోవలసిన అవసరం ఏమిటి? మనుషులందరూ

ఒక్కలాంటివార్థుకారనీ, ఒకేలా ఆలోచించ రనీ, ఒకేలా రియాక్ట్ అవరనీ తనకు తెలుసునే, మరి ఎందుకు తను రాఘవని అలా ఆటపట్టించింది? అతనిని ఇబ్బంది పెట్టింది? రాఘవ అలా ఇబ్బంది పడుతుంటే ఆనందపడి, ఇప్పుడు దానిగురించి అంతలా ఎందుకు ఆలోచిస్తోంది?

చాలాకాలం క్రితం జరిగిన సంఘటన. తనకి జ్ఞాపకానికి వచ్చింది. కేంటీన్‌లో తనూ రాఘవా కాఫీ తాగుతున్నారు. బేరర్ రాఘవ ఇచ్చిన ఇరవై రూపాయల నోటు తీసుకెళ్ళి బిల్ పే చేయగా మిగిలిన చిల్లర తీసుకువచ్చాడు. దానిలో తళతళలాడుతున్న ఒక రూపాయి బిళ్ళ ఉంది. అందంగా మెరుస్తోంది అది. రాఘవ దానిని అందుకోబోయేంతలో తను దానిని లాగేసుకుంది.

"ఒక్కసారి చూస్తాను ఆ నాణాన్ని" అన్నాడు రాఘవ.

రెండు చేతులని పిడికిలి బిగించి చేతులను అటూఇటూ కదిపి,

"దేనిలో ఉందో ఊహించి విడిపించుకో" అంటూ రెండు పిడికిళ్ళనీ ముందరకి చాచింది.

"నాకేమీ వద్దులే" అంటూ కుర్చీని వెనక్కి జరిపి లేవబోతుంటే,

"ఓడిపోతావని భయమా? " అంటూ రాఘవని కవ్వించింది. బాగా తటపటాయించి సంకోచంతో ఒక పిడికిలిని విప్పడానికి ముందరకి చేతులు చాచబోతుంటే, తను పిడికిలి విప్పి మొండిచేయి చూపించింది.

రాఘవ మొహమంతా హతాసుడవడాన్ని చూసిందా? లేక అది కేవలం తన ఊహేనా? ఆనాడు రాఘవ మనసులో ఉన్న ఊహలేమిటి? ఇంకొకరైతే తను చాచిన పిడికిలిని వెంటనే పట్టుకునేవాడే. కానీ రాఘవ అలా చేయకుండా సంకోచించాడు. దానినిబట్టి చూస్తే ఒకటి తను రాఘవకి ఏమీకాదు. లేదా రెండవది సాంఘిక బంధాలకి, సాంప్రదాయాలకి రాఘవ చాలా విలువ ఇస్తుండాలి. ఆ రెండింటిలో ఏది సరి అయినదైనా, ఇకమీదట తను ఏమాత్రం చొరవ తీసుకోకూడదు. అతనిని కవ్వించకూడదు అనుకుంది. వెనువెంటనే తన మనసు, "ఇది దారుణం" అంటూ మూలిగింది.

"ఆటోకావాలా? " అంటూ ఆటోడ్రైవర్ అడగడంతో ఆలోచనల్ని కప్పిపెట్టి "వద్దు" అంటూ సముద్రంవైపు దృష్టి మరల్చింది. ఆలస్యంగా వచ్చిన చవితి చంద్రుడు తారల వేపు చూస్తూ అప్పుడప్పుడు మేఘాల మధ్య నుంచి సముద్రంవేపు కిరణాలని ఉత్సాహం లేకుండా విసురుతున్నాడు. చీకటిలో నల్లగా ఉన్న సముద్రం, కాస్త తెప్పరిల్లి "దొరికిందే దక్కుడు" అనుకుంటూ చంద్రుని వేపుచూసి తన రంగుని మారుస్తోంది. ఆరాధనగా చూస్తున్న సముద్రంవేపు దృష్టిని పెట్టకుండా మేఘాల వెనకాలకివెళ్ళి తారలతో సరాగాలు మొదలుపెట్టాడు చంద్రుడు. అది గమనించిన సముద్రం కోపంతో పరవళ్ళు తొక్కుతూ కెరటాలని ఒడ్డుకు విసిరికొడ్తున్నట్లు కెరటాలు బలంగా వస్తున్నాయి ఒడ్డుకి. చంద్రుడు సముద్రం గురించి పట్టించుకోవడంలేదన్న ఊహ తనలో కోపాన్ని రేకెత్తించింది. వెంటనే ఏమిటో ఈ ఊహలు. అర్థంపర్థంలేని ఆలోచనలు. తను ఏవేవో ఊహించాననిపిస్తోంది. రాఘవ తనంటే ఆసక్తి ప్రదర్శించకపోయేసరికి చంద్రుడు మేఘాల వెనకాలకు వెళ్ళడానికి సమాంతరం కల్పించుకుంటోంది తను!

తిరువనంతపురంలో జరిగిన కాన్ఫరెన్స్ తనని వివిధరకాలుగా కుదిపింది. అమెరికా నుంచి వచ్చిన తన గురించి కార్యనిర్వాహకులు ప్రత్యేకమైన శ్రద్ధ చూపించడం ఆనందం కలిగించినా, కేవలం తను పై దేశంనుంచి రావడంవలన శ్రద్ధ చూపించారా? లేక తను రాసిన, చదివిన పేపరు బాగుందని శ్రద్ధ చూపించారా? అన్న అను




మానం ఆ ఆనందాన్ని ఎక్కువసేపు నిలిపి ఉంచలేదు. మనుషుల విలువ నివశించే దేశాన్ని బట్టి ఉంటుందా? లేక మనిషి ప్రతి భమీద ఆధారపడుతుందా? అమెరికాలో తను చాలా కాన్ఫరెన్స్‌లకి వెళ్ళింది. అక్కడ నడిచే కాన్ఫరెన్స్‌లు ఇక్కడ ఇండియాలో నడుస్తున్న కాన్ఫరెన్స్‌ల కంటే ఏమీ ఎత్తులో లేవు. కానీ విదేశంలో నడిపే కాన్ఫరెన్స్ లన్నా, అక్కడ రీసెర్చ్ అన్నా అదొకరకమైన గొప్పతనాన్ని ఆపాదిస్తారు. అన్ని కాన్ఫరె న్స్‌లు అలాంటివి అనికాదు, కానీ చచ్చు కాన్ఫరెన్స్‌లు కూడా ఉన్నాయని అంటే ఇక్కడ ఎవ్వరూ నమ్మడానికి సుముఖులుగా లేరు. కొన్ని విదేశీ కాన్ఫరెన్స్‌లు ముఖ్యంగా వేసవికాలంలో యూరప్‌లో నడిపే కాన్ఫరె న్స్‌లు కేవలం డబ్బు చేసుకోవడానికే అన్నది చాలామందికి తెలియదు. తన ఫారి న్ కాన్ఫరెన్స్‌ల గురించి చెబితే ఎవరైనా ఆశ్చర్యపోతారు. కాన్ఫరెన్స్‌కి రిజిస్ట్రేషన్ ఫీజ్ మూడువందల డాలర్లు. దాదాపు ఐదా రువందల పేపర్లు అక్కడ చదువుతారు. పుస్తకరూపంలో అచ్చు వేయించడానికి తయారుగా ఉన్న పేపర్ ముందస్తుగా అందివ్వాలి. ఈ అందించిన పేపర్లని ఒక పుస్తకరూపంలో అచ్చువేసి ఇస్తారు. కాన్ఫ రెన్స్‌కి వచ్చే అతిధులకి యూనివర్శిటీలో వసతి కల్పించి, తృణమో పణమో పుచ్చు కుంటారు ప్రతిఫలంగా. ఒకేసారి నలభై, ముప్ఫై గదులలో వేరువేరు పేపర్లు చదవ డానికి ఏర్పాట్లు చేస్తారు. చాలా యూరోపి యన్ కాన్ఫరెన్స్‌లలో పేపరు, ఇంగ్లీషులోనే కాక ఫ్రెంచ్, జర్మన్ భాషలలో కూడా చద వచ్చు ఒకసారి తను యూరప్‌లో జరిగిన కాన్ఫరెన్స్‌కి వెళ్ళింది. కాన్ఫరెన్స్ గదిలో ఏడుగురు ఉన్నారు. కాన్ఫరెన్స్ అధికారిని మినహాయిస్తే, ఆ మిగిలిన ఆరుగురు పేపర్లు చదవడానికి ఉన్నారు. తన పేపర్ నాల్గవది వరుసలో. ముందర పేపర్లు చది విన ముగ్గురిలో ఇద్దరు ఫ్రెంచ్‌లో పేపర్ చదివారు. చీకటిగా ఉన్న ఆ గదిలో తనకి మంచి నిద్ర వచ్చింది... నిద్రపోయిందేమో కూడా. తన పేపర్ చదవడం మొదలయ్యే సరికి, అంతకుముందర పేపర్ చదివిన ముగ్గురిలో ఇద్దరు బైటకి పారిపోయి పారిస్ చూడడానికి వెళ్ళారు. తను పేపర్ చదువుతోంది కానీ అంతర్గతంగా ఒకటే నవ్వు. ఎవ్వరూ ఏమీ పట్టించుకోరు. అది చూసి తనకి ఆశ్చర్యమేసింది. అలాంటి కాన్ఫరెన్స్‌లు కోకొల్లలు. తిరువనంతపు రంలో జరిగిన కాన్ఫరెన్స్‌లో తనతో మాట లాడడానికి, తను చేస్తున్న రీసెర్చ్ గురించి చర్చించడానికి వచ్చినవాళ్ళు చాలామంది యువకులు. కొంతమందికి నిజంగా ఉత్సాహం ఉన్నా, కొంతమంది ఇతరుల ఆలోచనలు తనకి అవగాహన అయ్యాయి.

వాళ్ళు వేసే ప్రశ్నలకు మున్ముందు తమకి అమెరికా రావడానికి ఏదైనా అవ కాశం ఉందేమో అని ఆరాతీసే ప్రశ్నలు ఉన్నాయి. అవి చూసి తను బాధపడింది. అదే తను రాఘవతో అంటే, చిరునవ్వు నవ్వి,"ఎదుగుదలకోసం ప్రాకులాడడంలో తప్పులేదు. కానీ నిజాయితీ ఉండాలి. నీ పేపర్ మంచిదో కాదో చెప్పడానికి, ఉద్యోగ అవకాశాలు ఉన్నాయా? అని వాకబు చేయ డానికి లంకె ఉండకూడదు. ఏమంటావు? " అన్నాడు.

"నిజమే, కానీ ప్రతీదీ అంత సింపుల్ కాదు" అంది తను. తల ఊపాడు రాఘవ.

రాఘవ కాన్ఫరెన్స్‌కి రావడం తనకెంతో ధైర్యాన్నిచ్చింది. రాఘవ పేరు అందరికీ తెలుసును, రాఘవతో ఏదైనా తను ఇబ్బం దికి లోనవకుండా చర్చించగలడు. ఇరకాట పరిస్థితులలో తనని ఆదుకునేవాడు. హైద రాబాదువరకూ వచ్చి అక్కడ రాఘవ పని ఉందని ఆగిపోవడంతో తను ఒకర్తే విశాఖ పట్నంవరకూ ప్రయాణం చేస్తోంది. ఎవరి తోనూ మాటలాడాలనిపించడంలేదు. విసుగ్గా ఉంది. తొందరగా ఫలహారం

కానిచ్చి నిద్రపోతే ప్రయాణం ముగుస్తుంది అనుకుంటూ వేడెక్కిన తలని గాజుకిటికీకి ఆన్చింది. చేతిసంచీలలోంచి ఫలహార పొట్లాం తీసి సగం తినేసి మిగతాది పొట్లం కట్టి ఉంచి ఎవరైనా కనపడితే ఇచ్చేద్దామని ఉంచింది.

"మీరు బ్రాహ్మణులా?" అన్న ప్రశ్న విని తలెత్తిందితను.

అలాంటి ప్రశ్నలు వేస్తారనికానీ, అలాంటి వాటికి ఎలా రియాక్ట్ అవుతారో తనకి తెలియక మౌనంగా ఉండిపోయి ఎదుట వ్యక్తిని పరిశీలించడం మొదలుపెట్టింది.

దాదాపు నలభై ఏళ్ళు ఉంటాయి, మైసూర్ సిల్క్ చీర కట్టుకుంది. ఆమె చదువుకున్న వ్యక్తిలాగే అనిపించింది. ఆమె పక్కన బవిరిగెడ్డం వేసుకుని, కళ్ళజోడుతో ఒక పురుషుడు కూర్చుని తను ఏం చెబుతుందోనని ఆత్రంగా ఎదురుచూస్తున్నాడు.

"ఎందుకు?" అనడిగింది తను.

"ఊరికే తెలుసుకుందామని" అంది ఎదుట బెర్త్ స్త్రీ.

తను ఏమీ సమాధానమీయలేదు. కాసేపు నిశ్శబ్దం అలముకుంది.

"హైద్రాబాద్‌లో స్టేషన్‌కి వచ్చి మిమ్మల్ని ట్రైన్ ఎక్కించిన వ్యక్తిని నేను విశాఖపట్నంలో చూశాను. ఆయన మీకేమవుతారు?" అనడిగింది ఆ స్త్రీ.

"మీరు అనవసరంగా ఏవేవో ప్రశ్నలు వేస్తున్నారు?" అంటూ లేచి పలహార పొట్లాం చేతిలో తీసుకుని డోర్‌వైపు నడిచింది మానస. కాజీపేట రైల్వేస్టేషన్ లైట్లు కాబోలు దూరంగా మినుకుమినుకుమంటూ కనిపిస్తున్నాయి. తలుపుతెరచి ఉన్న కిటికీలోంచి గాలి బలంగా లోపలికి దూసుకువస్తోంది.

ఎదురు బెర్తులో కూర్చున్న స్త్రీకి తనంటే అంత ఆసక్తి ఎందుకు? తను ఒంటరిగా ప్రయాణం చేయడంవలనా? లేక కేవలం కుతూహలమా? దాని మాట ఎలా ఉన్నా, "ఆయన మీకేమౌతాడు" అన్న ప్రశ్నకి తను ఏం సమాధానం ఇవ్వగలదు?

'చిరకాల స్నేహితుడు' అని తనెందుకు చెప్పలేదు? అనుకుంటుంటే కాజీపేట స్టేషన్‌లో రైలు ఆగింది. పెట్టె దగ్గర నిలబడి, "అమ్మా ఆకలి" అని అడుక్కుంటున్న వ్యక్తి చేతిలో పేకెట్ పెట్టి తన సీటు దగ్గరకి వచ్చి నిద్రలోకి జారుకుంది.

ఉదయం ఆలస్యంగా లేచే అలవాటున్న తనకు సరిగ్గా నిద్రపట్టక ఉదయం ఐదు గంటలకే తెలివి వచ్చింది.

మంచుతెర పరుగెడ్తున్న రైలుని ముంచేద్దామని చేస్తున్న ప్రయత్నాన్ని వమ్ముచేస్తూ ముందరకి దూకుతోంది రైలు. నిస్ప్రాణంగా, నిస్తేజంగా నిర్వీర్యంగా ఉన్న ఇళ్ళన్నీ ఇంకే దారీలేక మంచుని కౌగలించుకుని చలి కాచుకుంటున్నాయి. మెల్లగా లేస్తున్న పొగలు మంచుతెరతో కరిగి దాని బద్ధకాన్ని పెంపొందించి, గాలిలోనికి. లేవకుండా భూమిమీదే తచ్చాడేలా చేశాయి. జీవన సంగ్రామం మొదలయిందని తెలియచెబుతూ బాలభానుడు విజిల్‌వేసి, సంగ్రామానికి రిఫరీ తనేనని చెబుతున్నా ప్రజలు వినే ధోరణిలో లేరు. కాస్సేపు కష్టపడి, విసుగొచ్చి మేఘాల వెనుకకి దాగుకోడానికి వెళ్ళాడు. అది చూసి ఉన్న కాస్త వనరులని మింగేసే మన రాజకీయనాయకుల్లా, దట్టంగా ఉన్న కొబ్బరిచెట్లు, యూకలిప్టస్ చెట్లు ఆ కాస్త వెలుతురుని వడకట్టి భూమి మీదున్న ప్రజలకి అందిస్తుంటే రాత్రంతా పేరుకుపోయిన చీకటి ఆగ్రహం వ్యక్తపరుస్తోంది.

ఆకాశంలో చెప్పుకోతగ్గ వెలుగులేదు. మందంగా ప్రకాశిస్తున్న సూర్యుడు ఉత్సాహరహితంగా బాణాలని విసురుతున్నాడు. ఆలస్యంగా నడుస్తున్న రైలు పట్టాలకి పక్కనే ఉన్న పచ్చికని చూసి ఒళ్ళు పులకరించి కాబోలు హుషారుగా పరుగెడుతూ, పచ్చికని పలకరిస్తూ ముందరకి పరుగెత్తిపో






# రచయితలకు మనవి

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్థంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:




'ఈనాడు' కాంపౌండ్
హైదరాబాద్, 500 082.




**ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర' లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.**

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.

2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీ లోపు మాకు అందేటట్లు పంపాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.

4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్ హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్త పడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

నవంబర్ చతుర నవల **పగటిపూట చంద్రుడు**

సమీక్షకుని పేరు: ..............................

చిరునామా: ..............................

..............................

..............................

తోంది. దూరంగా ఎకరాలకి ఎకరాలు పచ్చని వరిపైరు వెల్వెట్ గుడ్డంత మెత్తగా సాపుచేసినట్లు కనిపిస్తున్నాయి. అక్కడక్కడ ఇద్దరో, ముగ్గురో మనుషులు పొలాలలో పిండి జల్లుతూ నడుస్తుంటే, పొలాలలో నిలుచున్న నీళ్ళలో అసహాయంగా, కదలలే కుండా ఉన్న పురుగుల్ని, చేపపిల్లల్ని కొంగలు సునాయాసంగా పట్టుకుని ఆహా రంగా ఆరగిస్తున్నాయి. ప్రకృతిలో న్యాయం తక్కువ, బలం ఉన్న ప్రాణే బతుకుతుంది. బలం తక్కువగా ఉన్నవి నశిస్తాయి. అది సామాన్యమే. సముద్రపులోతులో, నదు లలో, చెరువులలో ఉన్న పురుగులు, చేపలకి కొంగలనుంచి తప్పించుకోవడానికి తక్కువే అయినా కొంత ఆస్కారం ఉంది. ఇక్కడ పొలాల్లో పురుగులకి, చేపలకి ఆ రక్షణ లేదు. సునాయాసంగా చేపపిల్లల్ని నంజుకు తింటున్న కొంగలవేపు చూడడానికి ఇష్టప డక కళ్ళు మూసుకుంది మానస. తల తిప్పి, కాస్సేపు ఆకాశంవేపు దృష్టిని మరల్చింది. ఎలక్ట్రిక్ తీగలమీద బైఠాయించి ఉన్న పిచ్చు కలు, ఇతర పక్షులు చలిని కాచుకుంటూ, ముక్కుతో తమ శరీరాలని శుభ్రం చేసుకుం టున్నాయి. ఎందుకో రైలు వేగం తగ్గింది. రెండుపక్షులు, కలివిడిగా రైలుప్రయాణం చేస్తున్న దిశలో సమాంతరంగా పరుగె త్తడం మొదలుపెట్టాయి. రవ్వంత దూరం రైలుని అధిగమించి ముందరకి వెళ్ళాయి. రైలు వేగం అందుకుంది. పక్షులు వెనకపడి ఇంక పరుగెత్తలేక కాబోలు విద్యుత్ తీగల మీద ఒగరుస్తూ ఆగిపోయాయి. పక్షులు రైలుతో పరుగెత్తడం, ఆగిపోవడం చూసి ఒక్కసారి మానస మదిలో రాఘవ మెది లాడు. పక్షులు రైలుతో పరుగెత్తడం కేవలం కాకతాళీయమా? లేక ఏదైనా కారణం ఉందా? అర్థంలేని ప్రశ్న అది అని వెంటనే మానసకి తట్టింది. తను చూస్తున్న ప్రతీ సంఘటనకి రాఘవకి లంకె పెడు తోంది. రాఘవ తనతో ఎప్పుడైనా కలిసి నడిచాడా? లేక అతను నడిచాడని తను భ్రమపడిందా? అతను తనతో నడవాలని తను అభిలషించిందా? అంతా ప్రశ్నల మయం. వీటన్నింటినీ మించిన ప్రశ్న... ఇలాంటి ఊహలు, కోరికలు తనకి ఉండడం న్యాయమా? న్యాయం తనకా? రాఘవకా? మానస మనస్సు బైటున్న వాతావరణం లాగే వికాసరహితంగా ఉంది. ఇంకేదారీలేక నిర్వీర్యంగా ఉన్న ఆ ఇళ్ళు చలిని కౌగిలిం చుకున్నట్లు తను, తనంటే ఆసక్తి కానీ, ఉత్సాహం కానీ లేని వ్యక్తిని వెళ్ళి కౌగిలిం చుకోవాలా? మానస మనస్సు అల్లకల్లో లంగా ఉంది.

మళ్ళీ రాఘవ మదిలో మెదిలాడు. తనంటే పట్టించుకోలేదు రాఘవ. ఛఛ! తనే అనవసరంగా ఏవేవో ఊహించుకుంది. తను చిన్నప్పటినుంచీ అంతే. తన కోరికలు ప్రత్యేకం.

"నీతో వేగలేకుండా ఉన్నానే, నీకు ఒక పట్టాన ఏదీ నచ్చదు" అంది అమ్మ తనని బజారుకి తీసుకెళ్ళి చీరలకోసం తిరుగు తుంటే. కౌంటర్‌కింద లేతాకు పచ్చరంగు చీర చూపించి, "అది బైటకి తీసి చూపిం చండి" అంది తను.

"క్షమించాలి, అది అమ్మకం అయిపో యింది" అన్నాడు కౌంటర్ మనిషి.

"పదమ్మా వెడదాం" అంటూ లేచింది తను.

"నీది మరీ విడ్డూరమే, ఏదీ నచ్చకుండా అమ్ముడుపోయిన చీరే నీకు కావాల్సివ చ్చిందా? " అంది అమ్మ విసుగ్గా.

"మనకి నచ్చడానికి, అది ఇతరులకి అమ్ముడయిపోవడానికి ఏమీ సంబంధంలేదే అమ్మా" అంటూ తల్లితో దుకాణంలోంచి బైటకి నడిచింది. చాలా దుకాణాలు తిరి గారు ఆరోజు. కానీ ఆ లేతాకుపచ్చ చీర మరొకటి కనిపించలేదు ఎక్కడా. నిజమే, తనకి ఏదీ ఒక పట్టాననచ్చదు, ఒకసారి నచ్చితే అది దొరికేంతవరకూ తన

ప్రయత్నం నీరసపడదు. అది దొరకదని తెలిశాక కూడా దొరకని దాని విలువ పెరుగుతుందని, దానికోసం ఆరాటం ఆగదు. అదే చెప్పింది అమ్మతో ఆనాడు.

"ఇలా ఉంటే జీవితంలో కష్టమేసుమా" అంది అమ్మ.

ఏడేళ్ళ తరువాత హైదరాబాద్‌లో అమ్ముడవకుండా పడి ఉన్న లేతాకుపచ్చచీర కొన్నానని అమ్మకి తెలియదు, తను చెప్పలేదు. ఇసుకలో అడుగులు వేస్తూ జనసంచారం తక్కువ ఉన్నచోట చతికిలపడింది మానస.

సముద్రంమీదనుంచి వీస్తున్న చల్లనిగాలి మొహాన్ని, శరీరాన్ని తాకింది. చీరచెంగుని తలమీద ముసుగుగా కప్పి ఆకాశంవేపు చూసింది. నక్షత్రాలు మిలమిలా మెరుస్తున్నాయి. మేఘాలు చంద్రునికి దూరంగా వెళ్ళిపోవడంతో, సముద్రం చంద్రుని కాంతి కిరణాలను అందుకుని శాంతపడి కాబోలు కెరటాలని మెల్లిగా ఒడ్డుకు తరుముతోంది.

డిపార్ట్‌మెంట్‌లో ఉదయం జరిగిన సంఘటన మళ్ళీ జ్ఞాపకానికి వచ్చింది.

రాఘవతో పనిచేసే సహోద్యోగి, అంతర్జాతీయ కాన్ఫరెన్స్‌లో పేపర్ చదవడానికి వెళ్తానని, తనకి ఆర్థికసహాయం కావాలని, ఇమ్మనమని అర్జీ పెట్టుకున్నాడు. ఆ పేపరు తను చదివింది. అది పరమచెత్త పేపరని నిర్ధారణగా తనకి తెలుసు. అదే రాఘవకి అంతకుముందర తెలియచెప్పింది. అలాంటి పేపర్ ప్రెజెంట్ చేయడానికి అంత ఖర్చు అనుచితం. ఆర్థిక సహాయం చేయవద్దని రాఘవకి చెప్పింది. అయినా రాఘవ ఆ మాట చెప్పకుండా ఇంకా ఏవేవో చెబుతుంటే తనకి ఒళ్ళుమండి,

"ఆ పేపర్‌లో ఏమీ సత్తాలేదు, అంత ఖర్చు అనవసరం" అంటూ కుండ బద్దలుకొట్టేలా చెప్పింది. రాఘవ కలగచేసుకుని సర్ది చెప్పబోతుంటే,

"మీరు ఎప్పుడూ ఇంతే. మనసులో ఉన్నది బైటకి చెప్పరు. ధైర్యం లేనివారు" అంటూ లేచి వచ్చేసింది.

రాఘవ ఏమనుకున్నాడో, మీటింగ్‌లో ఉన్న ఇతర సభ్యులు తను అలా విరుచుకుపడడం చూసి ఎలా రియాక్ట్ అయ్యారో. ఛఛ... తను అలా మాటలాడకుండా ఉండవలసింది. కానీ అనుకోకుండా బైటపడిన మాటలవి. ఎంతోకాలంగా దాగిఉండి సమయంకోసం వేచి, బైటపడిన ఉద్దేశ్యాలవి. అనుకుని మధనపడుతుంటే వేగంగా పరుగెడుతున్న లారీ ఒక్కసారి వేసిన బ్రేక్ శబ్దం మానసని ఆలోచనలోనుంచి మేల్కొలిపింది. చేతికున్న గడియారం ఎనిమిదిన్నర చూపిస్తుంటే మెల్లిగా లేచి చీరకి అంటుకున్న ఇసుక దులుపుకుని, రోడ్డుమీదకి వచ్చి ఖాళీ ఆటోని ఆపి దానిలోకి ఎక్కింది మానస.

★ ★ ★

రాత్రంతా నిద్రపట్టలేదు తనకి. ఉదయం లేచేసరికి తలంతా దిమ్ముగా ఉంది. రెండు ఆస్ప్రిన్ మాత్రలు వేసుకుని కాఫీ తాగేసరికి తలనొప్పి తగ్గినా, ముందటిరోజు జరిగిన ఘర్షణ రాఘవని ఎంత బాధపెట్టిందో అన్న ఆలోచన మానసని వేధిస్తుంటే పరధ్యానంగా కాలకృత్యాలు ముగించి, యూనివర్శిటీకి చేరి, తన గదిలోనికి వెళ్ళబోతుంటే మాటలు వినిపించసాగాయి.

"అవునుగానీ ఈ వేళ పేపర్ చూశారా? " డిపార్ట్‌మెంట్‌లో లెక్చరర్ వనజ ప్రశ్న వినిపించింది.

"లేదు. ఏమిటి విశేషం? విశాఖపట్నం పిల్ల మిస్ వరల్డ్‌గా ఎన్నికైందా? " అన్న విచిత్రమైన రాఘవ ప్రశ్న విని లోపల జరుగుతున్న సంభాషణ వినసాగింది.

"ఎవరో అనామకుడు గురూజీమీద హత్యాప్రయత్నం చేయబోతే, గురూజీగారి శిష్యులు అడ్డుపడి అతనిని నిరాయుధుడ్ని చేసి పోలీసులకి అప్పగించారుట"

"అతని దగ్గర ఎలాంటి ఆయుధం దొరి




కింది? పిస్తోలా? కత్తా? బాంబులా? లేక కారం జల్లి గురూజీని చంప ప్రయత్నించాడా? "

"రాఘవగారూ, మీకంతా వేళాకోళమే. అలా అయితే నేను చెప్పను" అంటూ విసుక్కుంది వనజ.

"అతనిమీద పోలీసులు కేసు నమోదు చేశారా? "

"అది ఇంకా సరిగ్గా తెలియదు. రిమాండ్ లోనికి తీసుకున్నారుట. అతను గురూజీ భక్తుడేనుట. అతనికి గురూజీ దర్శనం దగ్గరగా దొరకలేదుట. ఆశ్రమ వలంటీర్లు అతనికి గురూజీ కాళ్ళు స్పృశించే అవకాశం ఇవ్వకపోవడంవలన విసుగేసి గురువుగారి దృష్టిలో పడడానికి తను ఆ ప్రయత్నానికి పాల్పడినట్లు ఉందని పేపరులో రాశారు"

"ఆ తరువాత జరగబోయేది చెబుతా విను. గురువుగారు అతనిని క్షమించి వదిలేయమని పోలీసులకి చెబుతారు. అతనిని వదిలేస్తారు. గురువుగారి క్షమాహృదయం తెలిసిన పోలీసులు అంతకన్నా ఏం చేయగలరు? "

"మీకెప్పుడూ ఇలాంటి విషయాలు అంటే ఎకసెక్కాలే. ఇదంతా ఎందుకు చేశారంటారు? "

"ఈమధ్య షిర్డిబాబాగారి భక్తకోటి ఎక్కువై ఇతర గురువులకి పరపతి, రాబడి తగ్గింది. ఏదో ఒకటి చేయకపోతే ఎలా? ఇప్పుడు చూడు... ఇది మొదటి పేజీ వార్తయిపోయింది. రాజకీయనాయకులు, సంఘంలో పరపతి ఉన్నవాళ్ళూ, సినిమా ఏక్టర్లూ... చాలామంది ఈ అత్యాచారాన్ని ఖండించారు. కావలసినంత పబ్లిసిటీ, అదీ కానీ ఖర్చులేకుండా"

"ఇతరుల గురించి ఏమీ తెలుసుకోకుండా అలా వ్యాఖ్యానాలు చేయడం, అభాండాలు వేయడం మీకు పాత అలవాటులా ఉందే. గురూజీకి భక్తులు ఇచ్చిన విరాళాలతో కాలేజీలు వెలుస్తున్నాయి, నిరక్షరాస్యత తగ్గుతోంది. మంచి హాస్పిటల్ కట్టించి బీదలకి కూడా వైద్యసహాయం అందజేస్తున్నారు. ఇలాంటివి ఎన్నో. అవేమీ మీకు కనపడవు" అంటూ ఆగ్రహం వెలిబుచ్చింది వనజ.

"అవును, మన రాజకీయ నాయకులవలన సంఘానికి మేలు జరిగినట్లే, ఈ గురూజీలవలన కూడా మంచి జరుగుతోంది"

"అదేమిటి? వాళ్లిద్దర్నీ ఒకే కోవలోనికి చేర్చారు. ఇది చాలా దారుణం"

"వాళ్ళిద్దరి మధ్యా ఉన్న తేడాలు చాలా తక్కువ. పోలికలుచాలా ఎక్కువ. రాజకీయ నాయకులు పరిపరి కారణాలు చూపించి డబ్బు డ్రాచేసి దానిలో అతి తక్కువశాతం ఆ ప్రకటించిన కారణానికి ఖర్చుపెట్టి మిగతా పైకాన్ని సొంతానికి వాడుకుంటున్నారు. కొంత డబ్బు ప్రజలకి ఖర్చుపెట్టి వాళ్ళ బాగుకి పాటుపడడం లేదా? మరి గురూజీలు... ప్రజలు ఇచ్చిన డబ్బుని ప్రజలకి ఖర్చుపెడుతున్నారు. దానికీ దీనికీ పెద్ద తేడా లేదు. ఒకటి ప్రత్యక్షం, రెండోది పరోక్షం అంతే" అన్నాడు రాఘవ.

"ఇలాంటి వితండవాదం మీ దగ్గర ఉందని నాకు తెలియదు" అంటూ వనజ కుర్చీలోంచి లేచి బైటికి వస్తూ లోపల జరుగుతున్న సంభాషణ వింటున్న తనని చూసింది. మానసతో మాట్లాడకుండా గబగబా నడిచి వెళ్ళిపోయింది వనజ.

"ఏమిటి ఏదో ఘాటు ప్రశ్నలు వేసి వనజగార్ని దుయ్యపడుతున్నావు? ఎవరి నమ్మకాలు వాళ్లవి. లివ్ అండ్ లెట్ లివ్" అన్న తన మాటలు విని తలెత్తి చూశాడు రాఘవ. ఏమీ సమాధానం చెప్పకుండా కూర్చోమని కుర్చీ చూపిస్తూ చిరునవ్వు నవ్వేడు రాఘవ.

"నిన్ను చూస్తే నాకు ఒళ్లు మండుతుంది. ఏ చిక్కు ప్రశ్న వేసినా, ఏ జటిల సమస్య ఎదురయినా చిరునవ్వు నవ్వి దానిని దాటవేస్తావు. నువ్వు తెలియకుండా నవ్వేస్తావా?

లేక అర్జునుడు పాశుపతాస్త్రాన్ని వాడినట్లు నీ చిరునవ్వుని తెలివిగా వాడతావా? " అంటూ కుర్చీలో కూర్చుంది.

"ఇక ఆపుతావా నా గురించి? " అన్నాడు రాఘవ.

"నిన్న నీ మీద అలా అరిచినందుకు సారీ. నన్ను నేను కంట్రోల్ చేసుకోలేకపోయాను" అంది తను.

"నాకు నువ్వు బాగా తెలుసు. నీ డైరెక్ట్ ఎప్రోచ్ నాకేమీ కొత్తకాదు. కాని లెక్చరర్ రామారావు బాగా హర్ట్ అయి ఉండవచ్చు. ఒకసారి నువ్వెళ్లి అతనితో మాట్లాడితే బాగుంటుందేమో ఆలోచించు" అన్నాడు రాఘవ.

తను వెంటనే ఏమీ సమాధానమీయలేదు.

"అతను ఎలాగో కష్టపడి అమెరికా వెళ్లడానికి కొంత గ్రాంట్ తెచ్చుకున్నాడు. అతను డిపార్ట్‌మెంట్ నుంచి అర్థించిన పైకం చాలా తక్కువ. ఇంతవరకు పేపర్ ఎలాంటిది? కాన్ఫరెన్స్ మంచిదేనా? లాంటి ప్రశ్నలు వేయకుండా వీలున్నంత మట్టుకు ప్రోత్సాహం ఇచ్చేం. పేపర్ చెత్తదే కావచ్చు కాని అతను తిరగబడి పేపర్ అంత చెత్తదైతే అచ్చువేయడానికి ఎందుకు ఒప్పుకున్నారు? క్వాలిటీ పేపరా? కాదా? అని నిర్ణయించే అర్హతలు నీకు లేవు అంటూ వాదనకి దిగితే ఎవరి వాదన వీగిపోయినా డిపార్ట్‌మెంట్‌లో గొడవలు మొదలవుతాయి. అనవసరంగా రాజకీయాలకి దారితీస్తాయి" అన్నాడు రాఘవ.

"నువ్వు చెప్పిన దాంట్లో ఆవగింజంత నిజం ఉంది. రేపు నేవెళ్లేక డిపార్ట్‌మెంట్‌లో సామరస్యం నెలకొల్పేది నువ్వు. నీకు అనవసరంగా ఇబ్బంది కలిగించడం ఇష్టంలేకే నేవెళ్లి అతనితో మాటలాడతాను. లంచ్ తెచ్చుకున్నావా? " అనడిగింది తను కుర్చీ లోంచి లేచి.

"సంధ్య యధాప్రకారం పేకెట్ అందిచ్చింది. ఒంటిగంటకి రా, కలిసి తిందాం" అని రాఘవ అంటుంటే తను రాఘవ గది లోంచి బైటపడింది.



"మమ్మీ, ఏమిటి మూడుసార్లు పిలిచినా పలకలేదు, ఆర్‌యు ఆల్ రైట్? ఇంతకీ నీకు తెలిసిన రాఘవ రావడం గురించి ఖరారుగా ఎప్పుడు తెలుస్తుంది? " అంటూ కాంచన మాటలు విని వర్తమానంలోకి వచ్చింది మానస.

"రెండు మూడు రోజులలో తెలుస్తుంది. నువ్వెళ్లిపోతున్నపుడు లైట్ ఆర్పేసి వెళ్లిపో" అంటూ కళ్లు మూసుకుంది మానస.

"నాకు ఇక్కడ ఒక సంవత్సరం విజిటింగ్ ప్రొఫెసర్‌గా వుండడానికి అవకాశం ఇప్పించినందుకు థాంక్స్" అన్నాడు రాఘవ చికాగో ఎయిర్‌పోర్ట్‌లోంచి సామాన్లతో మానసతో బైటకి వస్తూ.

"దానిలో నే చేసినదేమీలేదు. అమెరికాలో ఇంకెవరినైనా తీసుకుంటే ఆ వ్యక్తికి నీకిచ్చే జీతంలో రెట్టింపు జీతం ఇవ్వాలి. డిపార్ట్‌మెంట్‌లో కొట్టుకు ఛస్తున్నారనుకో. నువ్వు తాత్కాలికంగా ఆ ఖాళీలో చేరడం వలన డిపార్ట్‌మెంట్‌లో దెబ్బలాట కాస్త చల్లపడింది. నువ్వు ఇప్పుడు చేయబోయే ఉద్యోగా

నికి ఉండవలసిన క్వాలిఫికేషన్లేమిటో? అది ఇంజనీరింగ్ విభాగంలో ఉండాలా? లేక కంప్యూటర్ విభాగంలో ఉండాలా? అన్నది వాళ్లలో వాళ్లకి తేలలేదు. రామరావణ యుద్ధం నడుస్తోంది. ఖాళీగా ఉన్న ఆ జాగాలో నిన్ను ఉంచడంవలన రెండు పార్టీలకి ఒక సంవత్సరం పోరాటానికి వ్యవధి దొరికింది. సంధి కుదిరింది. నీ క్వాలిఫికేషన్లు రెండు పార్టీలకి పనికివస్తుంది. అందుకే నీకు ఈ ఉద్యోగం లభించింది" అంది మానస.

"ఏమిటి ఇక్కడ కూడా దెబ్బలాటలా" అంటూ రాఘవ ఆశ్చర్యపడ్డాడు.

"అంత ఆశ్చర్యపడడానికి ఏమీలేదు. మెల్లిగా డిపార్ట్‌మెంట్‌లో ఉన్న పార్టీలు, కక్షలు గురించి చెబుతాను. ఈ సంవత్సర కాలంలో నువ్వు ఎవరి పక్షమూ మాటలాడకు. అదేదో పీటర్ సెల్లర్స్ సినిమాలోలా అన్నింటికీ ఒక చిరునవ్వు కొడుతూ ఉండు. నీ చిరునవ్వు చూసి వాళ్లు ఐస్ అయిపోతారులే" అని కాస్సేపాగి "ఆ సూజన్ దగ్గర మాత్రం చిరునవ్వు చిందించకు" అంది మానస.

నోరు వెళ్లబెట్టేడు రాఘవ ఉపోద్ఘాతం లేకుండా ప్రవేశపెట్టిన సూజన్ గురించి ఆలోచిస్తూ

ముందర మానస నడుస్తుంటే వెనకాలే ట్రాలీ తోస్తూ ఆమెని అనుసరించాడు రాఘవ.

సాయంకాలం నాలుగు గంటలయింది. ఆగస్ట్ నెల సూర్యుడు తీక్షణంగా లేకపోయినా బాగానే తేజస్సుని ప్రకటిస్తున్నాడు. ఉష్ణోగ్రత దాదాపు ఇరవై డిగ్రీల సెంటీగ్రేడ్ ఉంటుందేమో. లేక మిచిగన్ మీద నుంచి వస్తున్న చల్లని గాలి ఉష్ణోగ్రతని ఐదు డిగ్రీలు తక్కువగా ఉంచినట్లనిపిస్తోందో. వేసుకున్న కోటు గుండీలు పెట్టుకోవడానికి ట్రాలీని నిలుపుచేశాడు రాఘవ. రాఘవ నిలుచుండడం గమనించకుండా ముందరకి నడిచి వెళ్లి వెనక్కి తిరిగి రాఘవ వెనకపడ్డాడని గ్రహించి

"చలేస్తోందా? అయామ్ సారీ! ఒక జాకెట్ తీసుకు రావలసింది" అంటూ నొచ్చుకుంది మానస.

"మరేమీ ఫరవాలేదు. ఒక్కసారి విశాఖపట్నం నుంచి దిగేసరికి తేడా ఎక్కువై రవ్వంత చలిగా అనిపించింది. ఇప్పుడు బాగానే ఉంది" అంటూ ట్రాలీని తొందరగా తోసి మానసని కలుసుకున్నాడు రాఘవ.

"నేను ట్రాలీని తోసేదా? " అంటూ ట్రాలీని లాక్కోబోయింది మానస.

"భలే దానివే! నేను ఉండగా నువ్వు ట్రాలీ తోయడమేమిటి? " అంటూ వారించేడు రాఘవ.

"ఆడవాళ్లు ఇలాంటి పనులు చేయకూడదని నీ ఉద్దేశ్యమా? ఇంటి పనులు, పెరటిలో పనులు అన్నీ నేనే చేస్తాను. ఒకరోజు ఏమైంది తెలుసా? మా ఇంటిలో బేస్‌మెంట్‌లోకి నీళ్లు వచ్చేశాయి. రాత్రి పది గంటలయింది. నేను ఒక్కర్తినే ఇంటిలో ఉన్నాను. నీటి మట్టం క్రమేణా పెరిగితే బేస్‌మెంట్‌లో ఉన్న సామాన్లు పాడయిపోతాయి. నీటిమట్టం పెరగకుండా ఉండాలని రాత్రంతా బాల్చీతో నీళ్లని బేస్‌మెంట్ నుంచి మీదకి మోశాను. ఉదయానికి ఒళ్లు పులిసిపోయిందనుకో" అంటూ నవ్వింది మానస.

'మానస నవ్వు! చాలాసార్లు దానిని తను చూశాడు. గలగలా పారే నది చేసే శబ్దం లాంటి నవ్వు. కితకితలు కలిగినపుడు ఉద్భవించే నవ్వులాంటి నవ్వు.

చాలాకాలమైంది ఆ నవ్వు చూసి, అనుకున్నాడు రాఘవ.

"ఏమిటి అలా పరధ్యానంలో పడిపోయావు? " అంటూ ఆలోచనలోంచి మేల్కొలిపింది మానస.

"సారీ" అంటూ ట్రాలీని తోస్తూ మానస ఒక కారు దగ్గర ఆగడం చూసి ట్రాలీని

నిలుపుచేశాడు. డిక్కీ తలుపు తెరిచింది మానస. అత్యంత శుభ్రంగా ఉంది డిక్కీ. విమానంలో కన్వేయర్‌బెల్ట్ మీద కదిలేట ప్పుడు అంటుకున్న దుమ్ము, ధూళి, మరక లతో ఉన్న సూట్‌కేస్‌లని దానిలో ఉంచడా నికి అరక్షణం సంశయించి మెల్లిగా సూట్ కేస్‌లని, చేతిసంచీని లోపలి ఉంచాడు.

"సీట్‌బెల్ట్ పెట్టుకో. అది ఇక్కడ రూల్, లేకపోతే నాకు నూరు డాలర్ల ఫైన్ వేస్తాడు పోలీస్ ఆఫీసర్" అంటూ కారుని మూడంతస్థులు దింపి లాఘవంగా రోడ్డు మీదకి మళ్లించి ఏనైహైమ్ రోడ్డు దారి పట్టించింది.

"ఇంటర్‌స్టేట్ రెండు వందల తొంభై నాలుగు, తొంభై నాలుగు హైవేల మీద ఉత్తరంగా అరవై అరవైఐదు మైళ్ల ప్రయాణం చేయాలి" అంటూ ఎందుకో రాఘవ వేపుచూసింది మానస.

ఒక్కసారి రాఘవ శరీరం గగుర్పొడి చింది.

"చలివేస్తోందా? " అంటూ కారులో హీట ర్‌ని ఆన్ చేసింది.

అంత చప్పున తనకి చలివేస్తోందని మానస గ్రహించినందుకు ఆశ్చర్యం వేసి ఆమెవేపు పరీక్షగా చూశాడు. 'చాలాకాలం తరువాత తను మానసని చూస్తున్నాడు. ఆనాటి మానస రూపం మసకబారినా ఈ గడిచిన కాలంలో ఆమె హావభావాలు తనకి అప్పుడప్పుడు ఇతరులలో కనిపించేవి.

అలనాడు చెవులకి జూకాలు వేసేది. దానికి బదులుగా రవ్వలదుద్దులు చెవి తమ్మె మీద చోటుచేసుకున్నాయి. మానసకి ఇష్టమైన రంగు ఆకుపచ్చరంగు. చెవి దుద్దు లకి ఉన్న ఏడు పొడులలో ఆరు ఆకుపచ్చవి మధ్యని ఎరుపుపొడి దుద్దులు తమకి లభిం చిన ఆనందాన్ని వదులుకోవడానికి ఇష్టంలే దన్నట్లు తరచి పట్టి పట్టుకున్నాయి చెవి తమ్మెలని. గతంలో వదులుగా జడవేసుకు నేది, కాని ఇప్పుడు జుత్తుని కత్తిరించు కుంది. కారు డేష్ బోర్డ్ దగ్గర ఉన్న ఖాళీ లలోంచి వస్తున్న ఫేన్ గాలి మానస జుత్తుని విలాసంగా అటూ ఇటూ ఊగి స్తోంది. కొన్ని వెంట్రుకలు చెవిమీద లేచిప డుతున్నాయి. అతి శుభ్రంగా ఉంది తెల్లని చెవి, చెవికింద మెడ, మెడలో తెల్ల పూసల దండ కంఠం చుట్టూ చుట్టి ఉంది. పక్క నుంచి ఒకే ఒక కన్ను, నాశిక పెదవి చివర కనిపిస్తున్నాయి. ఉత్తరంగా వెళుతున్న కారులో ఎడమ భాగంలో కూర్చున్న మానస మీద వడకట్టబడిన సూర్యకిరణాలు పడుతుంటే రవ్వంత ప్రస్ఫుటంగా ఉన్న ముక్కుపుటాలు, కమలాపండు రంగులో ఎర్రగా మెరుస్తున్నాయి. కనుబొమలు కదు లుతుంటే వాటి నీడ లీలగా వింతగా కదు లుతోంది, మాట్లాడకుండా మానసని గమని స్తుంటే,

"ఏమిటి మౌనం వహించేవు? " అంటూ సొంతం మొహాన్ని రాఘవవేపు తిప్పింది.

ఇద్దరి కళ్లూ కలుసుకున్నాయి.

"ఏమీలేదు, నీలో మార్పు ఉందా? అని గమనిస్తున్నాను" అన్నాడు రాఘవ. ఒక్క సారి మానస మొహంలోకి సిగ్గు తన్నుకు వచ్చింది.

"ఏమైనా మార్పు కనిపించిందా? నువ్వు నన్ను పరీక్షగా ఎప్పుడైనా చూస్తేకదా అప్పటికీ ఇప్పటికీ తేడా తెలిసేది. అందు చేత నువ్వు నాలో మార్పు ఉందా? లేదా అని చెప్పలేవు" అంటూ మానస నవ్వింది.

'ఈమారు మానస నవ్వులో మార్పు కని పించింది. దానిలో విషాదం ఉంది. గతంలో తనని ప్రత్యేకంగా గమనించలే దన్న అపోహలో ఉంది మానస. మన సాంప్రదాయంలో పెళ్లయిన వ్యక్తి పెళ్లవ గానే అలాంటి అర్హతని కోల్పోతాడు. తనూ అంతే పి. హెచ్.డి డిగ్రీ కోసం వచ్చేసరికి తనకి ఒక కొడుకు. ఏడు అంకె తరువాత ఏ అంకె వస్తుంది? అనడిగితే ఎనిమిది అని సమాధానం వచ్చినంత సాధారణంగా




వెళ్లాయి రోజులు. అప్పటివరకు ఇరవై ఏడేళ్ల తనకి మర్నాటి గురించి భయం కాని రోజులు గడిచిపోయేయన్న బాధకాని అప్పట్లోలేవు. యాంత్రికం పెళ్లి, శోభనం, రమించడం, కొడుకు పుట్టడం అన్నీ యాంత్రికం... మనుషులకీ జంతువులకీ తేడా ఉందని గ్రహించని కోట్ల జనాభాలో తనొకడు. అదొక రకమైన స్తబ్ధత, జీవితంలో చలనం లేని రాయి! ఎక్కడ వేసిన గొంగళి అక్కడే ఉన్నట్లు ఆలోచనలు లేకుండా, ప్రత్యేకమైన అభిరుచులు లేకుండా దొర్లుకుంటూ నడుస్తున్న జీవితం తనది. అందుకే మానస అంత దగ్గరగా మసిలినా తనలో ఏమీ అలజడి కలిగించ లేదు. తన యాంత్రిక జీవితం దానికి అవకాశం ఇవ్వలేదు.

మానస... మానస! బాగా కలుపుగోరు మనిషి. చమత్కారంగా మాట్లాడుతుంది. మంచి ఉన్నతమైన ఉద్దేశ్యాలు కలది. తనకా ఒక్క చదువు మినహాయిస్తే ఏ టాపిక్‌మీదనైనా తన ఉద్దేశ్యాలు సున్నా. తనకీ మానసకీ ఉన్న భేదం అంత ఉండబట్టే ఆమెతో మాటాలాడడానికి తను చొరవ చేసేవాడు కాదు. అందుకే మానస తనని ఆటలు పట్టించేది అయిన దానికి కాని దానికి. ఆవేళ తనకి బాగా జ్ఞాపకం. ఇద్దరూ ఐఐటి కేంటీన్‌లో వెజిటబుల్ కట్లేట్ తిని, టీ తాగాక బేరర్ తెచ్చిన రూపాయి లాగుకుని గుప్పెట్లో మూసి దేనిలో ఉందో చెప్పుకోచూద్దాం అని గుప్పెళ్లు చాచింది. పిడికిలి విప్పమని ఛాలెంజ్ చేసింది. అది తన భ్రమే కావచ్చు కాని అందరూ తమనే చూస్తున్నారనిపించింది. తనలో ఉన్న రవ్వంత ధైర్యం సడలింది. పిడికిలి విప్పుదామా? వద్దా? అన్న సంశయంలోంచి బయటపడేలోగా పిడికిళ్లు తెరచి రూపాయి నాణేన్ని తన చేతిలో పెట్టి తన కళ్లలోకి చూసి పగలపడి నవ్వింది. తను తలవాల్చేసుకున్నాడు, ఆలోచిస్తున్నాడు రాఘవ.

"అదంతా పరధ్యానమా? లేక జెట్‌లాగ్ ప్రభావమా" అన్న మానస మాటలు వాస్తవంలోకి తెచ్చాయి రాఘవని. ఏం చెప్పాలో తెలియలేదు.

"చికాగో పట్టణం పొలిమేరకు దాటినట్లున్నామే? " అన్నాడు హైవే పక్కని ఉన్న ఇళ్ల సాంద్రత తగ్గడం చూసి.

"మరొక్క ఐదు నిమిషాలలో మనం ఇలినాయి రాష్ట్రం వదిలి విస్కాన్సిన్ రాష్ట్రంలోకి ప్రవేశిస్తాం. ఆ తరువాత నలభై నిమిషాలలో ఇల్లు చేరతాం" అంటూ కారు వేగం పెంచింది మానస. రోడ్డు పక్కని ఉన్న చెట్ల ఆకులు రంగులు మారుతున్నాయి. ఒకే చెట్టు మీదున్న ఆకులు అన్నీ ఒకే రకంగా లేవు. అక్కడా ఇక్కడా ఒకటో రెండో హరిత వర్ణం ఉన్న ఆకులు ఉన్నా మిగతావన్నీ పసుపు, ఎరుపు, బ్రౌన్ రంగులలో మెరిసిపోతున్నాయి.

"ఆకులు అందంగా ఉన్నాయికదూ? " అనడిగింది మానస తన ఆలోచనల్ని పసికట్టి.

"అవును అందంగా ఉన్నాయి"

"కాని విషాదమేమిటంటే అంత అందమైన ఆకులు త్వరలో రాలిపోతాయి. కింద పడిపోయిన ఆకుల మీద మంచుపడి వాటిని కుళ్లపెట్టిస్తుంది. మనిషిగా పుట్టే కంటే అడివిలో మ్రానై పుడితే బాగుండేది అంటారు. చెట్లు ఎవరికీ హాని కలిగించవు, నీడని, గాలిని ఇస్తాయి. ఏమీ కోరవు. ప్రకృతిమీద ఆధారపడతాయి. నీళ్లాధారం లేక పోతే చనిపోతాయి. వేళ్లలో కీటకాలకి, చీమలకి ఆహారం అందిస్తాయి. అది ఏమీ హాని చేయకపోయినా ఎంతమంచి చేసినా,

మనుషులు వాటిని కొట్టేస్తారు. వంటచెరకుగా వాడుకుంటారు" అంటూ విషాదంగా చెట్లవైపు చూసింది.

చెట్ల అందం విహ్వాలంగా ఉండటం చూసి "ప్రకృతిలో ఇలాంటి అందం ఉందని



ఇప్పుడే తెలిసింది" అంటూ మానసవైపు తిరిగాడు రాఘవ.

"ఇంటికి వెళ్లాక వంట పూర్తవడానికి ఒక గంట పడుతుంది. అంతలో నువ్వు స్నానం చేసి ఒక బీర్ కొట్టేలోగా డిన్నర్ తయారవుతుంది" అంటూ మానస సంభాషణ ఇంకోవైపు మళ్లించింది.

"బీరా? అది నేనెప్పుడూ తాగలేదు. తాగితే కాళ్లు గాలిలోకి తేలిపోయి కిందపడిపోతాను. లేదా ప్రేలాపన మొదలెడతాను. కడుపులో దాచుకున్న నిజాలు తాగినప్పుడు బయటకి వచ్చేస్తాయంటారు. అమ్మో లాభంలేదు" అన్నాడు రాఘవ.

"నీ సంగతేమోగానీ నేను ఒక డ్రింక్ తీసుకుంటాను. అలా నోరు వెళ్లబెట్టకు. ఇది అమెరికా, అగనంపూడి కాదు. అది తాగితే ప్రేలాపనలోకి దిగి మనసులో ఉన్నది బయటికి చెప్పేస్తానేమోనని నేనూ నీలాగే అనుకునేదాన్ని. ఇంతవరకూ ఎప్పుడూ అలా జరగలేదు. నేను తాగినా ఏమీ బయటపడను. ఏమో నీ కంపెనీలో ఆ ధోరణి మారుతుందేమో" అంటూ నవ్వింది.

'మళ్లీ ఆ నవ్వులో విషాదం. విషాదపు జీర ఉన్నా ఆ నవ్వు ఎంత బాగుందో.' అనుకున్నాడు రాఘవ.

సూర్యుడు మెల్లగా కొండ దిగి పోతున్నాడు. మధ్య మధ్య సూర్యకాంతి వస్తోంది. చెట్లు, గుట్టల నీడ కారుమీద పడుతోంది. అడపా తడపా వస్తున్న వెలుతురులా మానసలో ఉత్సాహం, రవ్వంత విషాదం కనిపిస్తోంది.

'మానస ఏదో టెన్షన్‌కి గురవుతోంది. ఎందుకు? కూతురు గురించా? భర్త గురించా? లేక ఆఫీసులో ఇబ్బందులా? చాలామటుకు ఆనాటి మానసలా ఈ మానస కనిపిస్తున్నా ఏదో తేడా ఉంది. ఇదమిద్ధంగా చెప్పలేని తేడా ఉంది. రెండు సంవత్సరాల పాటు తనకి ఉత్సాహం, ధైర్యం నూరిపోసి తనని ముందరకి నెట్టిన మానసకి సహాయం చెయ్యాలి. ఎలాంటి సహాయమైనా ఫరవాలేదు' అనుకున్నాడు రాఘవ.

"నీలో కొత్తగా ఓ మార్పు కనిపిస్తోంది. ఇదివరలో... అదే.. చాలాకాలం క్రితం నీలో బెరుకుతనం, సంకోచం ఉండేవి. ఇప్పుడు అవి బాగా తగ్గినట్టున్నాయి. కానీ ఇప్పుడు నువ్వు ఆలోచనల్లో పడిపోతున్నావు. అప్పట్లా లేదు. నేను నీకు చెప్పక్కర్లేదనుకో. ఆలోచన అలజడికి ముఖ్యకారణం సుమా!" అంటూ హైవేమీద నుంచి ఎగ్జిట్ తీసుకుంది మానస.

ఎగ్జిట్ మూడువందల ముప్ఫై మూడు అని రాసి ఉంది. కానీ అది ఏ ఊరికి వెళ్తుందో రాయలేదు. "అది రాస్తే బాగుండేది" అన్నాడు రాఘవ.

"నువ్వు చెప్పినది రైటే. ఆ సంగతి వాళ్లు ముందరే ఆలోచించేరు. ఈ ఎగ్జిట్ తీసుకుంటే ఏఏ ఊర్లు వస్తాయో మూడు, నాలుగు మైళ్లు ముందరనుంచే బోర్డులు వస్తాయి. తరువాత నాలుగు, ఐదు నిమిషాలలో ఎలా వెళ్లాలో నువ్వు ఒక నిర్ణయానికి వచ్చి ఎగ్జిట్ తీసుకోవడానికి తయారుగా ఉండాలి. ఆఖరి క్షణంలో ఎగ్జిట్ తీసుకోవాలా వద్దా? అంటూ ఆలోచించకూడదనే దాని మీద పేర్లు రాయరు" అంటూ కారు వేగం తగ్గించింది మానస.

"ఇంటిలో ఎవ్వరూ లేరు. ఆయన బిజినెస్ పనిమీద లాస్‌ఏంజెల్స్ వెళ్లారు. రేపు రావచ్చు. మా అమ్మాయి కాంచన తోటి స్కూల్ పిల్లలతో వేసవి కాలం కేంప్‌కి వెళ్లింది. ఇంకో నాలుగు రోజులు పోతేనే కాని రాదు" అంటూ కారులో హీటర్‌ని ఆఫ్ చేసి రాఘవ వేపు చూసింది.

"అమెరికా నాకు కొత్త అయినా ఇండియాలో ఇంగ్లీషు సినిమాలు బాగా చూడడం వలన ఈ దేశం తెలిసినట్టే అనిపిస్తోంది" అన్నాడు రాఘవ.

"సర్లే, బడాయిపోకు. ఇలా చాలామంది




అనడం నేవిన్నాను. అలా అని ఊరుకుంటే ఫరవాలేదు. ఇక్కడ ధోరణి తప్పని, తమకి తెలిసినదేదో రైటని దీర్ఘాలు తీస్తారు. ఇక్కడ ఎలా మసలాలో కూడా చెబుతుంటారు. తెలియని దాని గురించి తెలిసినట్లు మన వాళ్ల ప్రవర్తించడం మామూలే" అంది మానస. చిరునవ్వు నవ్వేడు రాఘవ.

"నాకు ఒక మావయ్య హైద్రాబాదులో ఉన్నాడు. ఆయన సెక్రటేరియట్ లో ఫైనాన్స్ విభాగంలో ఏదో ఉద్యోగంచేసి రిటైరయేడు. ఏ రాజకీయనాయకుని పేరు ప్రస్తావనలోనికి వచ్చినా 'ఆc వాడా! వాడు నాకు తెలియకపోవడమేమిటి? ఇప్పుడంటే మినిష్టరయేడు కాని బర్కత్‌పురాలో కౌన్సిలర్‌గా ఉన్నపుడు మా ఇంటికి తరచూ సలహాకి వచ్చేవాడు' అంటూ డప్పాలు కొట్టేవాడు. చాలా గొప్పవాళ్ల పరిచయం తనకి ఉందని అందుచేత తానూ గొప్ప వాడినన్న భ్రమ ఇతరులకి కలిగించడంకోసం తెగ అవస్థపడేవాడు. తన సలహా చాలా ఉత్కృష్టమైనదని చెప్పుకునేవాడు" అంటూ రాఘవ ఏమీ మాటలాడకపోవడంతో ఆగింది.

"సర్లేవయ్యా! నీకు అమెరికా గురించి తెలుసు. అంత సెన్సిటివ్ అయితే ఎలా? ముభావం తగ్గించు" అంటూ స్వంత ఇంటి డ్రైవ్ వే లోనికి కారుని మళ్లించింది మానస.

"భలేదానివే, నువ్వు అలా అన్నదానికి నొచ్చుకున్నాననుకున్నావా? కుండబద్దలు కొట్టినట్లు మాటలాడడం నీకు అలవాటేగా. గలగలా నువ్వు మాటలాడడం విని చాలా కాలమైంది కదూ, అదే చూస్తున్నాను. కాస్సేపు నన్ను గతంలోకి తోసేయి నీ మాటలు" అన్నాడు రాఘవ. కారు తలుపు తీసి బైటకి అడుగుపెట్టి గెరాజ్ తలుపు తెరచి కారుని గెరాజ్ లోకి నడిపింది మానస.

"ఇది నీ గది. ఎటాచ్‌డ్ బాత్రూం ఉంది. స్నానం వగైరా కానిచ్చి త్వరగా కిందకి రా. అమెరికాలో డిన్నర్ సాయంకాలం ఆరు గంటలకల్లా తినేస్తారు. ఇప్పుడు దాదాపు ఆరు గంటలు అవుతోంది. ఏడు ఏడున్నరకి డిన్నర్ తిందాం" అంటూ రెండడుగులు వేసి వెనక్కి వచ్చి,

"నీకు కావలసిన సామాన్లన్నీ నీ గదిలో బైట ఉంచాను. ఇంకేమైనా కావాలంటే అడుగు. ఐయామ్ గ్లేడ్ యు కేమ్" అని మేడమెట్లు దిగి కిందకి వెళ్లిపోయింది మానస.

సోప్, తువ్వాళ్లు, పౌడర్ వగైరా సామాన్ల తోపాటు ఇంటిలో వేసుకుని తిరగడానికి చెప్పులు కూడా గదిలో ఉంచడం చూసి రాఘవ ఆనందపడ్డాడు.

★ ★ ★

రాఘవ నిద్రలేచేటప్పటికి కింద మాటలు వినిపిస్తున్నాయి. శబ్దం తక్కువగా ఉన్నా మానస గొంతులో జీర వినిపిస్తోంది. రెండవ గొంతు పురుషునిది. బహుశా మానస భర్త సంతోష్‌ది కాబోలు. ఇద్దరి సంభాషణ ఇంగ్లిషులో నడుస్తున్నా మధ్యలో కన్నడం మాటలు దొర్లుతున్నాయి. సంతోష్ బొంగురు కంఠంలోంచి విసుగు దల నిరసనతో మాటలు వెలువడుతున్నాయి.

"ఎంతో కొంత, అది నీకు చెప్పాలా?" అన్న వాక్యం, తలుపు తెరచుకుని బైటకి అడుగుపెట్టబోతున్న రాఘవకి వినిపించింది.

"మీ డబ్బు, మీ ఇష్టం. రెండు రోజుల క్రితం మీ టేక్స్ కన్సల్టెంట్ బ్రౌన్ ఫోన్ చేశాడు. ఇన్‌కమ్‌టాక్స్ కట్టడానికి మీరు అడిగిన గడువు దాటిపోతోందని వెన్వెంటనే కాగితాలు తీసుకు రమ్మని చెప్పాడు. చెక్ బుక్ కూడా తీసుకు రమ్మన్నాడు" అంది మానస.

"సరేసరే! ఈవేళ అతనికి ఫోన్ చేస్తాను.

ఇంతకీ అడగడం మరచిపోయాను. నీ పాత స్నేహితుడు వచ్చేడా? " అనడిగేడు సంతోష్. సంతోష్ వేసిన ప్రశ్న తీరు ఎందుకో రాఘవని ఇబ్బంది పెట్టింది.

"ఆ! సాయంకాలం వచ్చాడు. జెట్ లాగ్ కదా తెగనిద్రపోతున్నాడు" అంది మానస.

"ఎంత జెట్ లాగ్ అయితే మాత్రం దాదాపు ఐదేళ్ల తరువాత పాత స్నేహితులు కలుసుకున్నారుకదా! పాత జ్ఞాపకాలు ముచ్చటించుకోలేదా? ఇంతకీ అతనికి ఇక్కడ ఎసైన్ మెంట్ ఎన్నాళ్లు? అతను ఎక్కడ ఉంటాడు? " అనడిగాడు సంతోష్.

సంతోష్ నోటినుంచి వెలువడుతున్న ప్రతీవాక్యం రాఘవని కుదుపుతోంది.

"మన గెస్ట్‌రూమ్‌లో ఉండమందామను కుంటున్నాను. లేకపోతే అతనికి వచ్చే జీతం అంతా అద్దెకి, కాలేజీకి వెళ్లి రావడా నికి అయిపోతుంది. పాపం! సంవత్సరంలో ఏమీ మిగల్చలేడు బైట ఉంటే" అంది మానస.

"ప్రత్యేకంగా నేనేమీ చెప్పను, నీ ఇష్టం. కానీ మనమధ్య జరిగే డిస్కషన్ అంతా అతని చెవినపడుతుంది. ఆలోచించుకో" అన్నాడు సంతోష్.

మానస ఏమీ మాటలాడలేదు. కాఫీ పెర్కొలేటర్‌లోంచి శబ్దం కాస్సేపు వచ్చి ఆగింది. తలుపు మెల్లిగా తెరచి రవ్వంత శబ్దం చేస్తూ మేడ మెట్లు దిగసాగాడు రాఘవ. ఎదురుగా ఉన్న గడియారం పది గంటలు చూపిస్తోంది. హాలులో ఉన్న సోఫాలో మానస, సంతోష్ కూర్చుని పేపర్లు చదువుతున్నారు. సంతోష్ చేతిలో కాఫీ కప్పు ఉంది. రాఘవని చూసి "పన్నెండు గంటలు పైనే నిద్ర తీశావు. మా ఆయన సంతోష్" అంటూ పరిచయం చేసింది.

"ఈయన రాఘవ, నీ పాత స్నేహితుడు అంతేనా? " అంటూ నవ్వుతూ చేయి అంది·చ్చాడు.

'అంతకుముందర మానస, సంతోష్‌ల మధ్య జరిగిన సంభాషణ విని ఉండకపోతే సంతోష్ మాటలలో ఉన్న వ్యంగ్యం తనకి తెలిసేది కాదు. ఈ క్లిష్ట పరిస్థితి ఎదుర యేది కాదు.' అనుకున్నాడు రాఘవ. అయినా తేరుకుని "పాత స్నేహితులు అనే కంటే ఒకే గైడ్ కింద పనిచేసిన పాత విద్యార్థులం అనడం బెటర్. మిమ్మల్ని ఇదే మొదటిసారి చూడడం" అంటూ సంతోష్ చేయి అందుకున్నాడు.

"మీ స్నేహితునికి కాఫీ ఇవ్వవేమిటి? " అంటూ మానసకి పని పురమాయించి రాఘవతో కబుర్లలో పడ్డాడు.

"మీ గురించి మానస చేసిన ప్రయత్నం ఫలించి మీరు రాగలిగినందుకు సంతోషంగా ఉంది. బిజినెస్ మీద అటూ ఇటూ తిరు గుతూ ఉంటాను. మా అమ్మాయికి, మాన సకి మీరు మంచి కంపెనీ ఇస్తారు. ఫీల్ ఫ్రీ హియర్" అన్నాడు సంతోష్ బడబడా నవ్వుతూ.

నాగరికత! కడుపులో ఉన్న నిజమైన భావాలని దాచుకుని బైటకి ఇంకోలా ప్రవ ర్తించడం నాగరికత! సంతోష్ బైటకి అంత సంతోషం ప్రకటించడం చూసి రాఘవకి నోటమాటరాలేదు.

"కాఫీలో క్రీమ్, పంచదార ఎంత వేయాలి? " అంటూ కాఫీ కప్పు, పంచదార, క్రీమ్ తెచ్చి టేబిల్ మీద ఉంచింది మానస.

"నేను కలుపుకుంటాను" అంటూ క్రీమ్, పంచదార కాఫీలో కలుపుకున్నాడు రాఘవ.

"మానస కూడా మీలాగే ఇతరులు కాఫీ కలపడం అంటే ఇష్టపడదు" అన్నాడు సంతోష్.

మానస మాటలాడలేదు. కాఫీ చప్పరిస్తూ మానస వేపు చూశాడు రాఘవ. ఉదాసీ నంగా ఉంది మానస.

"మీరు ఇక్కడ ఒక సంవత్సరం పనిమీద వచ్చేరని మానస చెప్పింది. మీరు ఇక్కడ మా గెస్ట్‌రూమ్‌లో ఉండవచ్చు" అన్నాడు




సంతోష్.

అంతకుముందర భార్యాభర్తల మధ్య నడిచిన సంభాషణ విని ఉండకపోతే రాఘవ సరే అనేవాడేమో.

"లేదు యూనివర్సిటీకి దగ్గరగా ఉన్న హౌసింగ్‌లో గది తీసుకోవడానికి నిశ్చయించేను. థాంక్స్‌ఫర్ ది ఆఫర్" అన్నాడు రాఘవ. మానస మొహంలో మొదట్లో విచారం, వెన్వెంటనే విచారం నుంచి తేరుకోవడం గమనించాడు రాఘవ.

"అరె! మానస మీరు ఇక్కడ ఉంటారని అనుకుంటుంటే ఏం మానసా? " అనడిగాడు సంతోష్.

ఎంత సాధారణంగా మాటలని సంతోష్ ఉచ్చరించినా అవి మానసని కించపరచడానికే అని రాఘవకి అనిపించింది.

"అవును అలా అయితే రాఘవ ఇక్కడ వచ్చే జీతంలో కాస్త అయినా మిగుల్చుకుంటాడని అనుకున్నాను అంతే" అంది మానస. కాస్సేపాగి "ఈ వేళ చికాగో వెళ్ళి ఇంటికి కావలసిన పప్పు దినుసులు, కూరగాయలు తెచ్చుకుందామనుకుంటున్నాను" అంది మానస.

"నేనూ వస్తాను, నాకూ కూరగాయలు కావాలి" అన్నాడు రాఘవ.

"ఓకే నేను సాయంకాలం ఒకరింటికి వెళ్ళాలి. నేను వచ్చేసరికి ఆలస్యమౌతుంది. మీరిద్దరూ వెళ్ళిరండి" అంటూ కుర్చీలోంచి లేచాడు సంతోష్.

"నేను స్నానం వగైరా ముగించి క్రిందకి వస్తాను" అంటూ మేడమెట్లు వేపు నడిచాడు రాఘవ.

★ ★ ★

టోయోటాక్రేమీ కారు శబ్దం చేయకుండా చికాగోవేపు పరిగెడుతోంది. గంటకి డెబ్భై మైళ్ల వేగంతో కారు నడుస్తున్నా లోపల ముందర సీట్లో కూర్చున్న రాఘవకి ఇంజన్ శబ్దం వినిపించడంలేదు. నిశ్శబ్దంగా రాత్రి పదకొండు గంటలకి అడవిలో అలుముకున్న నిశ్శబ్దంలా ఉంది కారులో నిశ్శబ్దం. మెల్లిగా మానస పీలుస్తున్న ఊపిరిశబ్దం సన్నగా వినిపిస్తోంది. మానసతో సంభాషణ ఆరంభించడానికి రాఘవకి ధైర్యం రావడంలేదు. మానస మొహంలో ఉదాసీనత! ఆమెలో మూర్తీభవించిన గంభీరత్వం, "మనం మళ్ళీ ఎయిర్‌పోర్ట్ మీదనుంచే వెళ్లాలా? " అనడిగాడు రాఘవ.

"పాత దారంబటే కాస్సేపు వచ్చి పశ్చిమానికి మళ్లుతాం. ఎయిర్‌పోర్ట్ మన ఇంటికి ఎంత దూరంలో ఉందో చికాగోలో ఇండియన్ దినుసులు దొరికే ప్రదేశం అంతే దూరంలో ఉంది. మనకి అక్కడ దొరికే కూరగాయలు, తాజాగా ఉండడమేకాకుండా చాలా చవక. ఆ వీధికి వెళితే మనదేశంలో ఉన్నట్లే అనిపిస్తుంది" అంటూ కారు వేగం పెంచింది. నీలం రంగు షెల్వార్ కమీజ్ లోంచి మానస శరీరం వింత కాంతిని వెదజల్లుతోంది.

చాలాకాలం క్రితం మానసని పరిశీలనగా చూసినట్లు జ్ఞాపకంలేదు. మసకమసక జ్ఞాపకాలు... ఆ తరువాత కాలంలో మానస మరింత పొందికగా తయారయిందనిపించింది రాఘవకి. బలమైన ముక్కుపుటాలు అతి నేవళీకతగా ఉన్న చెవి, అతి లేతగా లిప్‌స్టిక్ రాసిన పెదిమలు అందంగా మెరుస్తున్నాయి. ఈ అందమైన వ్యక్తిని భార్యగా పొందిన సంతోష్ ఎంత అదృష్టవంతుడు అన్న ఊహ రాఘవ మెదడులోనికి మొదటిసారి వచ్చింది. తనకి ఇలాంటి ఆలోచనలు, ఈ వయస్సులో మొదలవడమేమిటి? పద్దెనిమిదేళ్లుగా సంధ్యతో కాపురం చేస్తున్న తనకి ఇతర స్త్రీలని చూడడం, అందచందాలు పరికించడం, సాంప్రదాయపరంగా నిషిద్ధం కావచ్చు కానీ తనేమీ విపరీతంగా ఆలోచించడం లేదు. తనకి తెలిసిన స్నేహితురాలిని చాలాకాలం తరువాత చూస్తే ఆమెలో ఏమైనా మార్పు వచ్చిందా? అని పరీక్షగా చూడడంలో తప్పేమిటి?



# ఏరినముత్యాలు

* ఓడినప్పుడు నిరాశ చెందడానికి అవకాశాలున్నాయి. కానీ ఓడిన తర్వాత మరోసారి ప్రయత్నం మానేస్తే మాత్రం మీకు జయం లభించదు.

  – బెవెర్లీసిల్స్

* జీవితంలో దేనినైనా అనుభవించదలచుకోడానికి మార్గం ముందు దానిని సంపాదించుకోవడం.

  – జింజర్‌రాగెర్స్

* ఇతరులకు సాధ్యమైతే సాయం చేయండి. అలాకాకపోతే కనీసం వారికి హాని చేయకుండా ఉండండి.

  – దలైలామా

* మాటలు మనసుకి అద్దం పడతాయి.

  – సెనెక

* వృత్తిని ఆనందంగాను, ఆనందాన్ని వృత్తిగాను మలచుకోవడమే జీవిత ధ్యేయం.

  – ఆరాన్‌బర్

* ప్రపంచమెప్పుడూ ఫలితాలకై ఎదురు చూస్తుంది. ప్రసవవేదన గురించి ఏకరువు పెట్టకుండా శిశువును చూపండి.

  – అర్నాల్డ్‌గ్లాసో

* ఒక కోరిక తర్వాత మరొకటి జన్మించే కోరికలను తీర్చుకోవడం కంటే బుద్ధి బలంతో మొదటి కోరికనే హద్దులో ఉంచుకోవడం మంచిది.

  – ఫ్రాంకోయిస్ రోచెఫాకార్డ్

* సత్ప్రవర్తన యోగ్యతేకానీ సత్ప్రవర్తనను నేర్పేవారు మరింత యోగ్యులు.

  – మార్క్‌ట్వెయిన్

* మన ఆశయాలు, మన అదృష్టం ఎప్పుడూ పరస్పర విరుద్ధంగానే ఉంటాయి.

  – ఆండ్రీమురై

* మొదట మీరు నిజాయితీగల వ్యక్తిగా మారండి. అప్పుడు ప్రపంచంలో ఉన్న దుర్మార్గుల సంఖ్య ఒకటి తగ్గుతుంది.

  – కార్లైల్

* పెద్ద పనులు చేయడానికి కాచుకుని కూర్చొన్న వ్యక్తి ఏ పనీ చేయలేడు.

  - శామ్యూల్‌జాన్సన్

* అన్ని కళలలో గొప్ప కళ అందమైన నడవడి.

  – ఎమర్సన్

సేకరణ: తరిగొప్పుల వి.ఎల్.ఎన్.మూర్తి



అను
కుని మనస్సుని సమా
ధానపరచ ప్రయత్నించినా
ఎందుకో రాఘవ దానిని సముదాయించలే
కపోయాడు.

★ ★ ★

డెబ్భైమైళ్ల వేగంతో పరిగెడుతున్న కారు రోడ్డు పక్కన ఉన్న చెట్లని, ఇళ్లని, అక్కడక్కడ కనిపిస్తున్న చెరువులని దాటి వెళ్తోంది. చెట్ల ఆకులు నీటిమీద పడి నీళ్ళకి ఒక రంగుని ఆపాదిస్తున్నాయి. 'మానస మాట్లాడకపోవడం, గంభీరంగా ఉండడానికి కారణం ఏమిటి? సంతోష్‌తో జరిగిన సంభాషణా? లేక ఇతర కారణమేమైనా ఉందా?' అనుకుంటుంటే "నీకు బాగా ఆకలిగా ఉందా? ఇంకో అరగంటలో మనం డెతాన్ వీధికి చేరుకుంటాం, వెళ్ళగానే భోజనం తినేద్దాం" అంటూ నిశ్శబ్దాన్ని ఛేదించింది.

"అబ్బే! అంత ఆకలిగా లేదు. రెండుసార్లు బాగా స్ట్రాంగ్ కాఫీ పట్టించాను. ఈ జెట్ లాగ్ వలన ఎప్పుడు తిండి తినాలో తెలియ డంలేదు కడుపుకి" అన్నాడు రాఘవ.

సన్నని నవ్వు నవ్వింది మానస. క్రమేణా ఆమె మొహంలో గంభీరత తగ్గి మామూలు మనిషయింది. దాదాపు నలభైనిమిషాల తరువాత కారు పార్క్ చేశాక రాఘవ, మానసలు కారులోంచి బైటపడ్డారు.

"నీకు మిరపకాయ బజ్జీలంటే ఇష్టం కదూ? ఇక్కడికి రెండడుగుల దూరంలో ఒక రెస్టారెంట్‌లో రుచికరమైన మిరపకాయ బజ్జీలు దొరుకుతాయి వెళ్ళి తిందాం" అంది మానస చేతులు ఊపుతూ. మాసన చేతికి ఉన్న ఆరు గాజులు, నాలుగు బంగారపు గాజులతో దెబ్బలాడుతూ ఘల్లుమన్నాయి. రాఘవ మనస్సు గతంలోనికి పరిగెత్తింది.

"శబ్దం చేస్తూ గాజులు వేసుకున్న చేయి నీలో ఏమీ చలనం, ఉత్తేజం కలిగించలేదే" అంటూ తన ముందర మానస ఆడించింది ఒకరోజు. తనకీ ఏమీ పాలుపోలేదు. ఒక్క నిమిషంలో తేరుకుని, మెల్లిగా చేతిని చాచి గాజులని చూడబోయాడు. చటుక్కున చేతిని వెనక్కి లాగుకుని విరగపడి నవ్వి, "అబ్బ! ఎంతాశ! అర్హత, ధైర్యం ఉండ వద్దూ? " అంటూ తెరలు తెరలుగా వస్తున్న నవ్వుని విరజిమ్మింది. వెలిగిపోతున్న చిచ్చు బుడ్డీలా వెలిగిపోతున్న ఆమె తెల్లటి మొహాన్ని హోళీ పండుగలో విసిరే ఇసుక రంగు వర్ణానికి మార్చింది.

మానస ఒక వింత! ఆమెతో సంభాషణ ఒక అనుభూతి. ఈ సంగతి ఆనాడు తనకి పూర్తిగా అవగాహనకి రాలేదు. కాని వెనక్కి తిరిగి చూస్తే, ఆ వింత అందం జ్ఞాపకానికి వచ్చేది. ఆలోచనల్లోకెళ్లాడు రాఘవ.

"పచ్చి మిరపకాయ బజ్జీలు అంటే పఠాన్ కోట వెళ్లిపోయేవేమిటి? ఆలోచన నీ ఒంటికి మంచిది కాదుకదా. మరి ఈమధ్య ఆలోచించడం ఎందుకు మొదలెట్టావు? " అంటూ బలవంతంగా మతాబాని ఆర్పేసి నట్లు రాఘవ ఆలోచనల్ని నలిపేసింది మానస.

మిరపకాయ బజ్జీలు, తిండి తినేసరికి రాఘవ కడుపు బాగా బరువెక్కింది.

"పద, ఇంటికి కావలసిన సరుకులు కొందాం" అంటూ గబగబా లేచింది మానస.

"ఆగాగు, అంత తొందర పనికిరాదు. నువ్వు నీ శరీరంలోనికి ఇంకా కొవ్వు చేర కుండా జాగ్రత్తపడ్డావు. నేను అలా కాదు" అంటూ కాస్త కష్టంగా, ఆయాసపడుతూ కుర్చీలోంచి లేచాడు రాఘవ.

రాఘవవేపు పరీక్షగా చూసింది మానస. ఇంతవరకూ గమనించలేదుకాని, అవును రాఘవలో మార్పు వచ్చింది, కణతల దగ్గర నెరసిన జుత్తు, కంటి దిగువ రెప్పకింద లీలగా పొడచూపుతున్న నల్లని చారికలు, రవ్వంత ఉబుకుతున్న కడుపు చూసి, "ఎక్కువ కాదుకాని మార్పు కనిపిస్తోంది. అవును తిన్నాక నీ బొజ్జ బైటకి తన్నుకొచ్చింది" అంటూ నడక వేగం తగ్గించింది మానస. రాఘవ ముఖంలోకి సిగ్గు తన్నుకువచ్చింది.

"అంత సిగ్గుపడేంత బరువేమీ పెరగలేదులే. భయపడకు" అంటూ రాఘవ పక్కన నడిచింది మానస. ఇద్దరూ పటేల్ బ్రదర్స్ దుకాణంలోనికి ప్రవేశించి ట్రాలీలో సామాన్లు చేర్చడం మొదలుపెట్టారు.

"నీకు కావలసిన దానికన్నా ఎక్కువ సామాన్లు కొంటున్నావు. వేస్ట్ అయిపోతాయి. మా ఇంటికి తరచూ భోజనానికి వస్తావుకదా" అంటూ రాఘవ కొంటున్న సామాన్లని తగ్గిస్తూ వచ్చింది మానస.

"రావాలని ఉన్నా నేను రావడం నీకు అంత మంచిది కాదేమో" అని చెప్పాలని ఉన్నా మౌనం వహించాడు రాఘవ.

సాయంత్రం ఏడు గంటలయింది మానస, రాఘవలు ఇల్లు చేరేటప్పటికి.





హాలులో కూర్చుని సంతోష్ టెలివిజన్ చూస్తున్నాడు. ఎదురుగా టీపాయ్‌మీద బీర్ బాటిల్ ఉంది.

"కమాన్, కమాన్ రాఘవగారూ బీర్ తాగుతారా? తెచ్చేదా?" అని మానసవేపు తిరిగి,

"తొందరగా వచ్చేశారే. మీ స్నేహితునికి కావలసినవన్నీ కొన్నారా? లేకపోతే అతను ఇబ్బంది పడతాడు. అఫ్‌కోర్స్ చికాగో అట్టే దూరంలేదు కాబట్టి తెచ్చుకోవచ్చనుకో" అన్నాడు సంతోష్.

సంతోష్ మాటల్ని ఎలా అర్థం చేసుకోవాలో తెలియక, మాట్లాడకుండా ఊరుకున్నాడు రాఘవ.

సంతోష్ రిఫ్రిజిరేటర్ వేపు కదులుతుంటే, "నాకు బీర్ వద్దు, థాంక్స్" అన్నాడు. నోరు పెగల్చుకుని. రిఫ్రిజిరేటర్ తలుపుతీసి, బీర్ బాటిల్ మూత విప్పి ఒకగుక్క తాగి తెరిచిన బాటిల్‌తో తిరిగి రాఘవకి ఎదురుగా కూర్చున్నాడు సంతోష్.



జెట్‌లాగ్‌వలన నిద్ర రాక పరుపుమీద దొర్లుతున్నాడు రాఘవ. గడియారం పన్నెండుగంటలు చూపిస్తోంది. నిద్రపోయే ముందర, మానస రాఘవ కోసం గదిలో ఉంచిన నీళ్ళు ఖాళీ అయి చాలా సేపయింది. దాహం తీర్చుకోవడానికి మెట్లు దిగి కిందకి వెళ్ళి మంచినీళ్లు తెచ్చుకుందామని బెడ్రూం తలుపుతీసి సగం మెట్లు దిగాడు. నిశ్శబ్దంగా ఉంది ఇల్లు. గోడ గడియారంనుంచి మందంగా శబ్దం వస్తున్నా, నిశ్శబ్దంలో దాని ప్రభావం పదింతలైనట్లనిపించింది. కింద సగం తెరచి ఉన్న బెడ్రూంలోంచి మాటలు వినపడడం మొదలయ్యాయి. గట్టిగా మాట్లాడుతున్న సంతోష్ గొంతు స్పష్టంగా వినిపిస్తోంది. కిందకి వెళ్ళి లైటువేసి నీళ్లు తీసుకుంటే, సంతోష్ మానసలకి ఇబ్బంది అవుతుందని, శబ్దం చేయకుండా మేడ మెట్లు ఎక్కడం మొదలుపెట్టాడు రాఘవ.

"ఈవేళ వద్దు" అన్న మానస వాక్యం "ఏం ఎందుకు వద్దు?" అన్న సంతోష్ తిరుగుప్రశ్న వినగానే పరిగెత్తి తన బెడ్రూంలోనికి దూరిపోదామనుకున్నా తొందరగా నడిస్తే మేడ మెట్లు కిర్రుమని శబ్దం చేసే అవకాశం ఉందని మెల్లిగా మెట్లని ఎక్కనారంభించాడు. మెలికలు తిరిగి ఉన్న మేడ మెట్లు వందల సంఖ్యలో ఉన్నాయా? అన్న అనుమానం వచ్చింది రాఘవకి.

"ఎందుకు వద్దు? అన్నదానికి కారణం చెప్పాలా? నాకిష్టం లేదు" అంది మానస.

"కారణం చెప్పడానికి ఎందుకు సంశయం? ఈవేళ విశిష్టత ఏమిటి? పాత స్నేహితుడు వచ్చేడనా? లేక పాతస్నేహితుడు ఉన్నాడనా?" అంటూ ప్రశ్నని రెట్టించాడు సంతోష్.

మేడ మెట్లు ఎక్కడం దాదాపు పూర్తయింది.

"దానికి దీనికి ఏమీ సంబంధం లేదు. రేపు ఉదయమే డిపార్ట్‌మెంట్‌లో మీటింగ్ ఉంది, అదీకాక రెండుగంటలు పాఠం చెప్పాలి. నిద్ర చాలకపోతే నేను సరిగ్గా పని చేయలేను" అంది మానస.



"పగలంతా తిరగగా లేనిది ఇప్పుడు కాలం గురించి ఆలోచిస్తున్నావా? ఇక ఆపు నీ బెట్టు" అంటున్న సంతోష్ వాక్యం వినిపిస్తుంటే గదిలో ప్రవేశించి రాఘవ తలుపు వేసుకున్నాడు.

తొందరగా మెట్లు ఎక్కడంవలనో, మానస, సంతోష్‌ల కంటపడకుండా గదిలో దూరడానికి చేసిన ప్రయత్నం వలనో లేక ఇంకే కారణంవలనో రాఘవ గుండె తీవ్రంగా కొట్టుకోనారంభించింది. గది లోపలి వేడికి ఉక్కిరి బిక్కిరయి కిటికీ తలుపు తెరచాడు. చల్లగాలి ఒక్కసారి లోపలికి జొరబడి రాఘవ మొహాన్ని తాకి అలజడివలన ఉత్పన్నమైన వేడిని చల్లబరచ ప్రయత్నిస్తోంది.

ఐదు నిమిషాలు గడిచేసరికి రాఘవ మామూలయిపోయాడు. శరీరమంతా దాహం, దాహం అనడం మొదలయింది. నిద్ర రావడంలేదు, అరగంట అటూ ఇటూ కదిలి దాహం బాధ తట్టుకోలేక లేచి బాత్రూం కుళాయిలోంచి వస్తున్న నీళ్ళని తాగాడు రాఘవ. దప్పిక బాధ తీరడంతో నిద్రపట్టని మెదడు ఆలోచనలోనికి దిగింది. తలుపులు పూర్తిగా తీసి ఉండడంతో కింద నుంచి మాటలు ఏమీ వినపడడం లేదు. 'ఈ దేశం రావడానికి మానస కలిగించిన అవకాశం వాడుకొని తను పొరపాటు చేశాడా? తను రావడంవలన మానసకి ఇబ్బంది ఎక్కువైందా? మధ్యాహ్నం చికాగో వెళ్తుంటే మానసలో కనిపించిన ఉదాసీనతకి తను కొంత కారకుడా? మానసతో తన స్నేహం సంతోష్ మానసల మధ్య విభేదాలకి దోహదం చేసిందా? తను ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా యూనివర్సిటీకి దగ్గరగా ఉన్న హౌసింగ్‌కి మారిపోవాలి' అనుకున్నాడు రాఘవ.

కాస్సేపటికి మనసులో ఉన్న అలజడి తగ్గింది. 'ఇల్లు మారిపోయినంత మాత్రాన మానస-సంతోష్‌ల విభేదాలు సమసిపోతాయా? వాళ్ళ మాటలని బట్టి ఇద్దరి ఆలోచనల్లో తేడా ఉందనిపిస్తోంది. తను హౌసింగ్‌కి వెళ్ళినంత మాత్రాన సమస్యలు పరిష్కారమవవు కాని తాను ప్రత్యక్షంగా వాటిని చూడడు. ప్రతీరోజూ ఒకే డిపార్ట్‌మెంట్‌లో పనిచేస్తున్న తను, మానస కలవకుండా మసలడం అసంభవం, ఒక సంవత్సరకాలం అనివార్యం. ఈ సంవత్సరకాలంలో సంతోష్ ఎలా రియాక్ట్ అవుతాడో! ఛ! తను వచ్చి అనవసరంగా మానసకి కొత్త ఇబ్బందులని సృష్టించాడు' అనుకుంటూ నిద్రలోనికి ఒరిగాడు రాఘవ. నిద్రలోనికి ఒరిగేముందు కడుపులో 'గుడగుడ'మంటూ వస్తున్న శబ్దం విని లేచి చేతిసంచీలో ఇండియానుంచి అజీర్ణానికి తెచ్చుకున్న మందుని బాత్రూం కుళాయిలోంచి వస్తున్న నీళ్ళతో వేసుకున్నాడు.

ఉదయం తొమ్మిదయినా రాఘవ కిందకి రాకపోవడంతో మానస మేడమీదకి వచ్చి రాఘవ గదితలుపు తట్టింది. సంతోష్ ఉదయమే పనిమీద బయటకి వెళ్ళిపోవడంతో ఇంటిలో సందడి ఏమీలేదు. గది లోపలి నుంచి ఏమీ సమాధానం రాకపోవడంతో తలుపు తీసుకుని మానస లోపలికి వచ్చింది. రాఘవ గాఢనిద్రలో ఉన్నట్లనిపించినా ఏదో అనుమానం వచ్చి రాఘవ దగ్గరగా వచ్చి "డిపార్ట్‌మెంట్‌లో మీటింగ్ ఉంది, లే" అంటూ లేపబోయింది. రాఘవ కళ్ళు తిప్పకుండా మెల్లిగా మూలగడం చూసి, రాఘవ నుదుటని చేయి వేసింది మానస. చల్లని చేయి నుదుటని ఆనడంతో మెల్లిగా కళ్ళు విప్పాడు రాఘవ. "నీకు జ్వరం వచ్చింది" అంది మానస.

"కడుపు నొప్పితో మూడుసార్లు బాత్రూంకి వెళ్ళవలసివచ్చింది, మెల్లిగా సర్దుకుంటుంది" అంటూ లేవబోయాడు రాఘవ. పరుపుమీదనుంచి నీరసంగా లేవబోతున్న రాఘవని,

"పడుకో, ఈవేళ రెస్ట్ తీసుకో. నేను వచ్చే





టప్పుడు ఫార్మసీ నుంచి మందు తెస్తాను. నువ్వు ఎక్కడో అపత్యం చేశావు. డెవాస్ వీధిలో ఇండియన్ రెస్టారెంట్ తిండి నీకు సరిపడలేదు" అంటూ వారించింది మానస.

"నేనెక్కడా ఏమీ తినలేదే. నీళ్లలో తేడా వచ్చి వుంటుంది. ఇక్కడ బాత్రూం కుళాయిలో వచ్చిన నీళ్లు తాగాను, అది కారణమవచ్చు" అన్నాడు.

"ఆ నీళ్లు తాగవలసిన అవసరం ఏమొచ్చింది? ఆ నీళ్లు మంచివి కావు. లేచి పళ్ళు తోముకో. ఇంతలోనే కాఫీ తెస్తాను. తరవాత ఒకసారి డిపార్ట్‌మెంట్‌కి వెళ్ళి అక్కడ నుంచి ఫార్మసీకి వెళ్తాను. అక్కడ కెమిస్ట్‌ని వాకబుచేసి నీకు మందు తెస్తాను. ఇదంతా చేయడానికి ఒక గంట పడుతుంది. నువ్వు ఇక్కడికి రాగానే జబ్బు పడడం ఏమీ బాగాలేదు. ఐ ఫీల్ సారీ! ఇంతకీ ఆ నీళ్ళు ఎందుకు తాగావు, నేను నీకు నీళ్ళు ఇక్కడ పెట్టానుగా" అంటూ లేచింది మానస.

రాఘవ లేచి పళ్లు తోముకునేసరికి మానస కాఫీ కప్పు, రెండు బ్రెడ్‌ముక్కలతో తిరిగి వచ్చి "ఇవి తిని కాఫీ తాగి రెస్ట్ తీసుకో, త్వరలో వచ్చేస్తాను" అంటూ నిష్క్రమించింది.

వెళ్తున్న మానసవేపు చూస్తూ కాఫీ తాగ నారంభించాడు రాఘవ.

రాత్రి ఏం జరిగినా ఉదయమే లేచి దిన కృత్యాలలో పడిన మానస మొహంలో అలసట ఏమీ కనిపించక ఆశ్చర్యపడ్డాడు. ప్రపంచంలో ఇలాంటివి చాలామందికి సామాన్యమే. రాత్రి జరిగిన ఘర్షణని పట్టుకుని దేవుళ్ళాడుతూంటే మర్నాటి పగటిపనులు ఆగిపోతాయి. అందులో ఉద్యోగానికి వెళ్ళే స్త్రీకి చాలా త్వరితంగా కోలుకునే సామర్థ్యం అవసరం. రాఘవ మనస్సు మరోసారి మూలిగింది మానస పరిస్థితి చూసి. కాఫీ తాగి గెడ్డం గీసుకుంటుంటే గెడ్డం కోసుకుంది. కారుతున్న రక్తాన్ని తుడిచి, ఆ మేరలో బొటనవ్రేలుని కాస్సేపు అదిమిపెట్టి రక్తపుధార ఆగగానే స్నానానికి ఉపక్రమించాడు. వేడినీళ్లు మొహంమీద పడగానే రక్తం తిరిగి చిందడం మొదలయింది. స్నానం కానిచ్చి పరుపుమీదకి చేరడానికి అరగంట పట్టింది రాఘవకి. రాత్రి సరిగ్గా నిద్ర లేకపోవడం, తిన్నతిండి జీర్ణం కాకపోవడంవల్ల వచ్చిన నులికడుపునొప్పి శరీరంలో సత్తువుని హరించడంతో పరుపుమీదకి చేరేసరికి హాయి అనిపించింది. కళ్లు మూతలు పడ్డాయి.

"ఎలా ఉంది రాఘవ్?" అంటూ నుదుటని చేయివేసి చూసింది మానస. కళ్లు విప్పాడు రాఘవ.

"జ్వరం తగ్గినట్లుంది. ఈ టాబ్లెట్లు నాలుగు గంటలకి ఒకసారి రెండు వేసుకుంటే చాలు, సాయంకాలానికి చాలామట్టుకు తగ్గిపోతుంది" అంటూ టాబ్లెట్లని, నీళ్ళని అందిచ్చింది మానస.

★ ★ ★

రాఘవ కళ్లు తెరిచేటప్పటికి కిందనుంచి మాటలు వినిపిస్తున్నాయి.

"నీ ఆఫీసుకి ఫోన్ చేశాను. నువ్వు ఒక అరగంటే ఉండి వెళ్ళావని చెప్పారు. ఉదయం డిపార్ట్‌మెంట్‌లో మీటింగ్, ఇతర పనులు ఉన్నాయన్నావు. ఏమయ్యాయేమిటి? కేన్సిల్ అయ్యాయా?" అనడుగుతున్నాడు సంతోష్.

"కేన్సిల్ అవలేదు. కాస్సేపు కూర్చుని పని ఉందని లేచి వచ్చేశాను" అంది మానస.

"ఏమిటాపని? మీ స్నేహితునికి కావలసినది సమకూర్చడమేనా?" అంటూ వదిలిపెట్టలేదు సంతోష్.

"రాఘవ్‌గారు సడన్‌గా సిక్ అయ్యారు, ఇంటిలో ఎవ్వరూ లేరని వచ్చేశాను"

"అరెరె! ఏమయింది? నీకు నర్సింగ్ డిగ్రీ లేకపోయినా నర్సింగ్ బాగా చేస్తావు. హౌ ఈజ్ హి? మీదకి వెళ్లి చూసివస్తాను" అంటూ సంతోష్ మేడ మెట్లవేపు నడవబో



తుంటే,

'ఫార్మసీనుంచి కడుపునొప్పికి మందు తెచ్చి ఇచ్చాను. దానిలో సెడెటివ్ ఉంది. నిద్రపోతున్నట్లుంది, అనవసరంగా లేపడ మెందుకు? " అంటూ వారించింది మానస.

"నువ్వు ఎలా చెబితే అలా చేస్తాను డియర్. హి ఈజ్ యువర్ ఫ్రెండ్. నీకంటే అతని శ్రేయస్సు కోరేవారెవరు? " అంటూ సోఫాలో కూర్చున్నాడు సంతోష్.

సంతోష్ మాటలు సామాన్యంగా కనిపించినా, ముందర రోజు సాయంకాలం, రాత్రి మానస సంతోష్‌ల మధ్య జరిగిన సంభాషణ విన్నాక ప్రస్తుతం నడుస్తున్న సంభాషణలో ఏదో జీర వినిపిస్తోంది. అది తన ఊహే కావచ్చు. కాని సంతోష్ ఉచ్ఛరించే ప్రతీ వాక్యంలో తనకి ఏదో వ్యంగ్యం కనిపిస్తోంది. దానికి కారణమేమిటి? మానసని నొప్పించాలని ప్రత్యేకంగా సంతోష్ ఎందుకు ప్రవర్తిస్తున్నాడు? సంతోష్‌కి మానసని ఇబ్బంది పెట్టాలని ఎందుకుంటుంది? ఆమె స్వతంత్రంగా బతికే ధైర్యం నచ్చకా? జీవితంలో విజయం సాధించగల స్థోమత ఉన్న స్త్రీలని చూస్తే భర్తకి తమకున్న పరిధులు అవగాహనై తమ సామర్థ్యంమీద అపనమ్మకం ఎక్కువవుతుందా? కడుపునొప్పికి మత్తుమందు తిన్నాక తన మెదడు నిద్రలో ఆలోచిస్తోందా? ఇదంతా కలా? లేక నిజమా? తను గౌరవించే మానస ఇలాంటి ఇబ్బందులలో ఉందని తను భ్రమపడుతున్నాడా? దానివలన మెదడు విపరీతంగా ఆలోచిస్తోందా? ' అనుకుంటుంటే మానస గదిలోకి వచ్చి,

"ఎలా ఉంది ఒంట్లో? " అనడిగింది.

"కడుపునొప్పి పూర్తిగా తగ్గింది, జ్వరం లేదు. చాలా తేలికగా ఉంది. నీకు అనవసరంగా ఇబ్బంది అయింది" అంటూ నొచ్చుకుంటూ పరుపు మీదనుంచి లేవబోతుంటే,

"లేవకు, కాస్సేపటిలో లంచ్ తినడానికి కిందకి వద్దువుగాని" అని మానస కిందకి వెళ్ళబోతుంటే,

"సాయంకాలం నాలుగు గంటలకి నన్ను హౌసింగ్ కాంప్లెక్స్‌కి తీసుకెళ్ళి వదిలేయగలవా? " అనడిగాడు రాఘవ.

"ఇప్పుడేమంత తొందర వచ్చింది? జబ్బు పడ్డావు, అక్కడ ఒంటరిగా ఏం ఉంటావు? రేపు వెళ్దువుగానిలే" అంటూ రాఘవ ప్రతిపాదనని కొట్టిపారేయబోయింది మానస.

"వద్దు, ఈవేళే నన్ను నువ్వు దింపేస్తే మెల్లిగా కొత్తచోట సెటిల్ అవుతాను. ఆలస్యం చేసేకొద్దీ, నాలో బద్ధకం పెరిగిపోతుంది. నా మాట మన్నించి ఇంకేమీ అభ్యంతరం చెప్పకుండా, మూడు నాలుగు గంటలకి నన్ను అక్కడ దింపేయ్" అంటూ అభ్యర్థించాడు రాఘవ.

రాఘవవేపు నిశితంగా చూసింది మానస. 'ఎందుకు ఇతను అంత తొందర పడుతున్నాడు? నా పరిస్థితి అప్పుడే తెలిసిపోయిందా? ' లాంటి ప్రశ్నలు ఆ చూపులో ఉన్నాయి.

రాఘవవేపు చూడకుండా "సరే. జీవితం చాలా విచిత్రమైనదికదూ? లంచ్ తయారవగానే పిలుస్తాను" అంటూ మేడ మెట్లు దిగింది మానస. మెత్తగా కార్పెట్ మీద, ఇంకా మెత్తని పాదాలు నడుస్తున్నా మానస బరువుగా కదులుతున్నట్లనిపించింది రాఘవకి.

'జీవితం చాలా విచిత్రమైనది' అంది మానస ఒకసారి తనతో. ఎందుకు అలా అందో దానికి తను ఏం సమాధానం ఇచ్చాడో జ్ఞాపకంలేదు. అది చాలాకాలం క్రితం ఉచ్ఛరించిన వాక్యం. ఇన్నేళ్ళ తరువాత ఆమెకు అది ఎందుకు జ్ఞాపకానికి వచ్చిందో! అతిసమర్థవంతురాలైన మానస జీవితాన్ని తనకి నచ్చినట్లు మలుచుకోగలదు, మలుపులు తిప్పుకోగలదు. ఏ కొరతా లేని మానస విచిత్రాలని సామాన్యం చేయగల నేర్పు గలది. అలాంటి మానస 'జీవితం చాలా విచిత్రమైనది' అన్నదంటే





క్లిష్టమైన విచిత్రం ఎదురయి ఉండాలి. ఆమె విపత్కాల పరిస్థితులు సరిదిద్దే మార్గం తన దగ్గర ఉంటే, తను సరిచేయడానికి ఏమాత్రం సంకోచించడు. దాని మాట ఎలా ఉన్నా, తను ప్రత్యేకంగా లేక పరోక్షంగా ఆమె ఇబ్బందులకి ఆజ్యం పోయకూడదు, పోయడు. తను ఎంత త్వరగా హౌసింగ్‌లో ఉన్న గదికి వెళ్తే అంత మంచిది, అనుకుంటూ పరుపు మీదనుంచి లేచి బట్టలు మార్చుకుని పెట్టె సర్దుకోవడం మొదలుపెట్టాడు. పెట్టె సర్దుతున్నా ఆ పనిలో ఏకాగ్రతకాని, సర్దిన బట్టలలో ఒక క్రమంకాని లేక అస్తవ్యస్తంగా ఉంది సూట్ కేస్. మడతలులేని బట్టలు ఎక్కువ జాగా ఆక్రమిస్తాయనడానికి నిదర్శనంగా సూట్ కేస్ నిండుగర్భిణీలా బట్టలతో పొంగిపోయి ఉంది. అతికష్టంమీద బలమంతా వాడి సూట్ కేస్‌ని మూయగలిగాడు రాఘవ.

"రాఘవా! లంచ్‌కి కిందకి రా" అంటూ కిందనుంచి మానస పిలుపువిని సూట్ కేస్ లాగుకుంటూ కిందకి చేరాడు రాఘవ.

"అదేమిటి ఏకంగా సూట్ కేస్‌తో వచ్చేశావు? ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా ఈ గూభ్యంనుంచి బయటపడి పోదామని ఉందా? దూరంగా పారిపోదామని ఉందా?" అంటూ నిట్టూర్చింది మానస.

"అదేమీ కాదు. వెళ్దామని నిశ్చయించుకున్నాక ఆ పని త్వరగా చేయడం శ్రేయస్కరం అని నేను నమ్ముతాను" అంటూ డైనింగ్ టేబిల్ దగ్గర ఉన్న కుర్చీలో సర్దుకున్నాడు. ఎదురుగా టేబిల్‌మీద పెసరెట్లు, వేడివేడి ఉప్మాతోపాటు కొబ్బరిపచ్చడి, సాంబార్ చూడగానే రాఘవకి నోటిలో నీరు ఊరింది.

"నువ్వు ఢిల్లీలో ఎప్పుడూ పెసరట్టు, ఉప్మా అంటూ కలవరించేవాడివి" అంటూ రాఘవ ప్లేటులో ఒక పెసరెట్ ఉంచి, దాని పక్కనే ఉప్మా వడ్డించింది. ఒక కప్పులో సాంబారు వేసి ప్లేటు పక్కనే ఉంచి ఒక స్పూన్ దానిలో ఉంచింది.

అతిథ్యం ఇవ్వడం ఒకకళ, అది అందరికీ చేతనవదు. మానస టేబిల్‌మీద ప్లేట్లని, నేప్‌కిన్‌లని, తిండి పదార్థాలని అమర్చిన తీరు చూసి చాలా ఆనందం కలిగింది రాఘవకి. పెసరట్టులో ఉప్మా ఉంచి, కొబ్బరిపచ్చడిలో ముంచి నోటిలో పెట్టుకోగానే జిహ్వాకి తృప్తి కలిగింది.

"చాలా బాగుంది" అంటూ రెండు పెసరట్లని తిన్నాక "కడుపు బరువెక్కింది" అంటూ లేచి చేతులు కడుగుకున్నాడు రాఘవ. టేబిల్‌మీద కూర్చుని రాఘవనే గమనిస్తోంది మానస.

"నువ్వేమీ తినకపోయినా నేను పట్టించుకోకుండా గబగబా లాగించేశాను. ఐయామ్ సారీ" అన్నాడు రాఘవ.

"ఈమధ్య నా బరువు పెరుగుతోంది. తిండి కాస్త తగ్గిస్తే మంచిది అన్నాడు డాక్టర్" అంది మానస.

"ఇంకో పది నిమిషాలలో బయలుదేరుదామా?" అనడిగాడు రాఘవ, తల ఊపింది మానస.

లంచ్ తిన్న ఒక గంటకి హౌసింగ్ కాంప్లెక్స్ ఎపార్ట్‌మెంట్‌లో సామాన్లు ఉంచాడు రాఘవ.

"ఇహ నువ్వెళ్ళు" అన్నా వినకుండా తెచ్చిన సామాన్లన్నీ శుభ్రంగా సర్ది, "రేపు ఉదయం వస్తా"నని చెప్పి వెళ్ళింది మానస.

ఒకే బెడ్రూం ఉన్న ఎపార్ట్‌మెంట్‌లో ఒంటరిగా మిగిలాడు రాఘవ. తనకి పనికి రాదంటూ గారేజ్‌లో దుమ్ముపట్టి ఉన్న టెలివిజన్‌ని బలవంతంగా తెచ్చి ఇచ్చింది మానస.

గదంతా ఖాళీగా ఉంది. మానస వెళ్ళాక ఏంచేయాలో తెలియక కిటికీలోంచి బయటికి చూస్తే ఎదురుగా ఒక చెరువు. చెరువులో నడ్డి ఊపుకుంటూ నడుస్తున్న





బాతులు అటూ ఇటూ కదులుతున్నాయి. చెరువుని ఆనుకుని ఉన్న జాగాలో పెద్ద చెట్లు తమ నీడని నీటిలో చూసుకుని మురిసి పోతూ కొన్ని ఆకుల్ని నీటిలో వదిలాయి. మధ్యాహ్నం సూర్యుడు తన ఏటవాలు కిరణాలని ఆకుల కొమ్మల ఖాళీలలోంచి నీటిమీదకి విసరడంతో అవి ఛిన్నాభిన్నమై విస్తరిస్తున్నాయి. నీటిమీద తెట్టుగా కట్టడంతో సూర్య కిరణాలు వాటిమీద పడి గల్లంతయ్యాయి. కొలనులో బాతులు 'క్వాక్ క్వాక్' శబ్దాలు, రెండు వందల అడుగుల దూరంలో ఉన్న రోడ్డుమీద పరుగెత్తే కార్ల సవ్వడి మినహా



ప్రకృతి నిశ్చలంగా ఉంది. బయట నిశ్చలంగా ఉన్న ప్రకృతిలాగే గదిలోపల వాతావరణం నిశ్శబ్దంగా ఉంది. మానస వెళ్లి అరగంటే అయినా చాలా సమయం గడిచినట్లనిపించింది రాఘవకి. ఏంచేయాలో పాలుపోక కాఫీ కాచుకుందామని వంటగది వేపు నడిచాడు. మానస శుభ్రంగా సర్దిన షెల్ఫ్ లోంచి కాఫీ పౌడర్, క్రీమర్, పంచదార తీసి మైక్రోవేవ్‌లో మరగపెట్టిన నీళ్లలో కలిపి కాఫీ కప్పుతో సోఫాలో కూర్చున్నాడు రాఘవ.

మొట్టమొదటి చప్పరింపు చేయగానే కాఫీ వెగటు అనిపించి లేచి కాఫీని సాంతం సింక్‌లో పారపోసి కప్పు కడిగి మళ్లీ సోఫాలో ఆసీనుడయ్యాడు.

ఒంటరితనం మళ్లీ రాఘవని ఆక్రమించింది.

మానస వెళ్ళి దాదాపు ఒక గంటయింది. గదిలో ఒంటరితనం చేస్తున్న శబ్దానికి తట్టుకోలేక గదికి తాళం వేసి సరస్సులాంటి చెరువువేపు నడిచాడు. గాలికి కదులుతూ కృత్రిమంగా ఉద్భవించిన పల్చని అలలు

ఒడ్డుకు వచ్చి ఒడ్డున ఉన్న సన్నని రాళ్ళని మందంగా తాకుతూ 'గళక్ గళక్' అంటూ శాంతపడుతున్నాయి. కొలను చుట్టూరా ఉన్న చెట్లు తమ కొమ్మల్ని వంచి నీళ్లని చుంబించడానికి కాబోలు అవస్థ పడుతున్నాయి. దూరంగా బాతులు తమ పిల్లలతో నీటిలో ఈదుకుంటూ అలలని సృష్టిస్తుంటే పిల్లలు ఆ అలలమీద కిందికి మీదకి కదులుతూ తమ తల్లుల చుట్టూ తిరుగుతున్నాయి. ఉన్నట్టుండి బాతులు తమ ముక్కుల్ని నీళ్ళలోనికి వంచి చిన్న చిన్న చేపల్ని, పురుగుల్ని కరిచిపెట్టి పిల్లలకి అందిస్తుంటే పడిలేస్తున్న కెరటాలమీద కులుకుతూ పిల్లలు వాటిని అందుకుని కేరింతలు కొట్టినట్లు శబ్దాలు చేస్తున్నాయి.

చాలా దూరంలో కనుచూపుమేర దూరంలో ఇద్దరు వ్యక్తులు ఒడ్డున కుర్చీలలో కూర్చుని గేలాల్ని నీటిలోకి దింపి, ఎరని తిన్న చేపలు దొరుకుతాయేమోనని నిరీక్షిస్తున్నారు. మబ్బుల వెనకాల సూర్యుడు తీక్షణ రహితంగా ఉండడంతో గాలిలో వేడిలేదు. దానికితోడు సరస్సు మీదనుంచి వస్తున్న గాలి వాతావరణాన్ని ఆహ్లాదంగా ఉంచుతోంది. కొలను పక్కన ఉన్న చెటు తమ ఆకుల రంగుల్ని మార్చడం మొదలుపెట్టి బహుశా పది-పదిహేను రోజులయిందేమో వింతకాంతితో ప్రకాశిస్తున్నాయి.

కొలను ఒడ్డున చతికిలపడ్డాడు రాఘవ. చేతివాచీ మానస వెళ్ళి ఒకగంట పదిహేను నిమిషాలయిందని చెబుతోంది. కుర్చీలలో ఒక వ్యక్తి లేచి గేలానికి ఉన్న తాడుని, గేలానికి కర్రకి ఉన్న పుల్లీకి త్వరత్వరగా చుడుతూ గేలాల కర్రని మీదకి గాలిలోనికి ఎత్తాడు. నాలుగు ఐదుసెకన్ల తరువాత ఒకచేప గేలం చివర్న కొట్టుకుంటూ కనిపించింది. తెల్లని, నల్లని మచ్చలతో ఉన్న ఆ చేప గిలగిలా కొట్టుకోవడం చూసి రాఘవకి విచారమేసింది. సరిగ్గా కనిపించలేదుకాని అతను గేలానికి తగులుకున్న చేపని చేతిలోనికి తీసుకుని దానివేపు చూసి తిరిగి దానిని నీళ్ళలోనికి జారవిడిచాడు. రాఘవ మనస్సులో బాధ కాస్త తగ్గింది.

మరోసారి వాచీవేపు చూశాడు. మానస వెళ్ళి గంటన్నర అయిందని ముళ్లు తెలియ చెప్పాయి.

రాఘవ చూపులు తిరిగి ఆ గేలం వేస్తున్న వ్యక్తి మీదకి మళ్ళాయి. మళ్ళీ గేలానికి ఎరని తగిలించి గేలాన్ని నీటిలోనికి విసిరి కుర్చీలో చేరబడ్డాడు.

గేలానికి తగిలి గింజుకున్న చేపని చూసే సరికి ఎందుకో మానస జ్ఞాపకానికి వచ్చింది. 'గత రెండు రోజులుగా తను మానసని గమనిస్తున్నాడు, గింజుకుంటోంది ఆమె. ఎందుకు గింజుకుంటోందో తనకి పూర్తిగా తెలియదు. ఊహ మాత్రమే.

చాలా సంవత్సరాల తరువాత కలిసిన మానసతో ఢిల్లీ, విశాఖపట్నం సంగతులు మాట్లాడడానికి అవకాశమే రాలేదు. ఎంత చలాకీగా, చిలిపిగా ఉండేదో ఆనాటి మానస. ఈనాటి మానస గాయమైన చేపలా గింజుకుంటోంది' మళ్ళీ మరొక చేప గేలానికి తగిలి గింజుకునే దృశ్యం చూడాల్సివస్తుందని లేచి సరస్సుకి దూరంగా నడిచాడు రాఘవ.

★ ★ ★

"ఏం చేశావు నిన్నంతా?" అంటూ గదిలోకి వచ్చి కుర్చీలో కూర్చుంది మానస.

"అలా కాస్సేపు నడకకి వెళ్ళాను. చెరువు ఒడ్డున కూర్చుని ఎవరో చేపలు పట్టడం చూశాను" అంటూ ముందరరోజు చూసినవి చెప్పాడు రాఘవ.

"చేపల్ని అలా హింసించడం అమానుషం కదూ" అంది మానస.

"ప్రకృతిలో మనుషులు జంతువులని, బలమైన జంతువులు బలహీనమైన జంతువులని చంపడం సామాన్యమేకదా? అది తప్పుదు" అన్నాడు రాఘవ.





"నిజమే, కాదనను. చేపల్ని చంపేస్తే ఫరవాలేదు. వాడి పదునైన గేలం మొన దాని నోటిలో తగులుకోగానే అది బాధతో ఎంత విలవిలలాడుతుందో చూశావుగా? అతను దానిని నీటిలోనికి తిరిగి వదలచ్చు కాని ఎర తిండికోసం అది మళ్ళీ అలాంటి గేలానికి ఎన్నిసార్లు తగులుకుంటుందో! చచ్చేంతవరకు అది ఎన్నాళ్లు ఇలాంటి హింసల్ని భరించాల్సివస్తుందో! దానికంటే చావే పదిరెట్లు నయం. విముక్తి" అంది మానస.

రాఘవ ఊరుకోక "దాని చావు ఎలా రాసి పెట్టి ఉందో అలా జరుగుతుంది" అన్నాడు.

"డోంటాక్ ట్రాష్! ఆ వెధవ ఆనందానికి రాసిపెట్టడానికి లంకె పెట్టావంటే చంపేస్తాను" అంది ఎరుపైన కళ్ళతో. మానస కళ్లలో బాధతో కూడిన కోపం చూస్తే రాఘవకి ఒళ్ళు జలదరించింది. మానస కంటి కొసలులోంచి రెండు కన్నీళ్లు కిందకి జారాయి. పది నిమిషాలు పట్టింది మానసకి మామూలవడానికి.

"విధి! విధి! కర్మ! రాసిపెట్టడం ఇలాంటి చొల్లు కబుర్లే చెప్పి చెప్పి తరతరాలుగా మన మనస్సుని, ఆలోచనలని కండిషన్ చేసేస్తారు. ఇంకే ఇతర ఆలోచనలుకానీ, దేనినైనా ప్రశ్నించే ధైర్యంగానీ ఎవరిలోనైనా కనిపిస్తే వాటిని సాంతం పూర్తిగా మొదటిలోనే తుంచేస్తారు" అంది మానస.

బుసలు కొడుతున్నట్లు ఆ మాటలు అన్నా వాటిలో అంతా విషాదమే ఉందని గ్రహించి ఆమె మొహం చూడలేక కళ్ళు మూసుకున్నాడు రాఘవ.

మానస కుండ బద్దలు కొట్టినట్లుండే మాటలు, మానస ధైర్యం తనకి కొత్తేమీ కాదు. మానసతో తొలిపరిచయం రోజులు, ఆమెతో నడిచిన సంభాషణలు జ్ఞాపకాల్లోంచి బైటకి తన్నుకువచ్చాయి.

"జీవితంలో లోటు ఉందని, అది పూడ్చే వ్యక్తి తటస్థపడి దానిని పూడ్చేంతవరకూ మనకి తెలియదు" అని తను చదివాడు. కానీ దానిగురించి విశ్లేషించి ఆలోచించడానికి తనకి అవసరమే కలుగలేదు. అంతవరకూ బల్బ్ మారుస్తూ, ఏమరపాటున ఎలక్ట్రిక్ తీగ తగిలినప్పుడు నరనరాల్లోంచి ప్రవహించి యావత్తు శరీరాన్ని జలదరింపచేసే విద్యుత్ తరంగంలా మాటలతో ఆవేళ మానస తనని సాంతం కుదిపింది ఒక్కసారి అనుకున్నాడు.

"మీరు అన్నివేపులా మూసి ఉన్న బాత్రూంలో కూడా బట్టలతో స్నానం చేస్తారుకదూ? " అనడిగింది మానస చిటికెనవేలుని రవ్వంత కొరుకుతూ.

అలాంటి ప్రశ్న ఎందుకు వేసిందో అతడికి అవగాహన అవలేదు. అయినా దానిని ప్రశ్నించకుండా "అవును" అన్నాడు అతడు.

"ఎందుకు? అన్ని తలుపులూ వేసి ఉన్నాయికదా? " అని ప్రశ్నని రెట్టించింది.

"ఏమో, దీనిగురించి అంతగా ఎప్పుడూ ఆలోచించలేదు" అన్నాడు అతను ఆశ్చర్యపడుతూ.

"అవును ఆలోచన లేకుండా కొన్నిపనులు మీరు చేస్తారన్నది నిజం. మీరు స్నానం చేసే తీరుకి కారణం ఊహించడం అంత కష్టంకాదు"

"ఏమిటి ఆ కారణం? "

"నగ్నంగా ఉండడం, అలా కనిపించడం లాంటివి చేస్తే ఏదో తప్పు చేశామన్న భావాన్ని మన పెద్దలు చిన్నప్పటినుంచీ మన రక్తంలో ప్రవేశపెడతారు. అలా చేయకపోతే పెద్దలు చెప్పిన దానినేదో ఉల్లంఘిస్తున్నామన్న గిల్టీ ఫీలింగ్ మనలో జనింపచేసి అది మహా వృక్షమయేలా చూస్తారు. అదే నిజమని దానిని మనం పాటిస్తాం" అంది మానస.

"నేనెప్పుడూ ఇలాంటివాటి జోలికి పోను" అన్నాడు అతను ఇంకేమీ తోచక.

"ప్రతీదానికీ తల ఊపడం తప్పు మీరు

స్వతంత్రంగా ఎప్పుడైనా ఆలోచించారా? " అంది మానస దీర్ఘంగా నిట్టూరుస్తూ.

అంత ధృఢంగా, నిక్కచ్చిగా నిర్మొహమాటంగా కొరడా దెబ్బ కొడుతుందని అతడు అనుకోలేదు. ఆమె ఎదుట అవాక్కవడం అది మొదటిసారికాదు. అతని పరిస్థితి గ్రహించి కొట్టిన కొరడాదెబ్బ చేసిన గాయం మీద మందు పూసినట్లు "నేనేదో ఆలోచనలో పడి అంత దురుసుగా మాట్లాడాను. మీరు అలాంటివారుకాదు. మీ దగ్గర ఎన్ని ఆలోచనలు లేకపోతే మీరు ఈనాడు ఈ పదవిలో ఉంటారు" అంది మానస అతని చేతిమీద తడుతూ.

మంట తాత్కాలికంగా తగ్గినట్లు అనిపించినా, గాయం మానలేదన్నదానికి నిదర్శనగా మానస అన్నమాటలు చెవిలో గింగురెత్తించి, మెదడులో కారుచిచ్చుని అంటించాయి అతడికి.

"క్రికెట్ ఆటలో స్లో బౌలర్ ఒక్కసారి పరుగెత్తి ఫాస్ట్ బౌలింగ్ చేయబోతే ఎంత దారుణ పరిణామాలు కలిగిస్తాయో అలాగే ఆలోచన అలవాటులేని మనిషి ఒకసారి తీవ్రమైన ఆలోచనలోకి దిగితే పరిణామాలు బాగుండవు" అంది మానస ఆలోచనలోనికి మునగబోతున్న అతడితో.

'అందరికీ అది వర్తిస్తుందో లేదో తను నిర్ధారణగా చెప్పలేకపోయినా అది తన విషయంలో నిజం. అందుకే ఏమాత్రం ఆలోచనలోనికి దిగినా తనకి వెంటనే తలనొప్పి వచ్చేస్తుంది' అనుకున్నాడు.

ఒకసారి గతం గుర్తుకొచ్చింది అతడికి.

పరుగెడుతున్న ఆటోలో ప్రయాణం చేస్తున్న మానస అటూఇటూ చూస్తూ, "ఈనాడు మనకి, జంతువులకి ఉన్న తేడా ఏమిటి? మీరెప్పుడైనా ఆలోచించారా? " అంటూ రోడ్డువారగా మూత్రాన్ని విసర్జిస్తున్న ఒక మగధీరుడిని చూపించి, రెండవ వేపు మొహం తిప్పుకుంది. ఆటో వేగం తగ్గి రోడ్డుమీదున్న స్పీడ్‌బ్రేకర్‌ని అధిగమించి తిరిగి వేగం అందుకుంది.

"జవాబు తెలిసి ప్రశ్న అడిగే వ్యక్తికి, దానికి సమాధానం వెంటనే స్ఫురిస్తుంది. కానీ అర్థాంతరంగా ఎదుటి మనిషికి ఆ ప్రశ్న వేస్తే ఆలోచించి సమాధానం ఇవ్వడానికి సమయం కావాలి. చటుక్కున సమాధానం లభించదు" అన్నాడతను.

విరగబడి నవ్వింది మానస.

'కొందరు ఫెడీఫెడీమని నవ్వుతారు, కొందరు శబ్దం చేయకుండా నవ్వుతారు. కాని మానస నవ్వులో ఒక ప్రత్యేకత ఉంది. మొహమంతా ఎర్రగా, వేయించిన కందిపప్పు రంగులా మారిన మానస మొహం తిరిగి తన తెలుపు వర్ణానికి రావడానికి ఐదు నిమిషాలు పట్టింది. చిన్నప్పుడు స్కూళ్ళదగ్గర చిత్రీపట్టిన ఐస్‌రజను మీద చిలకరించిన తీపి ఎరుపు రంగు వ్యాపించినట్లు మొహంలోకి రంగు తన్నుకు వచ్చింది. ఐస్ ఫ్రూట్ మీదున్న రంగుని నోటిలో ఊదుకుంటూ పీల్చాక ఐస్ తన పాత తెలుపురంగుకి వచ్చినట్లు, మానస మొహంలో ఐదు నిమిషాల తేడాలో వచ్చిన మార్పు చూసి తనకి చాలా ఆశ్చర్యం కలిగింది.

ఉత్తేజం వలన కందిపోయిన మొహాన్ని చీరచెంగుతో కప్పుకుని నవ్వు తెరలని మరుగుపరచి, కనుకొలకులలోనికి చేరిన చెమ్మని తుడుచుకుని మామూలు మనిషై, "మీకు ఎప్పుడూ చెప్పలేదేమో, ఇలాంటి సమాధానాలు చిన్నపిల్లలు చెబుతారు. కానీ డాక్టరేట్ చేస్తున్నవాళ్ళు కాదు" అంది మానస.

మరోసారి ఆశ్చర్యంగా ఆమె మొహంలోకి చూశాడు. మోతాదుకి మించి తను మాటలాడుతున్నానని అనుకుందో ఏమో, లేక అతడు రవ్వంత బాధపడినట్లు పసికట్టిందో కానీ "సారీ" అంది వెంటనే.

"మీరు నన్ను తప్పుగా అంచనా వేస్తున్నారు" అన్నాడు తను.

"రియల్లీ? " అంటూ కిందపెదవిని





పళ్ళతో అదిమి వస్తున్న నవ్వుని ఆపు కుంది.

'మానస! ఆమె నవ్వు గురించి విశ్లేషించ డానికి తన దగ్గర ఉన్న పదజాలం చాలదు' అని అనుకుంటుంటే,

"అందరూ నేను తెగ నవ్వుతానంటారు తెలుసా? " అంది.

"కావచ్చు కానీ మీరు బాగా నవ్వుతారు. అలాంటి నవ్వు అంటే నాకిష్టం" అన్నాడు తను.

"అలాంటి నవ్వు ఇష్టమా? లేక నా నవ్వు ఇష్టమా? " అంటూ నవ్వుని తిరిగి అందు కుంది. కాస్సేపయ్యాక,

"మా అమ్మ నన్ను తెగ తిట్టేది చిన్న పుడు. ఈ నవ్వే నాకు చీవాట్లు, దెబ్బలు తెచ్చింది, నామీద వక్రమైన కామెంట్లకి కార ణమైంది. మీ నవ్వు నాకిష్టం అన్న మొదటి వ్యక్తి మీరే. ధైర్యం చేసి ఆ మాట అన్నం దుకు థ్యాంక్స్" అంది విచారాన్ని ఆరాధ నలో మిళితంచేస్తూ.

"నవ్వు నాలుగువిధాల చేటు అంటారు కానీ హాయిగా, మనస్ఫూర్తిగా ఇతరుల గురించి పట్టించుకోకుండా ఎందరు నవ్వగ లరు? దానికి ధైర్యం కావద్దూ? హాయిగా నవ్వకుండా నడిచే జీవితం ఒకజీవిత మేనా? " అన్నాడు తను.

"ఏమో! అలాంటి ప్రశ్నలకి నిర్దుష్టమైన సమాధానం ఎవ్వరూ ఇవ్వలేరు. అలా నడిచే జీవితం ఒక జీవితమేనా? అన్న ప్రశ్నకి మీరు నమ్మినట్లు నడిచేదే జీవితం అని ఎలా చెప్పగలరు? జీవితం నడవడా నికి కొలబద్ద ఏమిటి? " అంది మానస ఆలోచనలో పడుతూ.

ఆటోరిక్షా ఒక ట్రాఫిక్ లాంతరు దగ్గర ఆగింది.

"అమ్మా ఆకలిగా ఉంది" అంటూ ఒక బిచ్చగాడు ఆటోరిక్షాలోనికి చేయి చాచాడు.

జేబులోంచి పర్స్‌తీసి దానిలోంచి తను అర్థరూపాయి బిళ్ళ ఏరబోతుంటే, మానస పర్స్ లాక్కుని చిల్లరలోంచి రెండు రూపా యల బిళ్ళ బిచ్చగానికి వేస్తూ,

"ఆకలితో నోటిలో ముద్ద పెట్టుకోబోతుంటే "అమ్మా ఆకలి" అంటే ఆ ముద్దని ఆ ఆకలి ఉన్న బిచ్చగానికి ఇవ్వడం మానవత్వానికి నిదర్శనం" అంటూ పర్స్ తిరిగి అందిం చింది. తనేమీ మాటలాడలేదు.

"నీ దగ్గర నూరు రూపాయలు ఉంటే దాన్లోంచి ఒక రూపాయితీసి ఇవ్వడంలో గొప్ప ఏమిటి? అఫ్‌కోర్స్ అదీ ఇవ్వని వాళ్ళకంటే నయమే కానీ అది దానంకాదు. మనదగ్గర ఒకే ఒక రూపాయ ఉంటే అది ఇవ్వడం దానం. మనకి పనికిరాకుండా మిగిలిపోతే అది ముష్టివానికి వేయడం గొప్పకాదు. మనం తినేదాంట్లో ఒక భాగం వేయడం కరుణకి నిదర్శనం" అంది మానస.

అలా వివరిస్తూ తనకంటే చాలా ఎత్తులో ఉందని ఆవేళ మరోసారి తెలియ చెప్పింది మానస. మానసతో పరిచయం పెరుగుతుంటే సంబోధన 'మీరు' నుంచి 'నువ్వు'కి మారింది.

ఇంకోరోజు...

"మనం ఎన్నో అనుకుంటాం కానీ ఎంత అవస్థపడ్డా కొన్ని ప్రయత్నాలు సఫలమ వవు. దీనినే 'విధి' అంటారు కాబోలు" అంది మానస సంభాషణని ప్రారంభిస్తూ.

"ఐ యామ్ సారీ. విధి, కర్మ సిద్ధాంతా లమీద నాకు నమ్మకంలేదు. అవన్నీ మన వాళ్ళు జాతిని ఒక సాంప్రదాయంమీద నడి పించడానికి ఉపయోగించుకుంటున్నారు. శాస్త్రం చాలా పురోగమించింది. గతంలో వివరించలేని చాలా విషయాలని ఈరోజు శాస్త్రం చక్కగా వివరించగలుగుతోంది. ఇంకా ముందర రోజుల్లో మరికొంత వివ రణ ఇస్తుంది. విధి, కర్మ, సిద్ధాంతాలకి నమ్మకం తప్ప శాస్త్రాధారాలు ఏమీ నాకు కనిపించడంలేదు" అన్నాడు తను.

ఒక్కసారి విచిత్రంగా చూసింది మానస,

చక్రాల్లాంటి కళ్ళని మరింత గుండ్రంచేసి చూసింది మానస.

"నేను అనాలోచితంగా ఆ మాట అన్నాను. మీకు ఇలాంటి వాటిమీద నమ్మ' కంలేదని ఈషణ్మాత్రం అనుమానం నాకు కలగలేదు. మీకు హేతువాదంమీద నమ్మకం ఉందని ఈనాడే తెలుసుకున్నాను" అంది మానస.

"నా నమ్మకాలు నావి. హేతువాదం నా బలహీనత" అన్నాడు తను.

"ఏ వ్యక్తి అయినా ఒక సిద్ధాంతాన్ని నమ్మి దానిమీద నిలబడేవారంటే నాకిష్టం. మీరు మీ సిద్ధాంతాలని ఎంతకాలం పాటి స్తారో చూడాల్సిందే. అంతవరకూ మనం స్నేహితులుగా ఉంటామో, లేదా ఎవరి దారులు వాళ్ళు పట్టి విడిపోతామో ఎవరు ఊహించగలరు? " అంది మానస.

"అవును" అంటూ ఆమెతో ఏకీభవించక తప్పలేదు తనకి.

"సాయంత్రం నాకు పని ఉంది. రేపు కలుస్తాను" అంటూ స్కూటర్‌వేపు నడిచాడు తను.

మానసని వదిలి స్కూటర్‌మీద ప్రయాణం చేస్తున్న తనకి మనస్సులో అలజడి మొదలయింది.

"హాయిగా నవ్వలేకుండా నడిచే జీవితమూ ఒక జీవితమేనా? "

"జీవితం అంటే ఏమిటి? "లాంటి ప్రశ్నలు తనకెప్పుడూ ఎదరవలేదు. తన గతంలో చూశాడు. యాంత్రికం. తన జీవితం చాలా యాంత్రికం. ఇంజనీరింగ్, ఎమ్‌టెక్ చేసేసరికి తన వయస్సు ఇరవై నాలుగు. యూనివర్సిటీ ఇంజనీరింగ్ విభాగంలో చేరిన రెండు సంవత్సరాలు గడిచాక సెలవు తీసుకుని పి. హెచ్. డి. చేయడానికి ఢిల్లీ వచ్చాడు. అక్కడే మానసతో మొదటి పరిచయం. ఇరవై ఐదేళ్ళకే తనకి పెళ్ళయింది. ఒక కొడుకు కూడా అప్పటికి. తను ఐ. ఐ. టి. లో చేరిన ఒక సంవత్సరం తరువాత మానసతో ముఖపరిచయం అయింది. మానస గైడ్, తన గైడ్ ఒక్కటే అవడంతో, ఇద్దరూ గైడ్‌ని కలవడానికి చేసే వ్యర్థ ప్రయత్నంలో ఒకరికొకరు ఎదురుపడేవారు.

గైడ్ ఆఫీస్ దగ్గర ఇద్దరూ గంటలతరబడి పడికాపులు కాసేవారు.

"జీవితంలో తమకి సరి అయిన గుర్తింపు రాలేదు" అంటూ క్వాలిఫికేషన్లు లేకపోయినా వాపోయే చాలామందిలో తన గైడ్ ఒకడు. ఆశ్చర్యం ఏమిటంటే, 'కిర్ కిర్' మంటూ శబ్దంచేసే తలుపు బందులు మీదే నూనె పోస్తారు' అన్నట్లుగా గైడ్ వేసే కేకలు, అరుపులుకి భయపడో, విసుగేసో గైడ్‌కి గుర్తింపు ఎక్కువయింది. ప్రొఫెసర్ల సమర్థత వాళ్ళకింద పనిచేసే విద్యార్థులకి మాత్రమే తెలుస్తుంది. గైడ్‌కి ఒక బి. టెక్ క్లాసు, ఎమ్‌టెక్ పూర్తి చేయబోతున్న ఇద్దరు, థీసిస్ చేయడానికి ఇద్దరు పి. హెచ్. డి. విద్యార్థులు ఉండేవారు. బి. టెక్. క్లాసుకి గైడ్‌తోపాటు ఒక జూనియర్ లెక్చరర్‌ని కూడా గైడ్ దగ్గర తర్ఫీదుకి వేశారు. ఒకానొకప్పుడు ఆ జూనియర్ లెక్చరర్‌ని గైడ్ కింద పి. హెచ్‌డి. చేసినవాడే, పాతవిద్యార్థే. తెలివైన మా గైడ్ ఆ జూనియర్ లెక్చరర్ చేత మొత్తం పాఠాలన్నీ చెప్పిస్తూ, శంకుస్థాపనకి వచ్చే రాజకీయ నాయకునిలా ఒకటో రెండో క్లాసులు తీసుకునేవాడు. ఎమ్‌టెక్, పి. హెచ్‌డి., థీసిస్ గురించి వచ్చేసరికి "ఎమ్‌టెక్ క్లాసుకి చచ్చేంతపని" అని కోతలు కోసేవాడు. మొదట్లో అతను చెప్పే మాటలు విని నమ్మినా, త్వరలోనే అతని సంగతి అందరికీ తెలిసిపోయింది. వారంలో ఒకరోజు థీసిస్ గురించి మాటలాడడానికి ఉదయం పదిగంటలకి తనని కలవడానికి రమ్మని, మధ్యాహ్నం ఒంటి గంట వరకూ దిగపడకపోవడంతో అతనిని కలవకుండా లంచ్‌కి ఇళ్లకి మళ్ళేవాళ్ళం. తరువాత తను వచ్చానని బుకాయించే

వాడు. ఎవరైనా గైడ్‌తో ఏం దెబ్బలాడగ లరు? ఆ నిరీక్షణలోనే మానసతో పరి చయం పెరిగింది, ఆలోచనలు నడుస్తు న్నాయి రాఘవలో.

"మన గైడ్ ఒక పదం ఉచ్చరించడానికి విలువ ఎంతో తెలుసా? " అనడిగింది మానస ఒకరోజు.

"అదేమిటి, దానికి విలువ ఎలా కట్ట గలం? " అంటూ అతను ఆశ్చర్యపడ్డాడు.

ఒక్కసారి నవ్వింది మానస.

"అది చాలా సింపుల్. గంట క్లాసు చెప్పే టప్పుడు మన గైడ్ ఎన్నిపదాలు ఉచ్చరించ గలడో సుమారుగా ఊహించవచ్చు. ప్రభుత్వం అతనికి ఇచ్చే జీతం తెలుసుకా బట్టి, పదం ఉచ్ఛారణ ఖరీదు తెలుస్తుంది" అంది మానస.

"అయితే మీ లెఖ్ఖ బట్టి మన గైడ్ పదం ఉచ్ఛారణకి ప్రభుత్వానికి ఎంత ఖర్చవు తోంది? " అనడిగాడు తను నవ్వుతూ.

"ఏభై రూపాయలు. మన గైడ్ క్లాసులో 'యస్' అంటే ప్రభుత్వానికి ఖర్చు. తాపీ మేస్త్రీకి ఈ రోజుల్లో విశాఖపట్నంలో రోజంతా పనిచేస్తే, ఏభై, అరవై రూపా యలు ఇస్తారు. మన గైడ్‌లాంటి వాళ్ళు పాత నవారు మంచానికి పట్టిన నల్లులు లాంటివారు. బాగా రక్తం తాగుతారు. వాటిగురించి వెతికితే మంచం కోళ్ళసందు లలో పారిపోయి దాగుకుని ఉంటాయి. ఇలా మన గైడ్ గురించి కారిడార్‌లో అతని గది ఎదుట ఎన్నిసార్లు నిలుచుంటాం? మన కాలానికి విలువలేదా? " అనడిగింది మానస దేవురించిన మొహంతో.

"బహుశా పదిహేను, ఇరవైసార్లు ఇప్ప టికి అయి ఉండాలి. కానీ ఏం చేస్తాం. అతను మనకి రీసెర్చ్‌కి టాపిక్ ఇవ్వాలిగా, తప్పదుమరి" అంటూ అనునయించబోయా డు తను.

"ఎందుకు తప్పదు? నేను బాగా ఆలో చించాను. మీరు నాకంటే సీనియర్, మీరు సహకరిస్తే మనిద్దరమూ కలిసి చెరొక టాపిక్‌కోసం వెతుకుదాం" అంది మానస ఆలోచనలో పడుతూ.

"మనం చెయ్యగలమా? గైడ్‌తో అనవస రంగా తగువు పడతామేమో" అన్నాడు సందేహపడుతూ.

"మనమీద మనకి ధైర్యం లేకపోతే ఏమీ చేయలేం. ఇలా రోజులు గడిచిపోతాయి. గైడ్‌కి ఏమీ నష్టం ఉండదు. మనకే ఇబ్బంది, నష్టం" అంది మానస జుత్తుని వెనక్కితోస్తూ.

'మానసతో పరిచయం పెరగడం అలా మొదలైంది.'

మూడువారాలు బాగా కష్టపడ్డాక చెరొక టాపిక్ ఎన్నుకున్నారు. దానిమీద రీసెర్చ్ మొదలయిన ఆరంభదశలో, ఆరునెలల ఉద్యోగానికి గైడ్ ఇంగ్లండ్ వెళ్ళడం జరి గింది. అతను ఇంగ్లండ్ వెళ్ళేముందు, "నాకు ఒక టాపిక్ దొరికింది, దానిమీద పనిచేయబోతున్నాను" అని తను ఎన్ను కున్న టాపిక్ గురించి వివరించింది మానస.

గైడ్ ఏ మాత్రమూ చలించకుండా, "నేను ఒక టాపిక్ ఇద్దామనుకున్నాను. ఆ టాపిక్ ఇంకొకరికి ఇస్తాను. నీ టాపిక్ నువ్వే ఎంచుకున్నావు. గుడ్" అంటూ విమానం ఎక్కాడు.

అతని దగ్గర టాపిక్ ఉందన్నాడు కానీ అనుమానమే. మానస ఎంటెక్ థీసిస్ సకా లంలో ముగించడానికి తనూ ఒక చేయి అందించాడు. తను పి. హెచ్‌డి. థీసిస్ తయారుచేయడానికి అప్పటికి దాదాపు రెండేళ్ళ వ్యవధి ఉండడంతో మానస రాసిన థీసిస్ చదివి తనకి తోచిన సలహా అందించాడు.

ఇంగ్లండ్‌నుంచి తిరిగి వచ్చిన గైడ్‌కి థీసిస్ చేతివ్రాతప్రతి అందిస్తూ, "ఇది చదివి ఎంత త్వరగా తిరిగి ఇస్తే అంతమం చిది. టైప్ చేశాక బైండ్ చేయించడానికి

# ఏరినముత్యాలు

- ఉచితమైన స్థానంలో సముచితమైన మాట ప్రయోగించడమే ఉత్తమ శైలికి నిర్వచనం.

  – జోనాథన్‌స్విఫ్ట్

- కష్టాలను అధిగమించే శక్తి నిట్టూర్పుకంటే చిరునవ్వుకే ఎక్కువ.

  – మదర్‌థెరిసా

- ప్రపంచాన్ని అర్థం చేసుకోవాలనే కోరిక, దానిని అర్థం చేసుకొని మార్చాలనే కోరిక మానవ ప్రగతికి ప్రేరకాలు.

  – రస్సెల్

- మంచి పుస్తకాలను చదవడం గత శతాబ్దాలకు చెందిన గొప్ప వ్యక్తులతో సంభాషించడం వంటిది.

  – డిస్పార్టస్

- హడావిడిగా గ్రంథాన్నంతా చదివేకంటే అర్థం చేసుకుంటూ అరపేజీ చదివినా మేలే!

  – మెకాలే

- సైన్స్ మనకు విజ్ఞానాన్ని కలిగిస్తుంది. తత్వశాస్త్రం వివేకాన్ని వెలిగిస్తుంది.

  – విల్‌డ్యురాంట్

- గమ్యం, గమనం రెండూ ఉత్తమంగా ఉండాలి.

  – గాంధీజీ

- ఇతరుల దోషాలను చూసినట్లే తమలోని దోషాలను గ్రహించి నివారణ చర్యలు చేపట్టినపుడే ప్రపంచంలో చెడు అనేది లేకుండా పోతుంది.

  – సర్వేపల్లి రాధాకృష్ణన్

- తల్లిదండ్రులు పిల్లలకిచ్చే గొప్ప ఆస్తి కష్టపడి పనిచేసే విధానం నేర్పడమే!

  – వాట్లీ

- ఒడ్డున నిలబడి చూడటం ద్వారా సముద్రాన్ని దాటలేం.

  – ఠాగూర్

- చేతిలోవున్న పైసాకంటే రాబోయే లక్ష గొప్పదికాదు.

  – వీరేశలింగంపంతులు

- యోగ్యులు అధికారంలో ఉన్నప్పుడే శాంతిభద్రతలు ఉంటాయి.

  – పి.థాకస్

- స్వర్గంలో భగవంతుడితో ఉండగల శక్తి మనలో ఉంది.

  –మదర్‌థెరిస్సా

సేకరణ: పట్నం శేషంశెట్టి



అట్టే వ్యవధిలేదు. మళ్ళీ మీరు ఇంకెక్కడికో వెళ్ళేలోగా ఇచ్చేయండి" అంది మానస.

గైడ్ ఒక్కసారి షాక్ తిన్నాడు.

నాలుగురోజులు తరువాత కామాలు, ఫుల్‌స్టాప్‌లు మాత్రం సరిచేసి మానస చేతివ్రాత కాపీని తిరిగి ఇచ్చేస్తూ, "బాగుంది థీసిస్" అన్నాడు.

థీసిస్ అర్థం చేసుకోవాలంటే సునిశితంగా చదవాలి, ఆలోచించాలి. అదేమీ మా గైడ్ దగ్గర లేదు.

"అనుకున్నది ఏదైనా సాధిస్తుంది. పట్టుదలలో చాలా తక్కువమంది మానసతో సరితూగగలరు" అనిపించింది ఆనాడు. థీసిస్ గురించి చదువులో రోజుకి కనీసం పది గంటలయినా కలిసి గడిపేవారు. థీసిస్ వ్రాతప్రతిని బైండింగ్‌కి ఇచ్చి, బౌండ్ అయి వచ్చేదశలో మానస చాలా మూడీగా

ఉండడం గమనించాడు తను.

తనకి ఏమీ అర్థమవలేదు. ఆనందంగా ఉండవలసిన రోజుల్లో డిప్రెస్‌డ్‌గా ఉండడం చూసి విచారమేసింది. అదేమాట అంటే "కొన్ని చెప్పలేం. కొందరికి ఏమీ అర్థమవదు. నా థీసిస్‌కి చాలా సహాయం చేశావు. కానీ నీకు నేను ఏమీ చేయకుండానే వెళ్ళిపోతున్నాను, అదే నా బాధ" అంది మానస.

"దానిదేముంది, ఎవరైనా చేస్తారు. పరిస్థితి అలాంటిది. ఏమో నువ్వు పి. హెచ్‌డి.కి చేరుతావేమో" అన్నాడు తను.

"నీకు ఇన్నాళ్ళూ చెప్పలేదు, నేను పి. హెచ్‌డి. చేయడానికి అమెరికా వెళ్ళిపోతున్నాను"

"ఇది ఇంకా మంచివార్త. కంగ్రాట్స్. నువ్వు మరీ మూడీగా వుండకు" అన్నాడు తను.

"నే చెప్పానుగా కొందరికి ఏమీ అర్థమవదని. నే అమెరికా చేరాక ఉత్తరాలు రాస్తుండు" అంది విచారవదనంతో.

"నే పి. హెచ్‌. డి ఇక్కడ ముగించేలోగా నువ్వు అమెరికాలో పి. హెచ్‌. డి ముగించేస్తావు. నువ్వు ఇక్కడ ఊరికే ఉంటే నా థీసిస్ గురించి మాట్లాడుకోవడానికి మంచి కంపెనీ ఉండేది. మనం అనుకున్నట్టల్లా అన్నీ జరగవు కదా! " అన్నాడు తను ఆమెని ఉత్సాహపరుస్తూ.

పేలవంగా నవ్వింది మానస. జీవంలేని నవ్వు.

"పోస్టాఫీసుకి వెళ్లాలి" అంది మానస.

"నేనూ వస్తాను. నాకు స్టాంప్స్ కావాలి" అంటూ ఆమెని అనుసరించాడు.

పోస్టాఫీలో కోలాహలంగా ఉంది.

"నీకు స్టాంప్స్ కదా కావాలి. నే తీసుకుంటాను. సాయంకాలం ఇస్తాను. నేను నా పని చూసుకుని హాస్టల్‌కి వెళ్తాను. నువ్వు వెళ్లిపో" అంది మానస.

"లేదు నేనూ వస్తాను" అన్నాడు తను.

"చాలా ఆలస్యమౌతుంది. నువ్వు నా గురించి నిరీక్షించడంలో అర్థంలేదు. నువ్వెళ్లు" అంటూ తనని బలవంతంగా వెళ్ళిపొమ్మంది.

మానసని వదిలి ఇంటివేపు నడక మొదలుపెట్టాడు రాఘవ.

అలా చటుక్కున మాయమైపోయిన మానస దగ్గరనుంచి చాలా కాలం ఏ సమాచారమూ రాలేదు. దాదాపు పదేళ్లు గడిచాయి. మానస అంత చప్పున వెళ్ళిపోవడమే కాకుండా, తనతో ఉత్తరప్రత్యుత్తరాలు ఏమీ చేయకపోవడం తనకి ఆశ్చర్యంతో పాటు, బాధని కలిగించింది. ఎందుకు అలా చేసిందో, తను ఏం తప్పు చేశాడో తెలియక కొన్నాళ్లు మధనపడ్డాడు. కాలం అన్నింటినీ అరిగించుకోగలదు. దానికి ఆ బాధ బాగా రుచికరంగా అనిపించిందేమో పి. హెచ్‌. డి. అవగానే ఉద్యోగంలో, రీసెర్చ్‌లో పురోగమనంలో మానస జ్ఞాపకాలని చాలా వాటిని తక్కువకాలంలోనే అరిగించుకుంది. కాని "మానస ఎంపోరియం", "మానస బుటీక్" లాంటి మానస పేరు ఉన్న దుకాణాల పేర్లు చూసినా, ఎవరింటికైనా వెళ్ళినప్పుడు, "మానస" అన్న పేరు మాటలలో దొర్లినా, మానస జ్ఞాపకం వచ్చేది. మానస పరిచయం, స్నేహం ప్రకరణం ముగిసింది అనుకుంటుంటే అనుకోనిది జరిగింది ఆ వేళ.

ఎప్పటిలాగే తెల్లవారాక సూర్యుడులేచి తన విద్యుక్త ధర్మం నెరవేరుస్తూ, భూమి మీద ప్రజలు తమ విద్యుక్త ధర్మాలని నెరవేర్చడం లేదని కోపగించి కాబోలు మోతాదుకి మించి తీక్షణమైన కిరణాలని వెదజల్లుతున్నాడు. అంతకు ముందరరోజు పడిన పెద్ద వాన భూమిని, చెట్లని, వాతావరణాన్ని చల్లపరచడంతో సూర్యుని కిరణాలు మొదలయాయి. ఆకాశంలో వెల్లివిరిసే ఇంద్రధనుస్సు అందం చూసే అవకాశం ఉంటుందని పగటిపూట వానంటే





తనకి ఇష్టం. ఉదయం లేవగానే గబగబా చెప్పులు వేసుకుని పెరట్లోనికి వెళ్ళి ఆకాశం మీదకి చూస్తే లీలగా హరివిల్లు కనిపించింది. కాణీ ఖర్చులేకుండా ఆనందాన్ని ఆస్వాదించడానికి ప్రకృతిలో ఎన్నో దృశ్యాలు, అవకాశాలు ఉన్నాయి అనుకుంటూ రంగురంగుల హరివిల్లుని చూసి లోపలికి వచ్చి కాలకృత్యాలు ముగించాడు. ఒకపక్క తనపనితను చేసుకుంటూ, భర్తని కనిపెడ్తున్న సంధ్య "కనిపించిందా? " అనడిగింది.

"ఏమిటి? "

"అదే ఇంద్రధనుస్సు" అంది అక్షరాలని ఒత్తిపలుకుతూ. తలూపాడు తను.

"అదేమిటో, అది మీకే కనిపిస్తుంది. నే వెళ్ళి చూసేలోగా అది మాయమౌతుంది" అంటూ సాగతీసింది సంధ్య.

చిరునవ్వు నవ్వాడు తను.

"ఇదెప్పటినుంచి? " అనడిగింది సంధ్య కళ్ళు పెద్దవిచేస్తూ.

"ఏమిటి? "

"కన్నుకొట్టడం! అదీ నాకా? "

"కన్నుకొట్టడం కాదు. నిన్నటినుంచీ కుడికన్ను అదురుతోంది. ఈవేళ తగ్గకపోతే కళ్ళ డాక్టర్ దగ్గరకి వెళ్ళాలి" అన్నాడు తను.

"అదృష్టమండీ అదృష్టం. సిరిరా మోకాలొడ్డువాడు అన్నట్లు దానిని పోగొట్టుకుంటారేమిటి? మరేమీ ఫరవాలేదు" అంటూ లంచ్ బాక్స్ తయారుచేసింది సంధ్య.

"నీ మాటవిని కళ్ళడాక్టర్ దగ్గరకి వెళ్ళకపోతే, ఇది ఇలాగే ఉంటే రేపు క్లాసులో ఎవరికో కన్నుకొట్టినట్లనిపించి ప్రిన్స్‌పాల్‌కి రిపోర్ట్ చేస్తారు" అన్నాడు.

"కుడికన్నుని మగ విద్యార్థులవేపే తిప్పి ఉంచండి" అంటూ మూతివిరుస్తూ లోపలికి వెళ్ళింది సంధ్య.

స్కూటర్ స్టార్ట్‌చేసి, వానపడడంవలన శుభ్రమైన తారురోడ్డుమీద ఆహ్లాదంగా బండి నడుపుతూ యూనివర్సిటీ చేరి టేబిల్‌మీద పేర్చి ఉంచిన ఉత్తరాలని అందుకున్నాడు. వరుసగా ఒకటి తరువాత మరొకటి చదివి, వాటిమీద ఎలాంటి చర్య తీసుకోవాలో రాస్తూ ఆఖరికి వచ్చేసరికి, అన్నింటికన్నా దిగువన ఉన్న ఎయిర్ మెయిల్ ఉత్తరం కనిపించింది. చేతిలోనికి తీసుకోగానే, ముత్యాల్లాంటి అక్షరాలతో డా. రాఘవ అని చెక్కినట్టు రాసి ఉన్న మానస ఉత్తరం కనిపించగానే ఉత్సాహం పెల్లుబుకగా ఆత్రుతగా ఉత్తరాన్ని విప్పాడు.

ఆరు నెలలపాటు ఇండియాలో సెబాటికల్ సెలవు కాలం గడుపుదామని నిశ్చయించుకున్నానని, రాఘవ పని చేస్తున్న విభాగంలో, యూనివర్సిటీకి ఏమీ అభ్యంతరం లేకపోతే తను వచ్చి పని చేస్తానని రాసి, డిపార్ట్‌మెంట్‌లో తను రావడానికి అవసరమయే చర్చకి పనికివచ్చే రెస్యూమ్ జతపరిచానని ఉంది. తనకి ఉండడానికి తగిన వసతి సౌకర్యం తప్ప తనకి ఏమీ ఆర్థికంగా ఇవ్వనవసరం లేదని విశదపరిచింది. తడబడుతున్న చేతులతో బయోడేటా విప్పి పరిశీలించసాగాడు. అమెరికాలో పి.హెచ్.డి చేసి ప్రస్తుతం అదే యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా పనిచేస్తోంది. అలాంటి అర్హతలున్న మానస, చిన్న ప్రదేశానికి సెబాటికల్ గడపడానికి వస్తోంది. ఆశ్చర్యం! ఆశ్చర్యం కాక ఇంకే విధంగా దీనిని వివరించడం? పరధ్యానంగా లంచ్ తిన్నానని తను గ్రహించలేదు ఆలోచనల్లోపడి.

గంటల తరబడి తనూ, మానసా రీసెర్చ్ మీద, ఇతర సామాన్య విషయాల మీద కాలం గడిపినా ఉన్నట్టుండి "నేను అమెరికా వెళ్ళిపోతున్నానని" చెప్పి మాయమైన మానస, తను పనిచేసేచోటికి వస్తాననడం ఎంత యాదృచ్ఛికం? మానస చాలా లోతు గుండె మనిషి. ఆ విషయం తనే ఒకసారి చెప్పింది. చాలా సన్నిహితంగా మసలిన తనతో కూడా ఆఖరి క్షణం వరకు అమెరి

కాకి వెళ్లబోతున్నానన్నది చెప్పకుండా దాచింది. అలా చేసినందుకు తను ఎంతో గింజుకున్నా దానిని లోలోపలే అదిమి పెట్టేడు. బైటకి ప్రదర్శించలేదు. ఉత్సాహం గానే ఆమెకి వీడ్కోలు ఇచ్చేడు. మానస! అప్పటి మానసకి రాబోయే మానసకి ఎంత పోలికలుంటాయో!, అనుకున్నాడు రాఘవ.

"అన్ని గదులకీ తాళాలు వేసేశాను. మీరు ఇంకా ఉంటారా బాబూ?" అనడి గాడు నరసయ్య తాళం గుత్తిని బల్లమీద పెడుతూ. గడియారం వేపు చూశాడు. ఐదు గంటలు దాటి పదిహేను నిమిషా లైంది. "నేను మరో అరగంట ఉంటాను. నేను తాళం వేసి వెళ్తాను. నువ్వెళ్లు" అంటూ నరసయ్యని పంపేసి డిపార్ట్‌మెం ట్‌లో ఎవరికీ అభ్యంతరం ఉండడానికి ఆస్కారంలేదని సెబేటికల్‌కి తను పనిచేసే ప్రదేశాన్ని ఎన్నుకున్నందుకు ఆనందంగా ఉందని, ఇండియాలో గడపబోయే తేదీలు ముందుగా తెలియచేస్తే కావలసిన ఏర్పాట్లు చేస్తానని ఉత్తరం రాసి టైపిస్ట్ టేబిల్ మీద ఉంచి తిరిగి ఆలోచనలో పడ్డాడు.

చెదిరిన కల, తెగిన ఆలోచన తిరిగి సాధారణంగా అతుక్కోవు. గదికి తాళం వేసి బీచ్‌వేపు స్కూటర్‌ని పోనిచ్చాడు.

బీచ్‌లో ఎంతసేపు కూర్చున్నాడో తెలియ లేదు కానీ వాస్తవంలోకి వచ్చేసరికి బీచ్‌లో వీధి దీపాలు, ఇళ్లలో దీపాలు వెలిగి ఉన్నాయి. గబగబా లేచి రోడ్డు దాటి స్కూటర్ స్టార్ట్ చేశాడు. పాండురంగపురం రోడ్డు ఎత్తు ఎక్కడానికి ఘీంకరిస్తూ అవస్థ పడుతున్న స్కూటర్‌ని చూసి 'ఇంజన్ రీబోర్ చేయించాలి' అనుకున్నాడు. అతిక ష్టంమీద ఎత్తు ఎక్కి అలసిపోయిన స్కూటర్ ఆల్ ఇండియా రేడియో స్టేషన్ దగ్గరకి రాగానే వేగం పుంజుకుంది. మరో పది నిమిషాలలో ఇల్లుచేరి మెట్లు ఎక్కి తలుపు తట్టేడు తను.

"ఏమిటి ఇంత ఆలస్యం?" అంటూ సంధ్య తలుపు తెరిచింది.

"ప్రత్యేక కారణం అంటూ ఏమీలేదు. బీచ్ చాలా అందంగా మలుస్తున్నారని చెబితే అటు ఒకసారి వెళ్లాను. స్కూటర్ పార్క్‌చేసి నడిచే బాట పక్కన ఉన్న చప్టా మీద కాస్సేపు కూర్చుని వచ్చేసరికి ఆలస్య మైంది. బీచ్ అందంగా తయారవబో తోంది. అది తథ్యం. ఎన్నాళ్లలో అది అందాన్ని పూర్తిగా అలంకరించుకుంటుందో చెప్పడం అంత సులభంకాదు. మన దేశంలో రోడ్లు వేయడం ఒక వింతకళ. అత్యంత అందంగా పదికోట్లు ఖర్చు పెట్టవ లసినచోట రెండే రెండు కోట్ల రూపాయలు ఖర్చుపెడతారు. రోడ్డు తయారవుతుంది.

"అహ! మా సీతమ్మ పెళ్లి కూతురాయెనే" అంటూ పెళ్లిలో పాట ముగిసేలోగా, రోడ్డుని నీళ్ల పైపులకోసం తవ్వడం మొదల వుతుంది. ఆ పని అయేక తవ్వినపుడు రోడ్డు పక్కని గుట్టగా పోసిన మన్నుతో రోడ్డు పూడుస్తారు. ఇక్కడ రెండు రకాల సీనరీలు దర్శనమయే అవకాశంఉంది. రోడ్డు మరమ్మత్తు జరిగేలోపల దగ్గరగా ఉన్న గుడిసెలలో ప్రజలకి మన్ను అవసర మైతే ప్రభుత్వం సొమ్మేకదా, అనగా నాదే కదా అంటూ దానిని వాడుకుంటే, రోడ్డు పూడ్చినపుడు మన్నుతక్కువై అక్కడ గుంత ఏర్పడుతుంది. గుడెసెలు అప్పుడే తయా రయి, వాళ్లకి మన్ను అవసరం లేదనుకో తవ్విన మన్నుని సరిగా దిమిస కొట్టక సాపు చేయకుండా వదిలేస్తారు. రోడ్డు లెవె ల్‌కి ఎత్తుగా మన్ను ఉండిపోతుంది. యారాడుకొండ రోడ్డు మీద వెళ్లినపుడు జాగ్రత్తగా ఉండకపోతే బళ్లేమిటి మను ష్యులే బోర్లాపడతారు. ఏదిఏమైనా బీచ్ బాగుంది" అన్నాడు తను.

"మీరు అలాగే ఉండండి" అంటూ వంటింటిలోకి వెళ్లి గుప్పెడు మిరపకా యలు, ఉప్పు తీసుకువచ్చి తన మొహం చుట్టూ రెండు తిప్పులు తిప్పి వాటిని పారే




యబోతూ,

"మీకు ఏదో పూనింది" అంది సంధ్య. భళ్లున నవ్వేడు తను.

"ఎప్పుడూ ఎక్కువ మాటలాడని మీరు ఇలా సీతమ్మ పెళ్లి కూతురాయెనే, తారు రోడ్డు, యారాడకొండ అంటుంటే భయంవే సింది" అంది సంధ్య అనుమానంగా చూస్తూ.

"సాయంకాలం పూట సముద్రం ఎంత బాగుంటుందో తెలుసా? ఆ చల్లనిగాలి, నురుగు కెరటాలు, సముద్రం మీద వెలుగుతున్న లైట్లతో ఓడలు..." అంటూ సంధ్యకి విపులీకరించబోతే ఎదురుగా సంధ్య లేదు.

"కాళ్లు చేతులు శుభ్రంగా కడుక్కోండి. ఏం గాలి సోకిందో ఏమో! అన్నం వడ్డించేస్తాను" అన్న సంధ్య మాటలు విని బాత్రూంలోకి వెళ్లాడు తను.

ఆరు నెలల పాటు మానస పని చేయడానికి వస్తోం దని తెలిసిన ఆ రోజు ఎంత ఉత్సాహంగా గడి చిందో!



**ఆ**లోచనల్లోపడి కొట్టుకుపోయిన రాఘవ మానస లేచి వెళ్లడం గమనించ లేదు.

"అరె ఎక్కడికి వెళ్లావు? ఎప్పుడు వెళ్లావు?" అనడిగాడు రాఘవ లోపలికి వస్తున్న మానసని చూసి.

"నేను ఎదురుగా ఉన్నా లేకపోయినా ఒకేలా ఉన్నట్లుంది నీ వ్యవహారం. మరీ అంత ఆలోచనలో పరధ్యానమా? ఇద్దరికీ కాఫీ తీసుకు రావడానికి ఒక అరగంట క్రితం వెళ్లాను. ఏమిటంత దీర్ఘాలోచన? అప్పుడే ఇండియా మీదకి గాలి మళ్లిందే మిటి?" అనడుగుతూ కాఫీ గ్లాసందిచ్చింది మానస.

"నేను అమెరికాలో ఇక్కడికి పనిచేయడా నికి వస్తానని ఎప్పుడూ ఊహించలేదు. ఇది కలకాదుకదా?" అన్నాడు రాఘవ.

"పెద్ద బాలశిక్షలోలా కలా వలా ఏమిటి? ఇంతకీ నే అడిగిన ప్రశ్నకి సమా ధానం ఇవ్వలేదు" అంటూ మళ్లీ ప్రశ్నిం చింది మానస. సమాధానం చెప్పకుండా చిరునవ్వు నవ్వేడు రాఘవ.

"రేపు డిపార్ట్‌మెంట్‌కి ఒక విజిటింగ్ టీమ్ రాబోతోంది. ఈ యూనివర్సి టీలో రాబోయే దశాబ్దంలో ఏ భాగాల పెరుగుదలకి డబ్బు కేటాయిం చాలి? ఏ విభాగా లని మూసే యాలి? అని రిక మెండేషన్ ఇస్తుంది ఆ కమిటీ. మన డిపార్ట్‌మెంట్‌లో ఆరుగురు ఇంజ నీర్లు, ఆరుగురు కంప్యూటర్స్‌కి సంబం ధించిన ప్రొఫెసర్లు ఉన్నారు. వీళ్లలో ఆరుగు రికి టెన్యూర్ ఉంది. యూనివ ర్సిటీలో ఏ రకమైన మార్పులు వచ్చినా ఈ ఆరుగురు శాశ్వతంగా ఉండవలసిన వారే. ఈ కమిటీ సిఫార్సులు బట్టి మిగతా ఆరుగురి జీవితాలు మారుతాయి. రాబోయే రోజుల్లో యూనివర్సిటీలకి గవర్నమెంట్ నుంచి సహాయం తగ్గిపోతుందిట. అందుకే ఈ ముందాలోచనలు. రేపు రాబోయే కమి టీతో 'నా విభాగం, నేచేసే రీసెర్చ్ ఈ దేశా నికి ముఖ్యం' అంటూ ప్రతీ ప్రొఫెసరూ

అరుస్తాడు. మా డిపార్ట్‌మెంట్‌లో రీసెర్చ్ క్వాలిటీ చాలా తక్కువ. టెన్యూర్ వచ్చిన ప్రొఫెసర్లు, క్లాసులని జాగ్రత్తగా మేనేజ్ చేస్తూ రోజులు దొర్లించేస్తున్నారు. ఈ కమిటీ 'బాబూ గత పది సంవత్సరాలలో ఏం చేసేవు?' అనడిగితే ఏం సమాధానం చెప్పగలమా? అని గింజుకు ఛస్తున్నారు. కంప్యూటర్ విభాగంలోనికి లెఖ్ఖలు ఇంజనీరింగ్‌లో కొన్ని విభాగాలలోంచి వచ్చి చేరి ప్రతీ సెమిస్టర్‌లో అదే పాఠం చెప్పి ఎక్కువ జీతాలు తీసుకుంటున్నారు. పెద్దగా అంతా తెలిసినట్లు గెడ్డాలు సవరించుకుంటూ అంతా డాబుసరి వ్యవహారమే కాని లోపల. అంతా డొల్ల. ఇదంతా నీకు ఎందుకు మరో సారి చెబుతున్నానంటే నీకు ఇక్కడ రాజకీయాలతో సంబంధంలేదు. తామరాకు మీద నీటిబొట్టులా ఏమీ కలగచేసుకోకు. ఎవర్నీ ప్రత్యేకంగా పట్టించుకోకు. అంటే నాకూ దూరంగా ఉండమని కాదు" అంది మానస యధాప్రకారం నాట్యకత్తెలా చేతులు ఊపుతూ.

'అంతా డాబుసరి వ్యవహారం' అన్నపుడు, విప్పారి ఉన్న కళ్లు 'ఏమీ పనిచేయరు' అన్నపుడు చిన్నవై నిరసనని ప్రదర్శించిన తీరు చూసి 'ఈమె కళ్లతో అతి సులభంగా భావాలని వ్యక్తపరచగలదు. మరీ నలుపు కాని ఆ కళ్లలో కొత్తదనం ఉంది' అనుకున్నాడు రాఘవ.

"ఇదిగో ఇప్పుడే చెబుతున్నాను. నువ్వు నావేపు చూస్తున్నట్లనిపించినా, ఎక్కడికో చూస్తూ ఆలోచనల్లో పడితే నాకు ఒళ్లు మండుతుంది. ఏమిటాలోచిస్తున్నావు? అనడిగితే సరైన సమాధానం ఇస్తావా? అదీలేదు. నేను లేనపుడు ఆలోచనల్లో పడి ఎక్కడికి కొట్టుకుపోతావో నాకనవసరం. కానీ నే ఉన్నపుడు ఒళ్లు దగ్గర పెట్టుకో. లేకపోతే చూసిచూసి ఒక మొట్టికాయ పెట్టేస్తాను. ఇంతకీ అడగడం మరచిపోయాను. మనదేశంలో కంప్యూటర్ సైన్స్‌కోర్స్‌లు చెప్పే దుకాణాలు తెగ వెలిసేయట నిజమేనా? " అనడిగింది మానస.

"విజయనగరంలో నే హైస్కూల్‌లో చదువుకునే రోజుల్లో మా తాతగారి ఇంటికి దగ్గరగా ఒక ఫాస్ట్‌ఫుడ్ జాయింట్‌లాంటి కాకాహోటల్ ఉండేది. భార్యాభర్తా, కొడుకు ముగ్గురే నడిపేవారు దానిని. ఆ రోజుల్లో అణా బేడలు చెలామణీలో ఉండేవి. ఇడ్లీ, పూరీలు అమ్మేవాడు. ఎవరైనా వచ్చి రెండు పూరీలు అని అణా ఇస్తే ఇత్తడి గ్లాసుతో ఒకసారి టేబిల్ మీద కొట్టి 'రెండు పూరీ' అని అరిచేవాడు. చిన్న సైజ్ పూరీలు రెండు ప్లేటులో పెట్టి అందించేవాడు. ఇంకొకరు బేడ పట్టుకుని వచ్చి రెండు పూరీలు అంటే గ్లాసుతో రెండుసార్లు తట్టి 'రెండు పూరీ' అని అరిచేవాడు. ఈమారు ప్లేటులో పెద్దపెద్ద పూరీలు కనిపించేవి. ఒక మోస్తరుగా మీ మెక్డానోల్డ్‌కి చిన్న నమూనా. అలాగే ఇండియాలో ఫాస్ట్‌ఫుడ్ జాయింట్‌లాంటి కంప్యూటర్ కోర్స్‌లు చెప్పే కంపెనీలు వెలిసేయి. పిండికొద్దీ రొట్టె, డబ్బుబట్టి కోచింగ్ సర్టిఫికేట్" అన్నాడు రాఘవ.

"సంతోష్ ఉద్యోగం మానేసి ఒక కంపెనీ నడుపుతున్నాడు. ఇక్కడ ఈ దేశంలో కంప్యూటర్ వాడకం తాటిఆకు మంటలా అంటుకుంది. కాలేజీల్లోంచి కంప్యూటర్స్ చేసిన వాళ్లు తక్కువ. బైట డిమాండ్ ఎక్కువవడంతో పై దేశాలనుంచి జనాభాని ఇక్కడకి దిగుమతి చేస్తున్నాయి కంపెనీలు. అలాంటి కంపెనీ నడుపుతున్న సంతోష్ చాలా బిజీగా ఉంటున్నాడు ఈ రోజుల్లో. డబ్బు కూడా బాగా చేస్తున్నాడు. చాలా పేపర్ వర్క్ ఉంటుంది. అదీకాక కంప్యూటర్లని కంపెనీలకి సప్లయిచేస్తున్నాడు. అందుచేత కంపెనీలో ఈ పనులకోసం ఎక్కువ మందిని నియోగించి కంపెనీని పెద్ద చేస్తున్నాడు. అటూ ఇటూ తెగ తిరుగుతున్నాడు. ఎప్పుడు ఊర్లో ఉంటాడో,




ఎక్కడకి వెళతాడో ఏమీ చెప్పలేనంత బిజీ. ఆదాయం ఎంతో ఖర్చు ఎంతో లెఖ్ఖా పట్టా లేకుండా వెళ్తోంది వ్యవహారం. కాంచన సంతోష్‌ని వారంలో ఒకసారో రెండుసార్లో చూస్తోంది" అంటూ సంతోష్ గురించి వివరించింది మానస.

"నీ భయం గురించి, కాంచన తనని మిస్ అవుతోందని చెప్పేవా? " అనడిగాడు రాఘవ.

"ఒకటి, రెండుసార్లు చెప్పబోతే తనేదో బిజినెస్ మేగ్నెట్ అయినట్లు, 'నీకు దూరం చూసే చాకచక్యంలేదు, అనవసరంగా నన్ను విసిగించకు' అంటూ హెచ్చరిస్తే ఇంకేమీ చెప్పలేక మౌనంగా ఉండిపోయాను" అంది మానస.

మానస మాటల్లో ఉన్న విషాదపు జీరకి కొంత కారణం రాఘవకి అవగాహన అయింది.

"ఇంటిపని నే మేనేజ్ చేయగలను కానీ తండ్రి బాధ్యత, తండ్రి ప్రేమనే అందివ్వలేను. నేను, కాంచన ఇంటిలో ఉన్నామన్న సంగతికి సంతోష్ జీవితంలో విలువలేదు, మా ఉనికే పట్టదు. ఇది ఎక్కడకి దారితీస్తుందో" అంది మానస.

"నువ్వేమీ కంగారుపడకు. ఈమారు సంతోష్‌ని కలిసినప్పుడు, నేమాటలాడతాను" అన్నాడు రాఘవ.

"ఏ పనైనా చెయ్యి కాని ఆ పని మాత్రం చేయకు. పరిస్థితి ఇంకా తొందరగా విషమిస్తుంది" అంటూ ఆ చర్చని ముగించింది మానస.

రాఘవ ఏమీ మాట్లాడలేదు.

"జీవితం చాలా విచిత్రమైనది రాఘవా, ఇది నే తరచూ వాడేవాక్యం. మన దగ్గర ఎంత చాకచక్యం ఉన్నా, మనం ఎంత ప్రయత్నించినా కొన్ని జీవితాలు కొడికట్టేస్తాయి తొందరగా. వంకరగా ఉన్న కొవ్వొత్తిని వెలిగిస్తే మైనం కరిగి పక్కగా జారిపోయి త్వరితంగా చివరికంటా ఒత్తి వెలిగి ఆరిపోవడమో, వెలుగు బాగా తరిగి వెలగడమో మనం చూస్తాం. అలాంటివే కొన్ని జీవితాలు" అంటూ విషాదం వ్యక్తపరిచింది మానస.

★ ★ ★

అమెరికాలో గడిపిన సంవత్సరంలో సంతోష్‌లో మార్పు ఏమీ లేకపోగా పరిస్థితి ప్రతీరోజుకీ క్షీణిస్తోందని మానస తరచూ రాఘవకి చెబుతూనే వుంది. దగ్గరగా ఉన్న ప్రదేశాలు చూడడానికి మానస, కాంచన, రాఘవ కలిసి వెళ్లేవారు. సంతోష్ ఇవేమీ పట్టించుకునేవాడు కాడు.

చూస్తుండగానే అనుకున్న గడువు పూర్తయి రాఘవ ఇండియా తిరిగి వెళ్లేరోజులు దగ్గరపడ్డాయి. ఒకనాడు, "నువ్వు వెళ్లిపోయాక మళ్లీ నేను, కాంచన ఒంటరిగా మిగిలిపోతాం. మరో సంవత్సరం తరువాత కాలేజీ చదువుకి కాంచన కూడా వెళ్లిపోతుంది. అప్పుడు మొదలవుతుంది నిజమైన ఒంటరితనం. సంధ్య, నీ జీవితం నీకు ఉందనుకో. అయినప్పటికీ జాగ్రత్త. మనం మళ్లీ ఎప్పుడు కలుస్తామో కాలమే చెబుతుంది. థాంక్స్" అంది మానస బొంగురు పోయిన కంఠంతో.

రాఘవకి నోటమాట పెగలలేదు.

మౌనం అర్ధాంగీకారం అన్నట్లుగా ఆమెతో ఏకీభవిస్తూ మౌనంగా ఉండిపోయాడు రాఘవ.

★ ★ ★

'నువ్వు వెళ్లిపోతావు. నేను, కాంచన మిగిలిపోతాం. ఒంటరి దానిని అయిపోతాను' అంది మానస. ప్రపంచంలో ఏ రెండు కుటుంబాల జీవన నావ నడకలు ఒక్కలాంటివి కావు. ప్రపంచాన్ని బాగా అర్థం చేసుకోగలిగిన తెలివి, సామర్థ్యం ఉన్న మానస జీవితం అపశృతులు పలుకుతూ ఎందుకు కుంటుతోంది? జీవితం అంటే ఏమిటో అవగాహనలేని తను, సంధ్య జీవితంలో ప్రవేశించకుండా ఉంటే ఎలా నడి



చేదో! సంధ్యతో పెళ్లవుతుందన్న అను మానం ఉద్భవించిన రోజులవి. తను పెళ్లి చూపులకని పిల్లల్ని చూస్తున్న రోజులవి.

సంధ్యని చూసి ఆమె తనకి నచ్చిందని చెప్పగా ముహూర్తాలకి రోజులు వెతుకు తుంటే "ఆయనతో రెండు, మూడు సార్లు మాటలాడితేకాని తన నిర్ణయం చెప్పదుట ఆ అమ్మాయి" అంటూ మధ్యవర్తి కబురు తెస్తే.

"రాఘవా నీ మెతక తనానికి, ఆమె దూకు డుకి సరిపడదు. ఒకే ఒక పిల్లని చూసి నచ్చింది అనేశావు. చాలా మంది పిల్లలు న్నారు. మనం ఇంకో సంబంధం చూసు కుందాం" అంది అమ్మ.

"జీవితాంతం తోడు ఉండే వ్యక్తి ఎలాంటివాడో, తను ఎలాంటి వ్యక్తితో జీవితం పంచుకోబోతోందో అని తెలుసుకోవ



డంలో తప్పేముంది? ఇంకో సంబంధం గురించి ఆలోచన తరువాత చూద్దాం. నేను ఎల్లుండి ఊరుకి వెళ్లిపోతున్నాను. కాబట్టి రేపు మాత్రం ఒక సారి కలవడానికి వీలవుతుందని కబురు పెట్టు" అన్నాడు తను.

సాయంకాలం ఆరాధన సినిమాకి తనూ, ప్రసాద్ వెళ్లారు. హాలు దగ్గరకి చేరేటప్పటికి 'హాలు నిండింది' అన్న బోర్డు కనిపించి తిరిగి వెళ్లబోతుంటే ప్రసాద్ రెండు టిక్కెట్లు బ్లేక్‌లో కొని లోపలికి తీసుకెళ్లేడు. చీకటిలో ముందర వరుస సీట్లని పట్టుకుని తడుముకుంటూ హాలులోకి నడుస్తూ ముందువరసలో కూర్చున్న అమ్మాయి బుగ్గ కాబోలు తనకి తగిలింది. "సారీ" అంటూ సీట్లో చతికిలపడ్డాడు.

"బ్రూట్" అంది ముందర సీట్లో పిల్ల.

సినిమా చూస్తూ ప్రసాద్‌తో జరిగినది

మెల్లగా చెబుతుంటే "మీరు మాటలాడుకో వాలంటే బైటకి వెళ్లి మాటలాడుకోండి" అంది బ్రూట్స్ అన్న ముందు వరుసలో ఉన్న పిల్ల.

ఆరాధన సినిమా తను ఒకసారి చూసి నదే! ఇంటర్వెల్ రాబోతోందని తెలిసి ముందరగా బైటకి నడిచేడు తను. కోకా కోలా తాగి లోపలికి తిరిగి వచ్చాడు.

ఇంటర్వెల్ తరువాత ఏ ఘర్షణా లేకుండా సినిమా ముగిసింది.

ముందర వరసలో కూర్చున్న పిల్ల బైటకి వెళ్లడం తను గమనించలేదు. కాని ఏదో అనుమానం పీడిస్తోంది. ముందు వరుస పిల్ల కనిపిస్తుందేమోనని బైట ప్రజలని గమనిస్తుంటే రెండు రోజులక్రితం పెళ్లిచూపులలో చూసిన పిల్ల కనిపించింది. ముందర వరుసలో కూర్చున్న పిల్ల ఆకృతో ఏమో కాని ఆ పిల్లే తను పెళ్లిచూపులలో చూసిన పిల్ల అనిపించింది. వడివడిగా సినిమా హాల్లోంచి బైటపడ ప్రయత్నించినా ఆ అమ్మాయి మాయమైంది.

మర్నాడు సాయంకాలం బీచ్‌లో ఆమెని కలిసినపుడు దగ్గరగా ఆమెని చూడగానే ముందరరోజు ముందు వరుసలో కూర్చున్న పిల్ల ఆ పిల్లేనన్న అనుమానం ఎక్కువైంది. తనూ, సంధ్యా బీచ్‌లో నడుస్తూ ఖాళీ జాగా కోసం వెతుకుతుంటే ఒక రాలుగాయి సంధ్యని చూసి విజిలేసేడు.

"బ్రూట్, స్టుపిడ్, రౌడి" అంటూ మండి పడింది సంధ్య. బ్రూట్ అన్న పదం, దానిని ఉచ్చరించిన తీరు వినగానే సంధ్య సినిమాలో ముందర వరుసలో కూర్చున్న అమ్మాయి అని నిర్ధారణ అయింది. కుశల ప్రశ్నలయేక "ఎలా ఉంది సినిమా? " అన డిగాడు తను.

"ఏ సినిమా? "

"ఆరాధన"

"నేను ఆరాధన సినిమాకి వెళ్లేనని మీకెలా తెలిసింది? " అంటూ ఆశ్చర్యం వెలి పుచ్చింది.

"ఎలా తెలిస్తే ఏం, సినిమా ఎలా ఉంది"

"పరమ చెత్తగా ఉంది"

"నేను మద్రాసులో చూశాను చాలా బాగుంది" అన్నాడు తను.

"అయితే మన టేస్టులు వేరన్నమాట. ఇంతకీ నేను సినిమాకి వెళ్లేనని మీకెలా తెలిసింది? నన్ను వెంబడిస్తున్నారా? ఇంటిలో ఎవ్వరికీ తెలియదే" అంటూ ఆశ్చ ర్యంతో కళ్లు పెద్దవిచేసి పెదవిని కొరక డంలో పడింది.

"చీకటిలో నీ బుగ్గని తాకింది నేనే" అన్నాడు ధైర్యంచేసి.

సంధ్య ఒక్కసారి సిగ్గుపడింది. కాని వెంటనే తేరుకుని "పోకిరీ వేషాలు వేసేవా రంటే నాకు అసహ్యం. మన ఇద్దరి మధ్యా తేడాలు చాలా ఎక్కువగా ఇప్పుడే కనిపిస్తు న్నాయి" అంది సంధ్య. చిరునవ్వు నవ్వాడు తను.

"అలాంటివి నాకు అసహ్యం అంటే నవ్వు తారేమిటి? " అనడిగింది సంధ్య.

"చీకటిలో సినిమాహాల్లో సీట్లు తడుము కుంటూ చేయి తగలడానికి, సినిమాల టేస్ట్ లలో వ్యత్యాసం ఉన్నంతమాత్రాన జీవితం హాయిగా నడవదనుకోవడంలో అర్థంలేదు" అన్నాడు తను.

సంధ్య ఆలోచనలోపడింది. కాస్సేపు నడి చాక రెండు మూడుసార్లు తనని పరీక్షగా చూశాక "నేవెళతాను, చీకటిపడబోతోంది. ముహూర్తాలకి నా అభ్యంతరం ఏమీ లేదని చెబుతాను" అంటూ ఇసుక ప్రదే శాన్ని దాటి రోడ్డు మీదకి వెళ్లి కనుమరుగ యింది.

తన జీవితం సంధ్య లేకుండా ఉంటే ఎలా నడిచేదో, అనుకుంటూ కణతలు రుద్దుకున్నాడు రాఘవ.

★ ★ ★

అరోరా కారుని ఒడుపుగా తిప్పుతూ ఆర్కర్న్ వీధిలోకి మళ్లించి హౌసింగ్




కాంప్లెక్స్‌లోకి మలుపు తిప్పేడు. అరోరాని గుర్తించి కాబోలు ఎదురుగా ఒక సెక్యూరిటీ అధికారి చేయి ఊపాడు. అరోరా కారులో ఉన్న రిమోట్ కంట్రోలర్ నొక్కగానే మెల్లిగా ఇనుప గేటులు తెరచుకున్నాయి. కారు లోపలికి కదిలింది. మరో ముప్ఫయి అడుగులు కారులో ప్రయాణం చేశాక అరోరా మళ్లీ రిమోట్ నొక్కడంతో కార్లు పార్క్ చేసుకునే గరాజ్ తలుపు తెరచుకుంది. తనకై నిర్దేశించిన స్థానంలో కారుని పార్క్‌చేసి బిల్డింగ్‌లోకి ప్రవేశించడానికి తాళాల గుత్తితీసి తలుపు తెరిచాడు. తరువాత తన ఎపార్ట్‌మెంట్‌లోకి ప్రవేశించడానికి రెండు తాళాలు వాడేడు.

"ఎవరైనా నిన్ను చూడడానికి రావాలంటే ఇబ్బందే" అన్నాడు రాఘవ. నవ్వేడు అరోరా.

ఇద్దరూ కుర్చీలలో ఆసీనులయేక "అమెరికా ఇప్పుడు ఒక రకమైన భయం సైకోసిస్‌లో ఉంది. సెప్టెంబర్ పదకొండున వరల్డ్ ట్రేడ్ సెంటర్ మీద జరిగిన దాడి తరువాత అమెరికా గడ్డపైన విధ్వంసం జరిగే ఆస్కారం లేదు, అమెరికా అభేద్యము అన్న నమ్మకానికి గండి, చిన్నది కాదు పెద్దది పడింది. పర్యవసానం ప్రతీ వ్యక్తినీ అనుమానిస్తోంది. ఉలిక్కిపడుతోంది. నాకైతే అవసరమైన దానికన్నా ఎక్కువ భయపడుతున్నారు అనిపిస్తోంది. అయితే అమెరికాలో ఎవర్ని దీని గురించి అడిగినా 'జాగ్రత్త అవసరం, ఆ దరిద్రులు ఎంతకైనా తెగించేరకం. తమ ప్రాణాలనే లెఖ్ఖ చేయని పిచ్చి వెధవలకి లాజిక్ అర్థమవదు' అంటారు" అన్నాడు అరోరా. రాఘవ ఏమీ మాటలాడలేదు.

"ఇది నీకు తెలిసే ఉంటుంది. ఈ దేశంలో ప్రెసిడెంట్‌కి ఏదైనా జరిగితే వైస్ ప్రెసిడెట్ వెంటనే ప్రెసిడెంట్ అయిపోతాడు. అతనికీ ఏదైనా అయితే అమెరికన్ కాంగ్రెస్‌నేత, సుప్రీంకోర్టు ముఖ్యమైన జడ్జి... అలా ఎవరో ఒకరు ప్రెసిడెంట్‌గా పదవీ ప్రమాణంచేసి బాధ్యత స్వీకరిస్తారు. ప్రభుత్వ యంత్రాంగం స్థంభించదు. సెప్టెంబరు పదకొండవ తారీకున వరల్డ్ ట్రేడ్ సెంటర్, పెంటగాన్ మీద దాడి జరిగి వైట్ హౌస్ మీద దాడి చేయబోయిన విమానం పెన్సిల్‌వేనియా రాష్ట్రంలో కూలిపోగా ఎక్కడ ప్రెసిడెంట్‌ని దాచాలో చప్పున స్ఫురించక కాబోలు లేక ఇతర కారణాలవలనో ప్రెసిడెంట్‌ని విమానంలో దాదాపు రెండు గంటలు తిప్పారు, గాలిలో ఉంచారు. వైస్ ప్రెసిడెంట్‌ని సముద్రపు ఒడ్డుకి దూరంగా దాచేశారు. ఎవరికీ ముందర చెప్పలేదు. కాని తరవాత ఆయనని అణు ఆయుధాల ధాటికి కూడా తట్టుకునే ప్రదేశంలో నెబ్రాస్కారాష్ట్రంలో భూగర్భంలో దాచేరని వివరించేరు" అన్నాడు అరోరా.

డిసెంబర్ పదమూడవ తారీఖున ఢిల్లీలో పార్లమెంట్ భవనం మీద జరిగిన దాడి జ్ఞాపకానికి వచ్చింది రాఘవకి.

ఆవేళ ఢిల్లీలో తీసుకున్న జాగ్రత్తకి, ఇక్కడ అమెరికాలో తీసుకున్న జాగ్రత్తకి తేడా తెలిసేక ఆశ్చర్యం వేసింది. అమెరికాలో ప్రెసిడెంట్‌గా ఎన్నికయేక అతనిని పదవిలోంచి తీసే అధికారం ఎవరికీ లేదు. ప్రజలు అతనిని నేరుగా ఎన్నుకోగా వచ్చిన వాడు అవడంవలన పార్లమెంట్ లాంటి అమెరికన్ కాంగ్రెస్ కాని, రాజ్యసభలాంటి అమెరికన్ సేనేట్ కాని అతని పదవికి ముప్పు తీసుకు రాలేవు. అందుకే ప్రపంచంలో అమెరికన్ ప్రెసిడెంట్ అంటే అంత విలువ అనుకుంటుంటే "ఒక గంట పోయాక బజారుకి వెళ్దాం" అన్నాడు అరోరా.

★ ★ ★

అరోరా తనకి కావలసిన సామాన్లని అన్నీ కొనుక్కుంటూ ట్రాలీలో వేసుకున్నాడు. అతనిని అనుసరిస్తూ వెనకాలే

నడుస్తున్నాడు రాఘవ. స్టోర్‌లో పనిచేసే వాళ్లు అరోరాకి ఎదురుపడినా తప్పుకుంటూ వెళ్లిపోతున్నారేకాని అరోరాని పలకరించడం కాని, చిరునవ్వు నవ్వడంకాని చేయడం లేదు. అరోరా సామాన్లు కొనడం పూర్త యింది. ట్రాలీని తోసుకుని పైకం చెల్లించ డానికి క్యూలో నిలుచున్నాడు. ఇరవై కౌంటర్లు తెరచి ఉన్నా ప్రతీ లేన్‌లో పది పన్నెండుగురు క్యూలో నిలుచున్నారు. "అమెరికన్ ఎకానమీ బాగులేదన్నారు కాని ఈ క్యూలో నిలుచున్న మనుషుల్ని చూస్తుంటే దానిలో నిజం లేదనిపిస్తుంది ఎవరికైనా" అన్నాడు రాఘవ అరోరాతో. నవ్వేడు అరోరా.

"అమెరికన్ ఎకానమీ ఎవరికీ అర్థమ వదు. ఎక్స్‌పర్ట్స్ అంటూ టెలివిజన్ మీద వస్తుంటారే వాళ్లకే అవగాహనకి రాదు. నిజంగా వాళ్లకి అవగాహన అయితే వాళ్లం దరూ మస్తుగా డబ్బు చేసేసుకోగలరు. వాళ్లందరూ అర్థమైనట్లు ప్రకటిస్తుంటారు. లేకపోతే వాళ్ల సంగతి ఎవరు పట్టించుకు న్నారు. నువ్వు మద్రాసులో ఏదైనా పెద్ద దుకాణానికి వెళ్లు జనం ఎంతగా కిక్కిరిసి ఉంటారో! మన దేశంలో డబ్బు లేదను కుంటాం. మరి అంతమంది బంగారం ఎలా కొనుక్కుంటున్నారు ఇదీ అలాంటిదే! గత రెండు మూడేళ్లలో హైటెక్ కంపెనీలు బాగా దెబ్బతిన్నాయి. హైటెక్ స్టాక్‌కి కొలతబద్ద నాస్‌డాక్. దానివిలువ ఐదు వేల నుంచి పదిహేను వందలకి పడిపో యింది. మామూలు స్టాక్‌కి కొలతబద్ద డౌజోన్స్. అది పదకొండు వేల నుంచి తొమ్మిదివేలకి దిగింది. అందుచేత ఇతర ఉద్యోగాలు కంటే హైటెక్ ఉద్యోగాలు చాలా ఎక్కువయిపోయాయి. ఈ హైటెక్ ఉద్యోగాలు పోయినా ఈ వైట్‌కాలర్ వర్కర్స్ ఇళ్లలో చాలా శాతంలో భార్యాభర్త ఇద్దరూ పనిచేస్తుంటారు. అందుచేత వీళ్లద గ్గర కొద్దోగొప్పో నిలవ ధనం ఉంటుంది. మంచి మంచి ఇళ్లలో ఉంటారు. అందుచేత వీళ్ల ఉద్యోగం పోగానే వెంటనే రోడ్డుమీద పడరు. అదే బ్లూకాలర్ వర్కర్ అయితే వెంటనే రోడ్డు మీద పడతాడు. వైట్ కాలర్ వర్కర్‌కి చాలాకాలం ఉద్యోగం దొరకక పోతే ఇబ్బందులు ఒక్కసారి చుట్టు ముడ తాయి. ఉదాహరణకి నాలాంటి ఉద్యోగిని తీసుకో. అదృష్టవశాత్తూ నే పెళ్లిచేసుకో లేదు. కాని నాకు పెళ్లయి ఇద్దరుపిల్లలు, ఉద్యోగం చేసే భార్య ఉన్నారనుకో. గత పదేళ్లుగా నేను ఇక్కడే ఉన్నాను కాబట్టి నాలాంటి వాడికి ఒక ఇల్లు ఉంటుంది. ఊరికి దూరంగా క్రైమ్ తక్కువగా ఉన్న పేటలో ఇల్లు ఖరీదు కేలిఫోర్నియాలో నాలుగు లక్షల డాలర్లు. నలభై వేల డాలర్లు ముందస్తుగా చెల్లిస్తే మిగిలింది అంచెల మీద నెలకి దాదాపు నాలుగు వేల వాయి దాలతో కట్టడానికి సిద్ధపడితే ఇల్లు నాదవు తుంది. పిల్లల చదువులకి, కార్ల వాయిదా లకి, ఇంటి ఖర్చుకి మరొక మూడు వేల డాలర్లు అవసరం ఉంటుంది. అంటే నెలకి నా ఖర్చు ఏడువేల డాలర్లు. నాకు వచ్చే సంవత్సర జీతం లక్షా పదివేల డాలర్లు. టేక్స్‌లు పోను నా చేతికి దాదాపు డెబ్భై అందుతాయి. అంటే ఇంటిలో రెండవ వ్యక్తి పనిచేస్తేగాని ఆ లైఫ్‌స్టైల్‌కి ఎదగలేం. నా భార్య టేక్స్ పోను ఓ ముప్ఫయివేల డాలర్లు ఇంటికి తెస్తే ఇల్లు కొనుక్కోవచ్చు జీవితం బాగానే ఉంటుంది. ఉన్నట్టుండి నా ఉద్యోగం పోయింది. నా భార్య తెచ్చిన జీతం మహా అయితే ఇంటి ఖర్చులకి సరి పోవచ్చు కాని ఇతర వాయిదాలకి? ఇంటిలో పెట్టిన అసలు మొత్తంలోంచి ఓ నలభై వేల వరకు అప్పు తీసుకోవచ్చు ఒక సంవత్సరం వెళ్తుంది. తరువాత ఐపి పెట్టే యడమే! ఇండియాలో ఒకసారి పెళ్లిచేసు కుంటే ఉద్యోగం ఉన్నా లేకపోయినా ఉదయం నుంచి సాయంత్రంవరకు పొడి పొడి మాటలతో ఏడిపిస్తూ పరిహసిస్తూ




ఉన్నా పతియే ప్రత్యక్షదైవం, నీపాదదాసిని అంటూ పడి ఉంటుందేమో. ఇక్కడ అలా కాదు సంసారంలో అలజడులు లేస్తాయి. అందులో ఆర్థిక ఇబ్బందులు వాటికి బాగా దోహదం చేస్తాయి. జీవితనావ మునిగిపోతుంది. ఇలాంటివి అమెరికన్ జీవితాల్లో ఎక్కువ.

అమెరికన్ మార్కెట్‌లో హైటెక్ మార్కెట్‌లో ఉద్యోగాలకి పైదేశాలనుంచి దిగుమతి చేసుకున్న వ్యక్తుల సంఖ్య చాలా ఎక్కువ. వాళ్లకి ఉద్యోగాలు పోయి ఇంకో ఉద్యోగం రాకుండా ఉంటే ప్రభుత్వం ఇంటికి వెళ్లిపో నాయినా అంటూ విమానం ఎక్కించేసి చేతులు దులుపుకుంటుంది. వాష్‌బేసిన్ దగ్గరకి వెళ్లి చేతులు కడుగుకుంటారు. ఆ హైటెక్ ఉద్యోగాలు అమెరికన్లకి పోయినా వాళ్లకి ఇక్కడ వాళ్లు ఉన్నారు. వాళ్ల పరిస్థితి మరీ కటకటగా మారదు. కాని ఆ ఎన్రాక్ ఏండర్సన్ కంపెనీలు దెబ్బ తినడంతో వాళ్లకీ కాళ్ల వరకు మంటలు వచ్చేయి. ఆర్తనాదాలు మూకుమ్మడిగా మొదలయేయి. ఇదే నాకు అర్థమైనది. దీనిలో వాస్తవం ఎంతో నేచెప్పలేను. రేపు నాకు లైబ్రరీకి వెళ్లే పని ఉంది. నాతోరా! లైబ్రరీ ఎలా ఉందో చూద్దువుగాని" అంటుంటే

"ఎనభై ఆరు డాలర్ల నలభై సెంట్స్" అంది కౌంటర్ నిర్వహిస్తున్న మూడు వందల శ్లేన్లని అమాంతం అవలీలగా మోస్తున్న నలుపు పిల్ల. క్రెడిట్‌కార్డు అందిచ్చేడు అరోరా. దానిని వరసగా పెట్టి జరిపి,

"ఐడింటిఫికేషన్ చూపించి సంతకం పెట్టు" అంటూ ప్రింటయి వచ్చిన రసీదు ముందర ఉంచింది. అరోరా సంతకం చేసి క్రెడిట్ కార్డు అందుకుని ముందుకు నడిచాడు. ట్రాలీని నిలుపుచేసి సామాన్లని సర్ది కదలబోతుండగా "థాంక్ యు" అన్న నలుపు పిల్ల మాట వినిపించింది.

"మనకి థాంక్స్ చెప్పలేదే" అన్నాడు రాఘవ అరోరాతో.

"అన్ని చోట్లా కాకపోయినా కొన్నిచోట్ల సెప్టెంబర్ పదకొండు తరువాత ఇక్కడ మనుష్యుల ప్రవర్తనలో మార్పు కనిపించింది. అరబ్బులంటే ప్రత్యేకమైన అనుమానం, నిరసన బాగా ఎక్కువైంది. ఒకళ్లో ఇద్దరో పాకిస్తానీయులుని వదిలేస్తే మిగతా టెర్రరిస్టులు అందరూ అరబ్బులు అవడంతో ప్రజలకి వాళ్లంటే ప్రిజుడిస్ ఎక్కువయింది. సామాన్య మానవులను కూడా అనుమానిస్తున్నారు. ఈ దేశంలో ప్రజలకి ఇతర దేశాల గురించి చాలా తక్కువ తెలుసును. అందువలన అరబ్బులతో పాటు పాకిస్తానీయులని అడపాతడపా మనమీద ఆ నిరసన చూపిస్తారు. తల పాగాలు, పెద్ద గెడ్డాలు ఉన్న వాళ్లంటే వీళ్లకి భయం పట్టుకుంది. సెప్టెంబర్ పదకొండుకి ముందర నాకు లెనిన్ గెడ్డం ఉండేది. ఆ దుర్ఘటన జరిగాక ఎందుకైనా మంచిదని ఆ గెడ్డాన్ని పూర్తిగా తీసేశాను. కంపెనీలు రెండు కలిసిపోయినపుడు లేదా వ్యయం తగ్గించేటప్పుడు ఉద్యోగాలు పోతుంటాయి. ఈ ఉద్యోగాలు పోయేటప్పుడు, అకారణంగా ఉద్యోగాలు పోకూడని వాళ్లకి ఉద్యోగాలు పోయేయి. వాళ్లలో అరబ్బులు సంఖ్య ఎక్కువగా ఉందని పుకారు. ఇలాంటివన్నీ బైటకి చెప్పరు" అంటూ లేని గడ్డాన్ని నిమురుకున్నాడు అరోరా.

సెప్టెంబర్ పదకొండవ తారీకున న్యూయార్క్‌లో జరిగిన దుర్ఘటన వలన అరోరా తనకిష్టమై పెంచుకున్న గెడ్డం తీసివేయాల్సి వచ్చింది. ఇది కేవలం అతి చిన్న ఇబ్బంది మాత్రమే. అమెరికాలో పౌరులకి చాలా ప్రాథమిక హక్కులు ఉన్నాయి. వాటిలో స్వతంత్రం ఒకటి. ఒకవిధంగా చూస్తే చిన్నదైనా అరోరా ప్రాథమిక హక్కుకి భంగం వాటిల్లింది అనుకుంటూ అరోరా వెనకాలే నడిచాడు రాఘవ.

"రాత్రి మనం ఇండియన్ రెస్టారెంట్‌కి



వెళ్లి తిండి తిందాం" అంటూ అరోరా కారుని రోడ్డుమీదకి మళ్లించేడు.

"నేను చికాగో వెళ్లాలి. ఎల్లుండి ఉదయం పది గంటలకి ఫ్లైట్. ఒకసారి ఫోన్ చేయాలి" అన్నాడు రాఘవ.

"దానిదేముంది. ఇంటికి చేరగానే చేద్దాం" అంటూ రోడ్డుమీద దృష్టి మరల్చేడు అరోరా.

గేలార్డ్ రెస్టారెంటుకి రాఘవ, అరోరా చేరేటప్పటికి రాత్రి ఎనిమిదిన్నర అయింది. రెస్టారెంట్‌లో నలుగురు, అయిదుగురు మాత్రమే ఉన్నారు. అరోరాని చూడగానే దగ్గరగా వచ్చాడు మేనేజర్. కుశల ప్రశ్నలయ్యాక కావలసిన పదార్థాలకి ఆర్డరిచ్చి కబుర్లలో పడ్డారు రాఘవ, అరోరా.



"ఈ రెస్టారెంట్‌కి ఎప్పుడు వచ్చినా జనాలతో కిటకిటలాడుతూ ఉండేది. గత నాలుగు, అయిదు నెలలలో బాగా తగ్గింది" అన్నాడు అరోరా.

ఈ మాటలు విన్న మేనేజర్ గ్లాసులోనికి నీళ్ళని వంచుతూ, "గత సంవత్సరం నుంచీ... అదే సాఫ్ట్‌వేర్ రంగంలో ఉద్యోగాలు పోతున్న దగ్గర్నుంచి మాకు , వచ్చే కస్టమర్లు క్రమేణా తగ్గుతూ వచ్చారు. మధ్యాహ్నం లంచ్‌కి ఆఫీసు ఉన్న వారంరోజుల్లో చాలా గిరాకీ ఉండేది. బఫేకి నూరుమంది వచ్చేవారు. లంచ్ పేక్‌చేసి ఆఫీసులకి సప్లయి చేసేవాడిని. నిన్న లంచ్‌కి వచ్చిన వాళ్ళ సంఖ్య ముప్ఫయి. ఎంత తక్కువ వండినా మిగిలిపోయి పారేయాల్సి వస్తోంది. వ్యాపారం బాగున్న రోజుల్లో నేను ఒక్కడినీ మేనేజ్ చేయలేక అట్లాంటాలో పనిచేస్తున్న నా బావమరిదిని ఉద్యోగం మాన్పించి ఇక్కడకి రప్పించాను. అతనికి ఇద్దరు పిల్లలు. స్కూళ్లలో చదువుతున్నారు. ఆ రోజుల్లో ఎక్కువ కస్టమర్లకి అనువుగా ఉండాలని ఈ పెద్ద జాగాని అద్దెకి తీసుకున్నాను. ఆ ఇద్దరు కుక్‌లు, నలుగురు వెయిటర్లు, అదీకాక రోజు సరి జీతంమీద మనుష్యుల్ని నియమించాను. నాకున్న కుక్‌లలో ఒకతను సర్దార్జీ. సెప్టెంబర్ పదకొండవ తారీకున జరిగిన నష్టం తరువాత అతను ఇంటికి ఒకరాత్రి వెళ్తుంటే రాళ్ళు రువ్వారు ఎవరో అతను తెగభయపడుతున్నాడు. ఫ్యామిలీని ఇండియా పంపేశాడు. ఇప్పుడు ఆదాయం బాగా తగ్గింది. ఇద్దరు కుక్‌లని నే భరించలేను, నలుగురు వెయిటర్లూ ఎక్కువే. పాపం వాళ్ళకి ఇంకేదిక్కూ లేదు. కాని తప్పదు హోటల్ బిజినెస్ అంత దారుణం మరోటి లేదు అరోరాసాబ్" అంటూ మేనేజర్ వాపోయాడు.

"త్వరలో ఎకానమీ బాగుపడుతుంది, మళ్ళీ మీ బిజినెస్ పుంజుకుంటుంది" అంటూ సానుభూతి వాక్యాలు పలికాడు అరోరా.

"ఎకానమీ బాగుపడవచ్చు కాని మనం టెర్రరిస్టులు కామని వాళ్ళకి ఎలా చెప్పగలం? నా రెస్టారెంట్‌కి వచ్చే సగం జనాభా అమెరికన్సు, నా కర్మ" అంటూ నెత్తి




కొట్టుకొన్నాడు మేనేజర్.

రాఘవకి రెస్టారెంట్‌లో బిజినెస్ పడిపోవడానికి కర్మకి ఏమీ లంకె లేదని వివరిద్దామని ఉన్నా వాతావరణం అనుకూలంగా లేదని ఆ ప్రయత్నం చేయలేదు.

బేరర్ తెచ్చిన పదార్థాలని మౌనంగా తిని బిల్ పేచేసి బయటకి వెళ్ళబోతుంటే, "మమ్మల్ని మీరు కూడా మరచిపోకండి" అంటూ మేనేజర్ హెచ్చరించాడు.

ఒక దరిద్రుడు, ఒక మతోన్మాది చేసిన ఘాతుకం ఎందరి జీవితాలని తారుమారు చేస్తోందో! అనుకుంటూ ఆలోచనలో పడ్డాడు రాఘవ.

"నువ్వు బాత్రూంకి వెళ్ళినప్పుడు మేనేజరు ఒక కొత్త విషయం చెప్పాడు" అన్నాడు అరోరా.

"ఏమిటది? "

"మేనేజర్ కొడుకు స్కూల్లో చదువుతున్నాడు. అతని అబ్బాయిని స్కూల్లో వెలివేసినట్లు చూస్తున్నారట. ఇదివరలో చాలా చలాకీగా ఉండే ఆ కుర్రాడు మూడీగా తయారయి ఇప్పుడు స్కూలుకి వెళ్ళడానికి ఇష్టపడడంలేదుట" అన్నాడు అరోరా.

"ఇండియాలో ఏవేవో వింటాం. ఫలానా వ్యక్తి హోటల్ నడిపి కోటీశ్వరుడయ్యాడని, మేడలు, మిద్దెలు కట్టాడని, మెర్సిడెస్ బెంజ్ కార్లు కొన్నాడని. ఎవరి కష్టాలు వారివి, ఇతరులకి అర్థం కావు" అన్నాడు రాఘవ.

"నువ్వు కరెక్ట్‌గా ఎవరి కష్టాలు వారివి అన్నావు. ఆర్థిక మాంద్యం ఉద్యోగాలకి ఎసరు పెట్టింది. అగ్నికి ఆజ్యం పోస్తే మండినట్లు, ఈ సెప్టెంబర్ పదకొండవ తారీకున వరల్డ్ ట్రేడ్ సెంటర్‌మీద జరిగిన దాడి అమెరికాలో ఉన్న ప్రజల మానవ ఇబ్బందులకి కారణమైంది. తుంటిమీద కొడితే మూతిపళ్లు రాలేయన్నట్లు ఆనాడు జరిగిన ఘాతుకం కొంతమంది జీవితాలకి గొడ్డలిపెట్టు అయింది" అంటూ కారు వేగం పెంచాడు అరోరా.

దేముడు ఉన్నాడో లేడో ఎవరికీ తెలియదు. కాని దైవప్రేరణవలన ఇంత ఘోరం జరిగి అన్ని జీవితాలు నాశనమైతే అది ఎంత నీచమైనదో ఎవరికైనా అవగాహన అవుతుంది, చాలామందికి దేముడంటే ఉన్న రవ్వంత నమ్మకం సడలాలి! కాని పేపర్లలో చదివినదాన్ని బట్టి చూస్తే కొంత మందికి ఆ ఘాతుకం ఆనందాన్ని కలిగించింది. ఎంత దారుణం! అరోరా ఊహలు ఏమిటో తనకి తెలియదు. అరోరాతో దీని విషయమై చర్చించాలని ఉన్నా, కులం, మతం, భాషలమీద విభేదాలు స్నేహితుల్ని ఎడమొహం, పెడమొహం చేస్తాయి అనిపించి ఆగిపోయాడు రాఘవ.

★ ★ ★

ఉదయం తొమ్మిదిగంటల నలభైఐదు నిమిషాలకి లైబ్రరీ దగ్గర కారు ఆపి రాఘవని దింపి కారుని పార్క్ చేయడానికి వెళ్ళాడు అరోరా. ఇంకా పదిహేను నిమిషాల వ్యవధి ఉన్నా, బైట వివిధరకాల మనుష్యులు, లైబ్రరీ ఎప్పుడు తెరుస్తారా? అని నిరీక్షస్తున్నారు అంతా. వాళ్ళలో కొందరి దగ్గర గార్బేజ్ సంచీలు, మరికొందరి దగ్గర కుళ్లు కంపు కొడుతున్న చేతిసంచీలు ఉన్నాయి. దుమ్ము పట్టిన బట్టలమీద చిరిగిన రగ్గులు ధరించినవాళ్ళు, మామూలు దుస్తులు ధరించిన వ్యక్తులు ఉన్నారు. వాళ్ళందర్నీ గమనిస్తుంటే కారు పార్క్‌చేసి వచ్చిన అరోరా "ఇంకా ఐదు నిమిషాలుంది లైబ్రరీ తెరవడానికి" అన్నాడు.

"ఒకటి అడుగుతాను వివరించు అరోరా, వీళ్ళందరూ లైబ్రరీ కోసం వచ్చారా? అన్న అనుమానం నాకు వస్తోంది" అనడిగాడు రాఘవ.

"ఒక అయిదు నిమిషాలు ఆగితే నీకే తెలుస్తుంది" అంటుంటే లైబ్రరీ తలుపులు తెరిచారు. బిలబిలా ప్రజలు మూకగా లోపలికి జొరపడ్డారు. లోపలికి ప్రవేశించిన ఇర



నైఐదు ముప్ఫయి మందిలో దాదాపు ఇర వైమంది రెస్ట్‌రూమ్‌లవేపు నడిచి క్యూలో నిల బడ్డారు. ఐదారుగురు మాత్రం లైబ్రరీ పుస్తకా లవేపు, కంప్యూటర్లవేపు వెళ్ళారు.

"బయట నిలుచున్న వాళ్ళలో చాలామంది రోడ్డుమీద నివశించేవాళ్లు. వాళ్ళకి బాత్రూం వాడుకోవడానికి ఇంకేమీ ఆస్కారం లేక లైబ్రరీ తెరిచే సమయానికి వచ్చి బాత్రూం వాడుకుంటారు. లైబ్రరీ ప్రభుత్వం నడుపు తుంది కాబట్టి, వాళ్ళని లోపలికి రాకుండా ఎవ్వరూ ఆపరు" అని విశదీకరించాడు అరోరా. ఒక్కసారి రాఘవ మనస్సు బాధతో మూలిగింది.

"ఈ పరిస్థితి ఇప్పుడు దిగజారిందా? లేక చాలాకాలమై ఇది ఇలాగే ఉందా?" అనడి గాడు రాఘవ.

సంవత్సరం సంవత్సరానికి దిగజారు తోంది. కాని గత ఆరునెలలుగా అదే సెప్టెం



బర్ పదకొండు తరువాత ఇది కొంచెం ఎక్కువ యింది. ఉద్యోగాలు పోయాక కొన్నాళ్ళు వీళ్ళు ఉద్యోగం కోసం ప్రయత్నాలు చేసి విఫలులయి భార్యాపిల్లలని పోషించలేక, వాళ్ళమీద గుదిబండలా ఉండలేక, నిస్సహాయస్థితిలో ఇలా తయారవుతున్నారంటారు. వీళ్ళకి జబ్బులు వచ్చినా ఏమీ నివారణ మార్గం లేదు. వాళ్ళు వాడిన టాయిలెట్ మీద కూర్చోవాలంటే నాకు భయం" అంటూ లైబ్రరీలోనికి నడిచాడు అరోరా. అతనిని అనుసరించాడు రాఘవ.

★ ★ ★

"నాతో పనిచేసే ఒక సహోద్యోగి ఇంటికి సాయంకాలం టీకి వెళ్ళాం. అతను ఉంటున్న ప్రదేశానికి పనిమీద వస్తున్నానంటే తన ఇంటికి రమ్మనమని ఆహ్వానిం

చాడు. అతని కంప్యూటర్ ఏదో ప్రాబ్లెమ్ ఇస్తోందిట. దాని సంగతి ఒకసారి వచ్చి చూడమన్నాడు. నీకేమైనా అభ్యంతరమా? " అనడిగాడు అరోరా.

"నాకేమీ వ్యాపకాలు లేవు, నాకెందుకు అభ్యంతరం? " అన్నాడు రాఘవ.

"నేను స్నానం చేసివస్తాను. అంతవరకూ టెలివిజన్ చూస్తూ ఉండు" అంటూ టెలివిజన్ ఆన్‌చేసి రిమోట్ అందిచ్చి స్నానానికి వెళ్ళాడు అరోరా.

టెలివిజన్ మీద ఎక్కడ చూసినా హింసాకాండే! ఆత్మాహుతి గురించి, ఇజ్రాయిల్‌లో ప్రజలకి తగిలిన గాయాల గురించి, క్లోజప్‌లో చూపిస్తున్నారు. ఏ ఛానల్ చూసినా చూసే వ్యక్తికి పాలస్తీనీయులంత దారుణమైనవాళ్ళు ఉండరు అనిపిస్తుంది. దాని గురించి తప్పితే, ఎయిర్‌పోర్ట్‌లో సెక్యూరిటీ గురించి ముమ్మరంగా ప్రచారం చేస్తున్నారు. ఎన్ని బ్లేడ్లు, ఎన్ని కత్తులు, సూదిమొన ఉన్న వస్తువులని పట్టుకున్నారో, దానివలన రాబోయే ఘోరంని ఎలా అరికట్టాలో వివరిస్తున్నారు. ఎక్కడ చూసినా "టెర్రరిజం" మీద ఎక్స్‌పర్ట్‌లతో చర్చే విసుగేసి డిస్కవరీ ఛానల్ చూస్తుంటే అరోరా బైటకి వచ్చాడు.

"నువ్వు కాస్త ఫ్రెషప్ అయితే మనం బయలుదేరదాం" అన్నాడు అరోరా.

అరగంటలో అరోరాతో కారు ప్రయాణం మొదలయింది.

"జాన్, అదే నాతో పనిచేసే వ్యక్తి ఇల్లు ఇక్కడకి నలభైమైళ్ళ దూరంలో ఉంది. ముందు అతని ఇంటికి వెళ్ళి కాసేపు కూర్చుని, తరువాత నా పనుల సంగతి చూద్దాం" అని కారు పెద్దపెద్ద భవనాలని దాటుతుంటే వాటి గురించి వివరిస్తున్నాడు అరోరా. ఎటుచూసినా పెద్ద పెద్ద భవనాలు, ఇరవై-ముప్ఫయి అంతస్థుల ఇళ్ళు. ఇళ్ళలోనికి వెళ్ళడానికి పెద్ద గేట్, కాపలా కాస్తున్న సెంట్రీలు. నలభై నిమిషాలలో జాన్ ఇల్లు చేరేలోగా, మూడు-నాలుగు సార్లు,

"అదిగో, అది గవర్నమెంట్ భవనం, దానిమీద ఏంటో ఎయిర్‌క్రాఫ్ట్ గనులు ఉంచారు" అన్నాడు. సెప్టెంబర్ పదకొండు తరవాత అమెరికా పోకడలో మార్పు వచ్చింది. అది తథ్యం అనుకున్నాడు రాఘవ.

"గ్లాడ్ టుమీట్‌యూ" అంటూ చేయి చాచాడు జాన్. "సేమ్ హియర్" అంటూ జాన్ చేయి అందుకున్నాడు రాఘవ.

"కాఫీ, టీ, కూల్‌డ్రింక్ లాంటిదేదైనా తీసుకుంటారా? " అనడిగాడు జాన్.

"వద్దు, థాంక్స్" అన్నాడు రాఘవ. రాఘవ, అరోరా, జాన్ సోఫాలో కూర్చున్నారు. లోపలనుంచి చిన్నపిల్లల దెబ్బలాటలు, తిట్టుకోవడాలు కాస్సేపు వినిపించాక టెలివిజన్‌లోంచి మ్యూజిక్ వినిపించనారంభించింది. రెండు నిమిషాలు గడిచాక తలుపు తోసుకుని ఓ ముప్ఫయి రెండు- ముప్ఫయి నాలుగేళ్ళ స్త్రీ, ఐదున్నర అడుగుల పొడవు, దాదాపు నూటనలభై పౌన్ల బరువు ఉన్న వ్యక్తి లోపలికి వచ్చి, "హలో అరోరా" అంటూ పలకరించి జాన్ పక్కన సోఫాలో కూర్చుంది. జాన్, "నా భార్య మేరీ" అంటూ రాఘవకి పరిచయం చేశాడు. నలుగురూ కబుర్లలో పడ్డారు.

"జాన్! నిన్న చెప్పడం మరచిపోయాను. డేవిడ్ స్కూల్లో ఏదో గొడవ జరిగిందట. ఒక కుర్రాడు కత్తి చూపించి అందర్నీ భయపెట్టాడుట. ఇద్దరికి గాయాలు తగిలాయి. ఎందుకు అలా ప్రవర్తించాడో తెలియలేదు" అంది మేరీ.

"ఛ! జీవితానికి రక్షణ లేకుండాపోయింది ఎటు చూసినా వచ్చే సంవత్సరం డేవిడ్‌ని ప్రైవేట్ స్కూలుకి మార్పించాలి" అన్నాడు జాన్.

"నాలుగు రోజుల క్రితం స్కూల్లో మన





సాంప్రదాయాలనికి విరుద్ధంగా వండిన మాంసం డేవిడ్ తిన్నాడు" అంటూ ఫిర్యాదు చేసింది మేరీ.

"నేవెళ్లి ప్రిన్స్‌పాల్‌తో మాటలాడతాను. మన మతానికి విలువ ఇవ్వడంలేదని, అది చట్టరీత్యా నేరమని ఫిర్యాదు చేస్తాను. ఏమైనా ఎక్కువ మాట్లాడితే రాస్కెల్‌ని కోర్టుకి ఈడుస్తాను" అంటూ ఆగ్రహం వ్యక్త పరిచాడు జాన్.

"కాస్త మంచినీళ్ల అందియ్యి. అవునుకాని తాగడానికి నీళ్లు ఉన్నాయా? లేక అంగడి నుంచి తెచ్చేదా? " అన్నాడు జాన్. మేరీ నీళ్లు తీసుకురావడానికి వెళ్ళింది.

"ఇది నువ్వు చదివావా అరోరా? ప్రజలు తాగే నీళ్లలో విషం కలపబోతుంటే ఒకడిని పట్టుకున్నారు. ఇలా విషం కలిపే వ్యక్తి ఏ దేశానికి చెందినవాడో ప్రకటించలేదు. కాని ఖచ్చితంగా వాడు పాలస్తీనీయుడే అయిఉం డాలి. లేదా అరబ్బు దేశంనుంచి వచ్చిన వ్యక్తి అయివుంటాడు" అన్నాడు జాన్.

"నువ్వు నిన్ను సముదాయించుకో. అనవ సరంగా వ్యాకులపడి మనసు పాడుచేసు కోకు. ఎక్కడో జరిగిందని ఇక్కడ ఉలిక్కిప డితే ఎలా? ఇలా ప్రతీ నిమిషమూ, ప్రతీ దానికీ భయపడుతుంటే బతుకు దుర్భరం అవుతుంది. తాగే నీళ్లలో, పీల్చే గాలిలో దుండగులు విషపదార్థాలు కలుపుతారని మూలమూలల నక్కి బతికితే ఫ్రీడమ్ మంట కలిసిపోతుంది. దుండగుల ఆశ ఫలిస్తుంది" అన్నాడు అరోరా జాన్‌కి ధైర్యం చెప్పడానికి.

"అమెరికా యూదుల గురించి పట్టించుకో వడంలేదు. వాళ్ళూ మనుషులేనని, వాళ్ళకీ జీవించే హక్కు ఉందని, దానిని కాపాడడా నికి అమెరికా ప్రత్యేక ప్రయత్నాలు చేయ డంలేదు. ఇప్పుడిప్పుడే కాంగ్రెస్, సెనేట్‌లు ఈ విషయంలో ఆసక్తి చూపిస్తున్నాయి. ఈ మతోన్మాదులు ఈ దేశం రాకుండా చూడాలి, వలస రావడం ఆపేయాలి. అప్పు డుకాని ఈ దేశంలో సమస్యలు తగ్గవు" అన్నాడు డేవిడ్ ఆవేశంతో.

వెంటనే అరోరా ఏమీ సమాధానమీయ లేదు.

"ముందరనుంచీ వలస వచ్చిన వాళ్ళతోనే కదా అమెరికా తయారయింది. వలసని ఆపుచేయడం ఎలా సాధ్యం? ఏం న్యాయం? యూదులకి జీవించే హక్కు ఉన్నట్లు, పాలస్తీనీయులకి కూడా జీవించే హక్కు లేదా? చాలాకాలం యూదులు, ముస్లింలు ఒక్కటిగా ఉంటూ ఒకేలా జీవిస్తూ మతాలు వేరయి విడిపోయాక ఒకరంటే ఒకరికి పడకపోవడం, ద్వేషించు కోవడం ఇంత దారుణంగా ఎందుకు మారింది? " అనడిగాడు రాఘవ.

జాన్ విచిత్రంగా రాఘవవేపు చూశాడు.

"మీ దేశం పాలస్తీనీయులని సపోర్ట్ చేస్తుంది. ఐక్యరాజ్య సమితిలో అమెరికన్, ఇజ్రాయిల్‌కి విరుద్ధంగా ఎప్పుడూ ఓటు వేస్తుంది" అన్నాడు జాన్.

"నే ఇచ్చే సమాధానం మిమ్మల్ని ఇబ్బంది పెడుతుంది. ఈ చర్చ ఇంతటితో ఆపేద్దాం" అంటూ అమెరికాలో నెలకొన్న ఆర్థిక సంక్షోభం గురించి ప్రశ్నలు వేయసాగాడు రాఘవ.

అరోరా జాన్ కంప్యూటర్‌లో వచ్చిన చిక్కు తీర్చడానికి ప్రయత్నిస్తుంటే మేరీతో కబుర్లలో పడ్డాడు రాఘవ. ఒకగంట తరు వాత జాన్, మేరీల దగ్గర సెలవు తీసుకుని తిరుగు ముఖంపట్టారు రాఘవ, అరోరాలు.

"ఏమిటి జాన్‌కి నీ ఉద్దేశం వివరించ కుండా అంత చప్పగా ఆగిపోయావు? నాకు ఉన్న పరిచయాలు ఎక్కువేకాని ఈ దేశంలో చాలామందికి అమెరికా యూరప్ నుంచి వలస వచ్చిన వాళ్ళకోసమేనన్న ఉద్దేశం ఉంది. ప్రాథమిక హక్కు వాళ్ళ దని, ఇతరులు తమకంటే తక్కువ ప్రాము ఖ్యత అన్న దురుద్దేశం ఉంది. చదువుకున్న కొద్దిమందికి దానిలో ఉన్న వెలితి తెలియ

చెప్పవచ్చు 'కాని' చాలామంది తమ వాదనే సరిఅయినదని నమ్ముతారు" అన్నాడు అరోరా.

"డెమోక్రసీ, ఫ్రీడమ్ అంటూ ఎలుగెత్తే అమెరికా నియంతలని, ప్రజాస్వామ్యాన్ని అణచిపెట్టే రాజుల పాలనని ఎలా సమర్థిస్తుంది? అని అడగాలనిపించింది. కాని అతనితో అనవసరంగా ఘర్షణకి మించి ఏమీ జరగదు. ఒకటంటే ఇంకొకటి అలా వాదన పెరిగిపోతుంది. అంతే. అందుకే సందేహించాను" అన్నాడు రాఘవ.

"ఈ దేశం వచ్చి దాదాపు పదేళ్ళవుతోంది. ఈ పదేళ్ళలో నాలుగుసార్లు ఇండియా వచ్చాను. ఇండియా వెళ్ళినప్పుడు నాకు మరో రకమైన అనుభవం ఎదురవుతుంది" అన్నాడు అరోరా.

"ఏమయిందేమిటి? "

"నేను, సౌదీఅరేబియాలో చాలాకాలం పనిచేసిన ఇద్దరు మిత్రులు ఒకరింటికి వెళ్ళాం. ఏదైనా చర్చ వచ్చినప్పుడు అమెరికాని, "మీ దేశం" అంటూ సంభోదించేవాళ్ళు. సౌదీలో పనిచేస్తూ వాళ్ళని మీ సౌదీఅరేబియా అనేవారు కాదు. నన్ను "మీ దేశంలో బరితెగించిన ఆడపిల్లలు బట్టలు విప్పుకుని తిరుగుతారా? " అనడిగాడు ఒకసారి. అమెరికాలో ఉన్న వ్యక్తుల ధోరణికాని, అక్కడ నెలకొన్న పరిస్థితుల గురించి ఉత్సాహంకంటే ప్రతీ వాక్యంలోనూ అవకాశం దొరికినప్పుడు ఒక రకమైన వ్యంగ్యం, కసి, రెచ్చకొట్టే ధోరణి కనిపించింది. అమెరికాని నేనేమీ పొగడకపోయినా, అతిజాగ్రత్తగా మాట్లాడినా, వాళ్ళకి నా మాటలలో తప్పు కనిపిస్తుంది. నేనేదో పోజు కొడుతున్నానన్న భ్రమ కలుగుతుంది. అమెరికాలో జరిగే అవకతవకలకి నేనే జవాబుదారి అన్నట్లు ఉంటుంది వాళ్ళ ధోరణి. నేచెబుతున్నది బాగా చదువుకున్న వాళ్ళే, తెలివైనవాళ్ళే. ఇండియాలో జరిగే మతకల్లోలాలకి, అరాచకం అరికట్టడానికి తాము ఏమీ చేయడంలేదన్న సంగతి వాళ్ళు గుర్తించరు, ఒప్పుకోరు.

"నువ్వు, అమెరికన్ ఉద్యోగానికి వెళ్తే, అమెరికన్‌కే ఉద్యోగం ఇస్తారటకదూ? " అనడిగారు ఒకరు. ఇండియాలో కోటాలు, స్థానిక ప్రజలకి ఉద్యోగాలు ఇవ్వాలంటూ, మా కులానికి ప్రాతినిథ్యం అంటూ నడుస్తున్న అసమానత్వం గురించి వాళ్ళకి ఏమీ చీమకుట్టినట్లయినా అనిపించదు. అంతర్లీనంగా నామీద చిన్నచూపు"

"అదేమిటోయ్ ప్రభుత్వం నీమీద ఖర్చు పెట్టింది. చదువుకు అమెరికా వెళ్ళిపోతే ఎలాగోయ్" అంటూ ఆప్యాయంగా పలకరించాడు ఒక రాజకీయనాయకుడు. అతని ఇద్దరు కొడుకులు అమెరికాలో ఉన్నారు. నేను ఏమైనా అతిగా రియాక్ట్ అయ్యాననుకో.

"ఊరికే అన్నామయ్యా, మీ దేశాన్ని ఏమీ విమర్శించంలే" అంటూ తప్పుకుంటారు. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే సెప్టెంబర్ పదకొండవ తారీకు తరువాత ఆ సంఘటన గురించి మీ దేశంలో ఏమనుకుంటున్నారు? అనడిగారు ఇక్కడి ప్రజ. ఏదో చెప్పాననుకో. కాని నాకు ఇండియాలో రియాక్షన్ మూడు రకాలుగా అనిపించింది.

మొదటిరకం ఇక్కడ పిల్లలు ఉన్న తల్లిదండ్రులది. తమ పిల్లలకి ఏమైనా హాని కలిగిందా? ఇండియన్లమీద అత్యాచారాలు జరుగుతాయేమోనని భయపడ్డారు. రెండవ రకం, ఉడుకుమోతులు. "అమెరికాకి మంచి శాస్తి అయింది, ఇప్పుడు బాగా తెలుస్తుంది వాళ్ళకి మన ఇబ్బందులు. వెధవలు పాకిస్తాన్‌ని సమర్థిస్తారూ, వాళ్ళకి ఇలా శాస్తి జరగాల్సిందే!" అన్నవాళ్ళు. "ప్రాణనష్టం జరిగింది, చాలా ఘోరం. ఈ టెర్రరిజం బాధ ఇంకెంతకాలం భరించాలో" అంటూ బాధ పడ్డవాళ్ళు మూడవరకం. ఈ ఆఖరు రకం మనుష్యులు తక్కువమందే. ఏది సరి అయినది? ఏది కాదు? అన్నది అర్థంలేని

ప్రశ్న. వ్యక్తిగతంగా ఇబ్బంది అనిపించినప్పుడు ఈ నీతులు గీతులు అన్నీ మూలకి వెళ్ళిపోతాయి. జాన్ పరిస్థితి అలాంటిదే. కావలసినదానికన్నా సౌఖ్యం అనుభవిస్తున్నా, యూదులకి ఏమాత్రం ఇబ్బంది కలిగించే సంఘటన చూసినా, తెగ గోలచేస్తాడు. టెలివిజన్, పేపర్లు అగ్నికి ఆజ్యం పోస్తాయి" అంటూ గ్యారేజ్‌లోనికి కారుని మళ్ళించాడు అరోరా.

రాత్రి పదిగంటలయింది, అరోరా తన గదిలో నిద్రపోతానని వెళ్ళి పదినిమిషాలయింది.

"ఉదయం ఫ్లైట్‌కి తొందరగా బయలుదేరాలి. కాస్సేపు నిద్రపో" అని అరోరా అన్నా జెట్‌లాగ్ వలన రాఘవకి నిద్ర రావటం లేదు.



మానసిక ఇబ్బందులు! అరోరా వాడిన ఆ పదం, నిశ్చలంగా ఉన్న నీళ్ళలో రాయివేస్తే జనించిన అలలులా రాఘవ ఆలోచనలు మానస మీదకి వెళ్ళాయి.

"మానసికంగా అలసిపోతున్నాను. అమెరికా వస్తున్నానని రాసేవు, ఒక్కసారి వచ్చి చూడగలవా? " అన్న మానస అభ్యర్థనలో ఆంతర్యం ఏమిటి? ఎలాంటి మానసిక ఇబ్బంది? సంతోష్‌తో ఘర్షణ వలన ఉత్పన్నమైనదా? అలాంటప్పుడు మానసని చూడడానికి వెళ్తే అది ఇంకా విపరీత పరిస్థితులకి దారితీస్తుందేమో. అదీకాక మానసని వెళ్ళి చూసి రావడానికి మూడువందల డాలర్ల ఖర్చు అవి తన దగ్గర లేవు. కాన్ఫరెన్స్ కంటూ వచ్చిన తన టిక్కెట్ ప్రోగ్రాం మార్చడానికి వీలవుతుందా? అన్న అనుమానం ఉంది తనకి. దాని గురించి ప్రస్తావిస్తే, "నేను నీకు టిక్కట్ పంపిస్తాను" అంటూ ఆ అడ్డంకుని కొట్టిపారేసింది. ఎలాంటి కష్టాలలో ఉందో మానస? సామాన్యమైన కష్టాలని తేలికగా దిగమింగగల మానస అలా రాసి బైటపడిందంటే క్లిష్ట పరిస్థితులలో ఉందనిపిస్తోంది. మానస అలజడికి కారణమేమై ఉంటుంది? అని పరిపరివిధాల ఆలోచిస్తూ తలపట్టుకున్నాడు రాఘవ.

అరోరా రాఘవని లాస్‌ఏంజిల్స్ ఎయిర్‌పోర్ట్‌లో వదిలివెళ్ళి అరగంటయింది.

"ట్రాఫిక్‌లో ఇరుకున్నామంటే ఎంతకాలం తరువాత బయటపడతామో ఎవరూ ఊహించలేరు" అంటూ తొందర చేసి ఎయిర్‌పోర్ట్‌లో వదిలివెళ్ళాడు అరోరా. గడియారం తొమ్మిదిగంటలు చూపిస్తోంది. అంటే మూడున్నర గంటలు ఈ ఎయిర్‌పోర్ట్‌లో గడపాలన్నమాట! సూట్‌కేస్ చెక్ చేసేయడంతో బరువు లేని హేండ్‌బేగ్‌ని తోసుకుంటూ కాస్సేపు అటూ ఇటూ తిరిగాడు. స్టార్‌వన్ కాఫీదుకాణం కనిపిస్తే దానిలో దూరి కాఫీ కలుపుకుని ఒక మూలగా చతికిలపడి కాఫీని తాగనారంభించాడు. లాస్‌ఏంజిల్స్ ఎయిర్‌పోర్ట్ చెన్నై ఎయిర్‌పోర్టుకి ఇరవైరెట్లు ఉంటుంది. ఎయిర్‌పోర్ట్‌లో జనం ఎక్కువగా ఉన్నా, చెన్నై ఎయిర్‌పోర్ట్‌లోలా అరుపులు వినిపించడం లేదు. అయితే రాఘవ కూర్చున్న టేబిల్‌కి

రెండు టేబిల్స్‌కి ఆవల ముగ్గురు వ్యక్తులు ఏదో చర్చలోనికి దిగినట్లున్నారు. వాళ్ళ గొంతుకలలోంచి వెలువడుతున్న మాటలు బిగ్గరగా ఉన్నాయి అనిపించింది రాఘవకి. ఇద్దరు మధ్యవయస్కులు, మూడవ వ్యక్తి వయస్సు దాదాపు ఇరవైరెండు- ఇరవైమూ డేళ్ళు వుండవచ్చు. కాలేజీలో చదివే విద్యా ర్థిలా ఉన్నాడు.

"యుద్ధం వద్దంటూ నాలుగు రోజుల క్రితం మా కాంపస్‌లో ప్రదర్శన జరుపుకుం టామంటే ముందర అధికారులు అనుమతి ఇవ్వలేదు. తరువాత 'ప్రదర్శన చేయవచ్చు, కాని అరవడం లాంటిది వీలులేదు' అన్న ఆంక్ష పెట్టారు" అన్నాడు ఆ యువకుడు.

"యుద్ధానికి వ్యతిరేకంగా ప్రదర్శన ఏమిటి? యుద్ధం ఎందుకు చేయాల్సివ చ్చింది? మీలాంటి భావితరాన్ని రక్షించేం దుకు! మనదేశ భద్రతని కాపాడేందుకు యుద్ధం చేస్తుంటే దానికి నిరసన ఏమిటి? ' ' అనడిగాడు హవాయి టీషర్ట్ వేసుకున్న ఒక మధ్యవయస్కుడు.

"ప్రదర్శన జరిగిందా? ఎంతమంది వచ్చారు? " అనడిగాడు టీషర్ట్ ధరించిన మూడవ వ్యక్తి.

"వెయ్యిమంది వస్తారనుకున్నాం. కానీ సుమారు రెండువందల మంది మాత్రమే వచ్చారు. అధికారులు విద్యార్థులలో అదొక రకమైన భయం పుట్టించారని తెలిసింది తరువాత"

"ఎలాంటి భయం? "

"ప్రభుత్వాన్ని విమర్శిస్తూ చేసే ప్రదర్శన వీడియో తీసి, దానిలో పాల్గొన్నవాళ్ళ పేర్లు ఎఫ్.బి.ఐ. ఫైళ్లలో ఉంచి అవసరమైనప్పుడు ఆ వ్యక్తులపై చర్య తీసుకుంటారన్న పుకారు వచ్చింది. అది నిజమేననిపిస్తోంది" అన్నాడు విద్యార్థి.

"దానికేమిటి ఆధారం? "

"ప్రదర్శన చేయబోయే ప్రదేశంలో చాలా వీడియో కెమేరాలు కనిపించాయి. ఇదివ రలో ఇలాంటి ప్రదర్శన జరిగితే, ప్రదర్శనకా రులని బలవంతంగా అక్కడనుంచి లాక్కె ళ్లినా మధ్యాన్నానికల్లా వదిలేసేవారు. ఈమారు కొందరిని అరెస్ట్‌చేసి కేసులు నమోదు చేశారు" అన్నాడు విద్యార్థి.

"నేను నమ్మను. ఇదంతా నీ భ్రమ. లేదా నీ కల్పన. నువ్వు ఈ యుద్ధాన్ని సమ ర్థించకపోయినంత మాత్రాన ఇలా ప్రభు త్వానికి చెడుత్వాన్ని ఆపాదించడం అంత మంచిదికాదు" అన్నాడు పోలోషర్ట్‌ధారి.

"మా కాలంలో మేమూ ప్రభుత్వ విధా నాలు సరి అయినవి కావని, వియత్నాం యుద్ధంకి నిరసనగా మేం చాలా ప్రదర్శ నలు చేశాం. కానీ మాకేమీ ఇబ్బందులు కలుగలేదు. ఈ దేశంలో ప్రాథమిక హక్కులు ఉన్నాయి. జీవనస్రవంతి వాటి మీద ఆధారపడి ఉంది. వాటిని అణచివే యడం ఇంపాజిబుల్. ప్రత్యేకంగా ప్రదర్శన చేస్తామని అనుమతి ఎవరినీ కోరలేదు. పార్కులలో, ఖాళీ ఎక్కువగా ఉన్నచోట్ల గుమిగూడేవాళ్లం. ఎవరికి తోచింది వాళ్లు అరిచేవారు. ప్రదర్శన శాంతిపూర్వకంగా, హింసారహితంగా ఉన్నంతకాలం పోలీ సులు జోక్యం కలిగించుకోలేదు. ఎఫ్.బి.ఐ. ప్రసక్తే లేదు" అన్నాడు జుత్తు నెరసిన వ్యక్తి. అతని వయస్సు దాదాపు ఏభై ఉండ వచ్చనిపించింది రాఘవకి.

"స్వతంత్రం మనకి ముఖ్యంకదా. కమ్యూ నిజం వ్యాపించి అమెరికాలో ఉన్న ప్రజల స్వాతంత్ర్యానికి అవరోధం కలుగుతుందని అమెరికా ఆ యుద్ధం చేయాల్సివచ్చింది"

"మీరన్నది నిజమే అని ఒప్పుకున్నా ఇప్పటి మాటేమిటి? " అనడిగాడు విద్యార్థి.

"మైడియర్ ఫ్రెండ్, అప్పటికన్నా ఇప్పటి సమస్య ఇంకా జటిలమైంది. ఇది అమెరి కాలో ఉన్న ప్రజల జీవన మరణ సమస్య. చూశావుగా న్యూయార్క్‌లో జరిగిన హింసా కాండ. ఆ క్రూరుడి దగ్గర మారణాయు ధాలు ఉన్నాయి. వాటిని మనమీద ప్రయో




గిస్తే మనదేశంలో ఎంతమంది చనిపోతారో, ఎంతమంది చిన్న చిన్న పిల్లలు, వయోవృద్ధులు వ్యాధిపీడితులవుతారో ఊహించడమే కష్టం. వాళ్లందర్నీ హాస్పిటల్లో చేర్చి, వ్యాధి నివారణకి ఎన్నివందల బిలియన్ల డాలర్లు ఖర్చు అవుతాయో ఆలోచించావా? ప్రతీరోజూ ఉదయం లేచిన దగ్గరనుంచి, రాత్రి పడుకునేవారకూ ఆ నియంత ఏం చేస్తాడో, ఏంచేయగలడో అన్న భయం వలన మనదేశంలో శాంతి కొరవడి అలజడి మొదలవలేదా? నీకు నీ గర్ల్‌ఫ్రెండ్, అలవాటు ఉంటే "మారివానా" ఎక్కడ లభిస్తుందో అన్న ధ్యాసే తప్ప ఇలాంటి వాటిమీదకి దృష్టి వెళ్ళదు. మన ప్రెసిడెంట్ చెప్పినది నువ్వు వినడంలేదా? టెలివిజన్ చూడవా? పేపర్లు చదవవా? " అంటూ మండిపడ్డాడు టీషర్ట్ మధ్యవయస్కుడు.

చేతి వాచీవేపు చూసుకున్నాడు జుత్తు నెరసిన వ్యక్తి.

"టైమయింది" అంటూ మధ్యవయస్కుడు, జుత్తు నెరసిన వ్యక్తి లేచి రాఘవ కూర్చున్న చోటినుండి బైటకి వెళ్లారు. రాఘవని దాటి బైటకి వెళ్తున్న క్షణంలో,

"హి ఈజ్ ఎ బాస్టర్డ్. ఇలాంటి వాళ్లవలనే దేశం పాడుపడిపోతోంది. వాడి పేరు తెలిస్తే బాగుండును" అన్నాడు జుత్తు నెరసిన వ్యక్తి.

"అతను పర్స్ తీసి చిల్లర దానిలో వేసుకుంటుంటే అతని పేరు చూశాను" అన్నాడు మధ్య వయస్సు వ్యక్తి.

"గుడ్" అంటూ వడివడిగా అడుగులు వేసుకుంటూ జనాభాలో కలిసిపోయారు ఇద్దరూ.

ఒంటరిగా మిగిలిపోయిన యువకుడిని పరీక్షగా చూశాడు రాఘవ. మాసినట్లు ఉన్న గెడ్డం, తైల సంస్కారం లేని జుత్తు, మడతలుపడిన దుస్తులలో ఉన్నా, మనిషిలో చురుకుతనం కనిపించింది రాఘవకి.

"ఇండియాలో ఈతరం ప్రజల కట్టుబాట్లకి, ఆలోచనలకి మన తరానికి తేడా ఉన్నట్లే ఇక్కడా చాలా తేడా కనిపిస్తుంది" అన్నాడు అరోరా ఇలాంటి యువకుడినే చూపించి. "పదహారు, పదిహేడు ఏళ్లు వచ్చేసరికి, తల్లితండ్రులు చెప్పేది, చేసేది చాలా పురాతన భావాలతో బూజుపట్టి ఉంటాయని, వాటికి విరుద్ధంగా వెళ్లే మార్గమే సరి అయినదన్న ప్రదర్శన అమెరికాలో చాలామందిలో కనిపిస్తుంది. మనదేశంలో ఇలాంటివి లేవనికాదు, తక్కువ. ఉన్నా, బైటకి ఎక్కువ ప్రకటితమవవు" అన్నాడు అరోరా తను ఆలోచనలో పడడం చూసి.

కాఫీ తాగుతున్న యువకుడిని మరోసారి గమనించాడు రాఘవ. ఈ యువకుడు ఆ అలౌకికమైన దశని దాటి, తనకంటూ ఊహలు, నమ్మకాలు ఏర్పరుచుకుంటున్న దశకి చేరుకున్నాడనిపించింది. "అలా అనుకోవడానికి ఆధారం ఏమిటి? " అని మెదడు పొడిస్తే, "నోర్మూసుకో" అంటూ దానిని అదిమి, "ఈ యువకునితో మాటలు కలిపితే ఎలా ఉంటుంది? " అని కాఫీకప్పుతో అతనివేపు నడిచాడు రాఘవ. ఆ యువకునితో మాటలు ఎలా కలపాలో, అతనిని సంభాషణలోనికి ఎలా దించాలో రవ్వంతైనా తెలియని రాఘవ ఆ యువకునికి ఎదురుగా ఉన్న ఖాళీ జాగావేపు చూపించి "గుడ్‌మార్నింగ్, కెన్ ఐ సిట్ హియర్? " అనడిగాడు.

"ఐడోంట్ కేర్. దిస్‌ఈజ్ ఎ ఫ్రీ కంట్రీ" అన్నాడు ఆ యువకుడు భుజాలెగరేసి.

"ఈజ్ ఇట్? " అన్న ప్రశ్న అనాలోచితంగా రాఘవ పెదిమలనుంచి బైటపడింది.

"యు ఆర్ రైట్, ప్లీజ్ సిట్" అంటూ పిసరంత మెత్తబడ్డాడు యువకుడు.

తను ఇండియానుంచి కాన్ఫరెన్స్‌లో

# పలినముత్యాలు

* పట్టుబట్టి సాధించుకోవలసింది కీర్తి, పదిలంగా సంరక్షించుకోవలసింది గౌరవము.

– సోఫెన్‌హర్

* చేసిన స్నేహం మరువకు. మరిచే స్నేహం చేయకు.

– వివేకానంద

* ఈ రోజు నాది అనుకోగల వానికంటే ఎక్కువ ఆనందం పొందేవాడు ఉండడు.

– హోరేస్

* ఎప్పుడూ వెలుగు చూడటం నేర్చుకో. అప్పుడు అసలు చీకటే కనిపించదు.

– హెలెన్‌కెల్లర్

* కావాలనుకున్నది పొందటం విజయం. పొందినది కావాలనుకోవటం తృప్తి, సంతోషం.

– మూర్

* ఇతరులచేత ప్రశంసింపబడాలన్న బలమైన ప్రాకులాటే మానవ స్వభావపు లోతైన సిద్ధాంతము.

– విలియంజేమ్స్

* ప్రేమించే వ్యక్తికి దండించే అధికారమున్నా, ఆ అధికారాన్ని దుర్వినియోగం చేసే హక్కు మాత్రంలేదు
* ఒకరిని ఎగతాళి చేయడం సులభమే. వారిలో ఔన్నత్యాన్ని గుర్తించడం కష్టం.

– రిచర్

* ఏ విషయంపట్ల మీరు నవ్వుతారో అదే మీ గుణాన్ని పట్టి ఇస్తుంది.

– గోథె

* జ్ఞానంలేని న్యాయబుద్ధి బలహీనమైంది, నిరుపయోగమైంది. న్యాయబుద్ధిలేని జ్ఞానం ప్రమాదకరమైంది, భయంకరమైంది.

– జాన్సన్

* మనం ఎంత చేయగలమో దానినిబట్టి మన విలువ నిర్ణయించుకుంటాం. బయటివారు అలాకాదు, మనం ఎంత చేశామో దానిని బట్టి విలువ కడతారు.

– లాంగ్‌ఫెలో

* మానవులు దేవతలూ కారు. దానవులు కారు. వారు మంచి చెడుల సమ్మేళనం.

– ప్రేమ్‌చంద్

సేకరణ: పట్నంశేషంశెట్టి



పాల్గొనడానికి అమెరికా వచ్చాడని, ఇంజనీరింగ్ విభాగంలో ప్రొఫెసర్‌నని రాఘవ వివరిస్తే, ఆ కుర్రాడు తన పేరు రాస్ అని, తను సోషియాలజీలో డిగ్రీ పూర్తిచేయబోతున్నానని చెప్పాడు. రాఘవకి రాస్ ఊహలు, కోరికలు గురించి తెలుసుకోవాలని ఉన్నా ఆ టాపిక్‌వేపు సంభాషణ ఎలా మార్చాలా? అని అవస్థపడుతుంటే, 'ఫ్లైట్' పన్నెండు గంటలకయినా, ఎయిర్‌పోర్ట్‌కి తొందరగా రమ్మని ఆదేశించడంతో ఇక్కడికి తొందరగా వచ్చి పడి కాపులు కాయాల్సివచ్చింది. వెధవ సెక్యూరిటీ వీళ్లూను" అన్నాడు రాస్ ఈసడిస్తూ.

"అవును నా ఫ్లైట్ పన్నెండు గంటల ముప్ఫయినిమిషాలకి. కాని ఎయిర్‌పోర్ట్‌లో కూర్చుని ప్రజలని గమనిస్తుంటే కాలం గడిచిపోతుంది. బరువైన సామాన్లని చెక్ ఇన్

చేసేశాను" అన్నాడు రాఘవ.

"ఎయిర్‌పోర్ట్‌లో కూర్చుని ప్రజలని గమనించడం ఎఫ్.బి.ఐ, ఎ.టి.ఎఫ్, ఎయిర్‌పోర్ట్ సెక్యూరిటీ సిబ్బంది చేస్తారు. మీరు వాళ్ళకి పనిచేస్తారా?" అంటూ ఒక నవ్వు నవ్వి, "ఇదివరలో ఎయిర్‌పోర్ట్‌లో ఎలా నడిచినా, కేరింతాలు కొట్టినా, ఎవ్వరూ పట్టించుకునేవారు కాదు. ఇప్పుడు ఎయిర్‌పోర్ట్ కెమేరాలు టెర్రరిస్ట్‌లకోసం శ్రద్ధగా వెతుకుతుంటాయి. మీరు ఏమాత్రమైనా అనుమానాస్పదంగా కనిపిస్తే మిమ్మల్ని కనిపెడుతుంటారు. మీ 'బాడీ లాంగ్వేజి' వాళ్లలో అనుమానాన్ని రేకెత్తించేలా ఉండకూడదు" అంటూ ఆగి కాఫీ మగ్‌లోంచి రెండుచుక్కలు కాఫీ తాగాడు.

ఏదో ఆషామాషీగా కనిపిస్తున్న ఈ యువకునిలో ఇంత నిశితమైన దృష్టి ఉందా? అని ఆశ్చర్యపడుతూ, "యు ఆర్ స్మార్ట్, చాలా నిశితమైన దృష్టి ఉంది" అన్నాడు రాఘవ.

"స్మార్టా? నా మొహం. ఇదంతా అందరికీ తెలుసు. పేపర్లలో వీటి గురించి వచ్చాయి. మీరు ఈ దేశం ఈమధ్యనే వచ్చారు కదూ, అందుచేత ఇవన్నీ తెలిసుండవు" అంటూ లేచి ఖాళీ కాఫీ మగ్‌లో కాఫీ నింపుకోవడానికి వెళ్లాడు.

కాఫీ గురించి మానసతో జరిగిన సంభాషణ జ్ఞాపకానికి వచ్చింది రాఘవకి.

"అమెరికన్లు, అంత ఎక్కువ కాఫీ అదీ, పాలు పంచదార లేకుండా ఎలా తాగుతారో? ఈ దేశంలో ప్రజలు విచిత్రమైన వాళ్లు, అన్ని రకాల తిండ్లు తింటారు. ఐస్‌క్రీమ్‌లు దంచేస్తారు. కానీ కాఫీ దగ్గరకి వచ్చేసరికి అమ్మో! పంచదార కేలరీస్ అని చెయ్యి అడ్డంపెడతారు" అన్నాడు తను మానసతో ఒకరోజు.

"అహా! అలాగా? మనదేశంలో చాలా వంటకాలలో నూనె తెగ వాడుతారు. వేపుళ్లు, పూరీలు, పరోటాలు, బటర్ రాసుకున్న బ్రెడ్ వీటన్నింటిలోని కొవ్వు ఉంటుంది. మీగడ తీసిన పాలు ఇవ్వండి. లేదా మజ్జిగ ఇవ్వండి. పెరుగులో కొవ్వు ఉంది అంటారు. అది విపరీతంకాదా? కాఫీలో పంచదార ఏమిటి? మీ ఇండియన్లు పాకంలో నానేసిన డిసర్ట్‌లు తింటారు అని ఒకరు నాతో అంటే ఒక ఉతుకుఉతికాను. ఎవరి రుచి వాళ్లది, ఇతరుల గురించి కామెంట్స్ చేయకు" అంటూ కొరడా దెబ్బకొట్టింది మానస.

మానస కూడా ఇలాంటి వ్యవహారాల్లో ఏమీ అతీతురాలు కాదని అందామనిపించినా, 'ఆమె విరుచుకుపడడం మొదలుపెడితే చల్లపడడానికి చాలాకాలం పడుతుందని తను ఊరుకున్నాడు. అమ్మో! మానస! ఆ సమయంలో కాలిన ఇనుము. అటూ ఇటూ చూసుకోకుండా, ఆలోచించకుండా కాల్చేస్తుంది ఎదుట వ్యక్తిని' అనుకుంటుంటే ఆ యువకుడు కాఫీతో తిరిగి వచ్చాడు.

"అదేమిటి, మీ కాఫీ తాగడం పూర్తయిందా? ఇక్కడ రీఫిల్స్ ఫ్రీ" అన్నాడు ఆ యువకుడు.

రాఘవ ఖాళీ కప్పుని చెత్తకుండీలో పడేస్తూ, "నా కడుపు ఎక్కువ కాఫీని భరాయించుకోలేదు" అని సమాధానమిచ్చాడు.

"హాయ్ రాస్" అంటూ కాఫీ దుకాణంలోనికి ప్రవేశించిన ఒక యువతి పలకరించింది.

రాస్ లేచి వెళ్లి, ఆమెను గాఢంగా చుంబించి, కాస్సేపు కౌగిలించుకుని, తరువాత,

"నిన్ను కలిసినందుకు ఆనందంగా ఉంది" అంటూ ఆమెతో వెళ్ళాడు.

ఒంటరిగా మిగిలిపోయిన రాఘవ చేతి బాగ్‌ని తోసుకుంటూ కాఫీ దుకాణంనుంచి బైటకి వచ్చి పచార్లు చేయడం మొదలుపెట్టాడు. నాలుగు-ఐదుసార్లు పచార్లు చేయగానే కాళ్లు నొప్పులుపెట్టి ఖాళీగా కనిపించిన లెదర్ కుర్చీలో చతికిలపడి వాచీవేపు చూశాడు. గడియారం పది గంటల నలభై




నిమిషాలు చూపిస్తోంది. అంటే ఇంకా దాదాపు రెండు గంటలు ఉంది అనుకుంటూ కుర్చీలో అసహనంగా కదిలాడు. పదినిమిషాలు గడిచేలోగా చేతిగడియారంవేపు అరడజనుసార్లయినా చూసి ఉంటాడు విసుగ్గా.

'విసుగు! అసహనం! అటూ ఇటూ తల తిప్పి ప్రజలని గమనించడం... "ఇదేనా బాడీ లాంగ్వేజ్ కి కొలతబద్ధం" తనని పరీక్షగా ఎవరైనా పరిశీలిస్తుంటే తను విలక్షణంగా వాళ్లకి కనిపిస్తాడా?, అని రాఘవ గాభరాపడుతుంటే యూనిఫారం దుస్తులలో ఉన్న ముగ్గురు వ్యక్తులు తనవేపు వస్తుంటే భయంగా వాళ్లవేపు చూశాడు. ఆ ముగ్గురు అధికారులు వాళ్లలోవాళ్లు ఏదో చర్చించుకుంటూ, కనుమరుగయారు కాని రాఘవ గుండె తీవ్రంగా కొట్టుకోవడం తగ్గలేదు.

'తనేమీ చేయకూడని పని ఏమీ చేయలేదే! మరి తనెందుకు అంత భయపడ్డాడు? ఇదివరలో తను ఇలాంటి భయానుభూతికి లోనవలేదు. కాని ఇప్పుడు ఎందుకు ఆ మార్పు వచ్చింది? వివిధ ప్రజల ధోరణి వైవిధ్యంగా ఉంటుందన్నది అందరికీ తెలుసు. దాని గురించి ఇదివరలో పట్టించుకోని అధికారులుకి ప్రజల వైవిధ్యంలో అనుమానాలు కలుగుతున్నాయి. దీనికి ఒకే ఒక కారణం సెప్టెంబర్ పదకొండున జరిగిన ఘాతుకం. మళ్ళీ అలాంటిది జరగకుండా ఉండాలని అధికారులు తీసుకుంటున్న జాగ్రత్తలు! ఇవి మోతాదుకి మించి ఉన్నాయా? మోతాదుకి ఎక్కడ గిరి గీయాలి? అన్నవి చర్చనీయాంశాలు. సామాన్య పౌరునికి ఇబ్బంది కలగవచ్చు అతను విసుగుకోవచ్చు కానీ ఇలాంటి జాగ్రత్తలు తీసుకోకుండా ఊరుకుంటే, ఏదైనా అఘాయిత్యం మళ్ళీ జరిగితే, ఆ పౌరుడే 'జాగ్రత్తలు ఎందుకు తీసుకోలేదని? ' అధికారులని తప్పులుపడతాడు. అడగడం సులభంకదా!

ఏది ఏమైనా ప్రభుత్వం సామాన్య పౌరుడిని కూడా ఒక కంట కనిపెడుతోంది.' రాఘవ ఆలోచన ఐదురోజులక్రితం కస్టమ్స్ లో జరిగిన చిన్న సంఘటనపై నిలిచింది.

"నువ్వు ఇండియా నుంచి వచ్చావా? నాతోరా" అన్నాడు కస్టమ్స్ అధికారి. సూట్ కేస్ పాడవకుండా దానిచుట్టూ చుట్టిన ప్లాస్టిక్ తొడుగు చూసి అనుమానం వచ్చిందో లేక ఇంకే కారణమో కాని, "మీ సూట్ కేస్ తెరుస్తారా? " అనడిగాడు.

"ష్యూర్" అంటూ తాళంతో కప్పని తెరచి ఎదురుగా ఉంచాడు రాఘవ.

లోపల తనిఖీ చేస్తున్నా కుశల ప్రశ్నలు వేసి "నిన్ను ఇంటర్వ్యూ చేద్దామనిపించింది" అంటూ సూట్ కేస్ జిప్పర్ని వేసి "మీరు వెళ్లవచ్చు" అన్నాడు.

'ఇమ్మిగ్రేషన్ అధికారులు ఇలాంటి ప్రశ్నలు వేస్తారని తనకి తెలుసు. కస్టమ్స్ అధికారులు డ్రగ్స్- పళ్ళు, కాయకూరలు, విత్తనాలు గురించి వెతుకుతారు కాని ఇంటర్వ్యూ చేయగా తను చూడలేదు. తనకి ఆశ్చర్యం వేసింది.

కన్వేయర్ బెల్ట్ మీదనుంచి సూట్ కేస్ రావడానికి ఆలస్యమౌతుంటే, "బాడీలాంగ్వేజ్" తనని అనుమానితుల జాబితాలోనికి తోసిందా? అదే కారణమా? లేక కేవలం కాకతాళీయమా? తను విధ్వంశకారునిలా కనిపించాడా? ఏమిటి అమెరికా ధోరణిలో మార్పు ఖచ్చితంగా కానవస్తోంది. ఆ మార్పు తనకి ఇబ్బందికరంగా ఉంది. కాని తనేమీ చేయలేడు.

"నీతో మాటలాడాలనిపించి పక్కకి పిలిచాను. నీతో మాటలాడినందుకు నాకు చాలా ఆనందంగా ఉంది" అన్న వ్యక్తితో ఏం దెబ్బలాడగలడు? అదీకాక పరాయిదేశంలో పోట్లాడడానికి ధైర్యంతోపాటు, స్థానిక చట్టాలు కూడా తెలియాలి, అను

కుంటూ మరోసారి చేతివాచీ వేపు చూశాడు రాఘవ. గడియారం పదకొండు గంటల ముప్ఫయి నిమిషాలు చూపిస్తుంటే సెక్యూరిటీ చెక్‌వేపు నడిచాడు.

రాఘవ పక్క సీట్లో కూర్చున్న అమ్మడు రాఘవని చూసి మొదట్లో తడపడినా డా॥ రాఘవ అన్న లేబిల్ చూశాక కాస్త తేరుకుంది. రెస్ట్‌రూమ్‌కి వెళ్తూ రాఘవ తల మీద తన హేండ్‌బాగ్ బలంగా తగిల్చి "సారీ" చెప్పాక మరికొంత మెత్తపడింది. ఎయిర్ హోస్టెస్ అందరికీ తిండి అందిస్తుంటే రాఘవ "నేను శాకాహార భోజనం కావాలని రిక్వెస్ట్ చేశాను" అన్నాడు.

"ఓ అలాగా చెక్ చేస్తాను" అని లోపలికి వెళ్ళివచ్చి "సారీ, కంప్యూటర్‌లో ఈ విషయం నమోదు అవ్వ లేదు. ఇప్పుడెలా? పదార్థాలలో మాంసం తీసేసి మిగతాది ఇవ్వనా? " అనడిగింది. రాఘవ తల అడ్డంగా ఉపాడు.



"ఈ రోజుల్లో విమానాలలో సర్వీస్ పాడయిపోయింది. ఇదివరకు స్టీల్ కత్తులు, ఫోర్క్‌లు ఇచ్చేవారు. ఆ న్యూయార్క్ దుర్ఘటన తరువాత ప్లాస్టిక్ సామాన్లు ఇస్తున్నారు. తిండి ఇవ్వడం తగ్గించి, కొన్ని ఫ్లైట్‌లలో కేవలం వేరుసెనగపప్పు పాకెట్‌లు ఇస్తున్నారు" అంది పక్కన కూర్చున్న అమ్మడు.

"నేను ఈ దేశంలో జరిగే కాన్ఫరెన్స్‌కి వచ్చాను. చాలాకాలం క్రితం ఒక సంవత్సరం ఈ దేశంలో పనిచేశాను. అప్పటికి ఇప్పటికీ చాలా తేడా కనిపిస్తోంది. ఎయిర్ పోర్ట్‌లలో సెక్యూరిటీ చాలా పెంచారు" అన్నాడు రాఘవ.

"సెప్టెంబరు పదకొండవ తారీఖు తరువాత ఎయిర్‌లైన్స్ ఉద్యోగాలు దాదాపు ఎనభైవేలు ఊడిపోయాయి. ప్రజలు విమానాలలో ప్రయాణం చేయడానికి చాలా భయపడుతున్నారు, పర్యవసానంగా ఉద్యోగస్థులు తగ్గారు. ఎయిర్‌పోర్ట్‌కి ఇదివరలో అరగంట ముందర వస్తే సరిపోయేది, ఇప్పుడు రెండు గంటల ముందర రమ్మంటున్నారు. ఎయిర్‌పోర్ట్‌లో సెక్యూరిటీ పెంచడానికి టిక్కెట్ ధర పెంచారు. ఎంత మంది ప్రయాణీకులు పనిలేకుండా ఎయిర్‌పోర్ట్ క్యూలో నిలుచుంటే ఎంత కాలం వృథా అవుతోంది? ఎంత నష్టం దేశానికి! మతోన్మాదులు చేసిన ఆ ఘాతుకంవలన ప్రపంచం అంతా ఇబ్బంది పడుతోంది" అంది అమ్మడు.

ఎయిర్‌హోస్టెస్ రాఘవకి బక్కచిక్కిన భోజనం తెచ్చి అందిచ్చింది. మూతలు తీసి చూస్తే పచ్చి కేరెట్లు, బ్రోకోలీ, కేప్సికమ్ ముక్కలు, ఒక బ్రెడ్ రోల్ ఉన్నాయి. వెన్న రాసుకుందామని బ్రెడ్ రోల్‌ని ప్లాస్టిక్ కత్తితో కోయబోతే సాధ్యపడలేదు. విసుక్కుంటూ దానిని నోటితో కొరికాడు రాఘవ.

అరగంట గడిచేసరికి తిండిసామాన్లు, ఇతర చెత్తని ఎయిర్ హోస్టెస్ తీసుకెళ్లింది. అదయ్యాక టెలివిజన్‌మీద ముందరే రికార్డ్ చేసిన వార్తలు ప్రసారం చేయడం మొదలు





పెట్టారు.

"అమెరికా యుద్ధం" అంటూ ఆఫ్ఘనిస్తాన్ గురించి చూపించాక, పాలస్తీనా ఇజ్రాయిల్ మధ్య జరుగుతున్న ఘర్షణ గురించి ప్రస్తావనకి వచ్చింది.

"ఎంతమందిని పొట్టన పెట్టుకుంటున్నారో. ఈ ఆత్మాహుతి చావులు ఎప్పుడు ఆగుతాయో" అంది పక్కనున్న అమ్మడు తెగ బాధపడిపోతూ.

"అవును, హెలికాప్టర్‌లలో, విమానాల లోంచి బాంబుల వర్షం కురుస్తుంటే చాలా మంది చనిపోతారు" అన్నాడు రాఘవ.

"నేను ఇజ్రాయిల్‌లో ఉన్నవాళ్ల గురించి చెబుతున్నాను. పాలస్తీనీలందరూ టెర్రరిస్టులు. వాళ్ళని చేల్చేసినా ఏమీ తప్పులేదు" అంది అమ్మడు శరీరాన్ని కుదుపుకుంటూ.

ఒక్కసారి గతుక్కుమన్నాడు రాఘవ.

"టెలివిజన్ చూడండి, పేపర్లు చదవండి. ఈ దేశంలో ఎవరిని అడిగినా చెబుతారు ఈ ఘర్షణలో తప్పు ఎవరిదో! మీ దేశంలో దీని గురించి ఏమనుకుంటున్నారు? " అన డిగింది అమ్మడు.

"మా దేశంలో ఇక్కడ పేపర్లు, ఇక్కడ టెలివిజన్ ఛానెల్స్ రావు. మహా అయితే మేము బిబిసి చూస్తాం. దీని గురించి మరీ ఎక్కువగా అక్కడ ప్రసారం చేయరు. చాలామంది చనిపోతున్నారని మాత్రం అందరికీ తెలుసును" అంటూ గోడమీద పిల్లివాటంగా సమాధానమిచ్చాడు రాఘవ.

"అవునవును" అంటూ తల ఊపింది పక్కసీట్లో అమ్మడు.

అమెరికా టెలివిజన్‌లో ఏమి ప్రసారం చేయాలి? ఏది ప్రాముఖ్యంగా చూపించాలి? అని నిర్ణయించే అధికారం ప్రైవేట్ కంట్రోల్‌లో ఉన్న కంపెనీలదేనని, ఆ కంపెనీలకి యాజమాన్యం ఎవరి చేతుల్లో ఉందో అందరికీ తెలుసు. వార్తాపత్రికలు, టి.వి.లు చూపించిందే చూపించి, రాసినదే రాసి, చెప్పినదే చెప్పడంతో ప్రజలు ఇంకేమీ చూడక, ఇంకేమీ చదవక, ఇంకేమీ వినక సంఘర్షణలో ఇజ్రాయిల్ బాగా నష్టపోతున్నట్లు నమ్ముతారు.

పక్కసీట్లో కూర్చున్న రెండువందల పౌన్ల అమ్మడు, తిండి తినడంతో కడుపు బరువెక్కి కాబోలు వెనక్కి చారబడి, సన్నని గురక పెడుతూ నిద్రలోనికి ఒరిగింది.

రాఘవకి చప్పున నిద్రరాదు. టెలివిజన్ వేపు యాంత్రికంగా చూస్తూ ఆలోచనలో పడ్డాడు. 'అమ్మడుకి ఇతర ప్రపంచం గురించి తెలిసినట్లే లేదు. కాని ఆ ఘర్షణకి మరో కోణం ఉందని తెలిసిన తను దానిని ఎందుకు వివరించలేదు? గోడమీద పిల్లివాటంగా ఆమెతో ఎందుకు చెత్తవాగాడు? భయమా? దేనికి భయం? సెప్టెంబర్ పదకొండు తరువాత ఎవరైనా ప్రభుత్వాన్ని అతిగా విమర్శించినా, దుయ్యపట్టినా పోలీసులు అనుమానం అన్న నెపంతో జైలులో పెట్టేస్తున్నారని ఇందాక విన్నాక తనకీ ఆ గతిపడుతుందని భయపడ్డాడా? గత సంవత్సరంలో ప్రాథమిక పౌరహక్కులకి భంగం వాటిల్లిందని, ప్రభుత్వం ఏ వ్యక్తినైనా నిర్బంధించగలదని చెప్పగా విని తనలో భయం చోటుచేసుకుందా? ఇజ్రాయిల్ బలప్రదర్శనలో చాలామంది పాలస్తీనీయులు చనిపోతున్నారని బైటకి అంటే అమెరికాలో దేశద్రోహమా? కాదు, కాకూడదు. కాని ఈ అమ్మడు గూఢచారేమో! తనమీద చిలవలు పలవలు కల్పించి చెబితే? !

"నువ్వు ఒట్టి పిరికివి! గోడమీద పిల్లివాటం. దేనిమీదా నువ్వు నిలబడవు. నిన్ను నమ్ముకుంటే నట్టేటిలో మునిగిపోతారు" అంది మానస ఒకరోజు ఏదో సందర్భంలో. తనేదో చెప్పబోతుంటే,

"ఏమీ చెప్పకు. జీవితం అంతా ముందర ఉంది. నీ ధోరణి మార్చుకో. నీ వ్యక్తిత్వానికి నువ్వు విలువ ఇచ్చుకోలేకపోతే ఇంకెవరూ నీకు విలువ ఇవ్వరు" అంది. 'ఎందుకు అంత దుయ్యపట్టిందో' అని గతం

లోనికి చూశాడు రాఘవ. మెల్లిగా గతం జ్ఞాపకానికి వచ్చింది.

'ఆరోజు రీసెర్చ్ పేపర్ రాసి గైడ్‌కి చదవడానికి ఇస్తే, గైడ్ ఆ పేపర్ రాసినవాళ్ల పేర్లలో తన పేరు ముందర ఉంచుకుని, పేపర్ రాసిన తన పేరు, మానస, రాఘవ పేరుని వెనక్కినెట్టాడు. తనేమీ మాటలాడ లేదు. కాని మానస ఊరుకోలేదు. "ఈ పేపర్ రాయడంలో ప్రముఖంగా కష్టపడ్డది రాఘవ. అతని పేరు అందరికంటే ముందర ఉండాలి" అంది ఏమాత్రం జంకు లేకుండా.

"విద్యార్థులుగా ఉన్నపుడు గైడ్ పేరు ముందర ఉండడం ఆనవాయితీ, అదే నే చేయబోయాను" అన్నాడు గైడు.

ఊరుకో అంటూ మానసకి సైజ్ఞ చేశాడు తను, ఆమె ఏమీ పట్టించుకోలేదు.

"ఎవరు పెట్టారు ఆనవాయితీ? ఆనవాయితీలు మారతాయి. న్యాయం అంటూ ఒకటి ఉంది" అంది.

మానసవేపు తీవ్రంగా చూసి వరుసని మార్చాడు గైడ్.

మానస అన్న ఆ మాటవలన తను చాలాసార్లు గోడమీద పిల్లివాటం ధోరణి విడనాడాడు. అయినా సభ్యత దృష్ట్యా కొన్నిచోట్ల ఆ ధోరణిని ప్రదర్శించక తప్పడం లేదు' అనుకున్నాడు.

లాస్ ఏంజిల్స్‌లో బయలుదేరిన విమానం మినియాపోలీస్‌లో ఆగింది. అక్కడ ఒక గంట నిరీక్షించాక, ఇంకో విమానం చికాగో తీసుకెళ్తుంది. లాస్‌ఏంజిల్స్‌లోనే రెండు ఫ్లైట్స్‌కి బోర్డింగ్ పాస్ ఇవ్వడంతో, మినియా పోలీస్‌లో విమానం లోంచి బైటపడి, తరువాత ఫ్లైట్ గేట్‌వేపు నడక మొదలుపెట్టాడు.

ఎయిర్‌పోర్ట్ అధునాతనంగా ఉంది. ఎయిర్‌పోర్ట్‌లో ఒక గేట్ నుంచి ఇంకో గేట్‌కి వెళ్ళడానికి మోనో రైలు, నడక సుగమ్యం చేయడానికి బ్యాటరీతో నడిచే వాహనాలు, కన్వేయర్ బెల్ట్‌లు... చూడడానికి చాలా ముచ్చటగా ఉంది ఎయిర్‌పోర్ట్. కూర్చోవడానికి లెదర్ కుర్చీలు నిరీక్షిస్తున్న కాలంలో బోర్ తగ్గించడానికి పెద్దపెద్ద స్క్రీన్‌మీద సి.ఎన్.ఎన్. న్యూస్ ప్రసారం చేస్తున్నారు. కాస్సేపు చూసేసరికి చెప్పిందే చెప్పడం కనిపించింది. షరా మామూలే. అమెరికా ప్రపంచాన్ని రక్షించిందని, ఒక నియంతని పారద్రోలి ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పడానికి సహాయం చేసిన సైనికులకి నివాళ్లు అర్పిస్తూ, అందరూ పొగుడుతున్నారు. సైనికులు యుద్ధ ప్రదేశంనుంచి తిరిగి వస్తుంటే జాతీయ జెండాని ఎగరేసి, స్వాగతం పలుకుతున్నారు.

"చికాగో వెళ్లే ప్రయాణీకులని ఇంకో ఐదు నిమిషాలలో విమానంలోనికి పంపిస్తాం" అన్న ప్రకటన వెలువడగానే లేచి నిలబడి తన వరుసకి పిలుపు వచ్చేంతవరకు నిరీక్షించి, విమానంలో ప్రవేశించి సీటులో చతికిలపడ్డాడు. ఉన్న మూడు సీట్లలో తను తప్ప మిగిలిన రెండు సీట్లు ఖాళీ. పక్కన ఎవరైనా వస్తారా? రారా? అనుకుంటుంటే పైలట్ విమానం ఇంకో ఐదునిమిషాలలో బయలుదేరబోతోందని, విమానం తలుపులు మూయబోతున్నారని చెబుతుంటే, ఓ ముప్పయి ఐదేళ్ల వ్యక్తి దూసుకువచ్చి, బ్రీఫ్ కేస్‌ని మీద లగేజ్ కంపార్ట్‌మెంట్‌లో దాచి, సీట్ బెల్ట్ పెట్టుకున్నాడు. త్వరత్వరగా నడిచి వచ్చాడు కాబోలు, అతని మొహం మీద చమట ప్రస్ఫుటంగా బైటకి ఉబికింది.

పది నిమిషాలలో విమానం ముప్పయి ఏడువేల అడుగులు ఎత్తులోనికి వెళ్లాక, పైలట్ ఎలక్ట్రానిక్ పరికరాలని ఉపయోగించవచ్చని ప్రకటించడంతో రాఘవ పక్కన కూర్చున్న వ్యక్తి, లాప్‌టాప్ కంప్యూటర్ తెరచి పనిచేసుకోవడం మొదలుపెట్టాడు. ఒక అరగంట గడిచేలోగా ఎయిర్ హోస్టెస్‌లు వేరుసెనగపప్పు పాకెట్లు, ఫ్రూట్




జ్యూస్ అందిచ్చేలోగా పక్కన కూర్చున్న వ్యక్తి కంప్యూటర్‌లో టైప్ చేస్తూ, 'షిట్', 'బిచ్' లాంటి అశ్లీలపు పదాలని మూడు నాలుగుసార్లు ఉపయోగించాడు. ఒక పక్క పనిచేస్తూ రెండో పక్కన విస్కీని గడగడా పట్టిస్తుంటే, అతనిని అప్పుడప్పుడు గమనిస్తున్న రాఘవకి ఆశ్చర్యం కలుగుతోంది. చికాగో ఎయిర్‌పోర్ట్‌లో విమానం దిగడానికి ఇంకా అనుమతి లభించలేదని, మరో ఐదు పది నిమిషాలలో లభించవచ్చుని, నిర్ణీత సమయానికి పది నిమిషాలు ఆలస్యంగా వాలుతుందన్న ప్రకటన వెలువడగానే కంప్యూటర్‌ని దాచి,

"షిట్, డిన్నర్‌కి ఆలస్యమైపోతాను" అంటూ గొణుక్కున్నాడు.

"పదినిమిషాలే ఆలస్యం అన్నాడు కదూ" అంటూ రాఘవ బైటకి అనాలోచితంగా అన్నాడు.

"ష్యూర్! చూస్తూ ఉండండి. చికాగో విమానం ఎగిరే భాగంలోనికి సరి అయిన టైమ్‌లో చేరకపోతే అప్పుడప్పుడు విమానాలు గంట గంటన్నర ఆకాశంలో తిరుగుతూనే ఉంటాయి. ఇది నాకేమీ కొత్తకాదు. అని "మిస్, కెన్ ఐ హేవ్ ఎనదర్ రౌండ్ ఆఫ్ విస్కీ? " అంటూ ఎయిర్‌హోస్టెస్‌ని అర్థించాడు. అరక్షణం తటపటాయించి "త్వరలో దిగిపోతాం, అయినా చూస్తాను" అంటూ వడివడిగా నడిచి వచ్చి డ్రింక్ అందిచ్చింది ఎయిర్‌హోస్టెస్. ఐదు డాలర్ల నోటు ఇచ్చి "థాంక్స్" అన్నాడు కంప్యూటర్ మనిషి.

"నా పేరు రాఘవ, ఇండియానుంచి వచ్చిన విజిటర్‌ని. మీరు చికాగోలో ఉంటారా? " అనడిగాడు.

"నా పేరు టిమ్ రాజర్స్. చికాగోలో ఉంటాను. అరమైమైళ్ల దూరం నా ఇల్లు చికాగో ఎయిర్‌పోర్ట్‌కి. మిమ్మల్ని చూడగానే మీరు ఇండియన్ అని తెలిసింది" అన్నాడు టిమ్.

"అదెలా? "

"మా ఆఫీసులో చాలామంది ఇండియన్లు పనిచేస్తుంటారు"

రాఘవ తను ఎలక్ట్రికల్ ఇంజనీర్‌నని, గతంలో ఒక సంవత్సరం అమెరికాలో పని చేశానని చెబితే, తను కంప్యూటర్ స్పెషలిస్ట్ నని చెప్పాడు టిమ్. ఇద్దరిమధ్యా సంభాషణ మొదలైంది.

"మినియా పోలీస్ ఎయిర్‌పోర్ట్ చాలా అద్భుతంగా కట్టారు. ఇండియాలో అన్నింటికన్నా పెద్ద ఎయిర్‌పోర్ట్ బొంబాయిలో ఉంది. కాని అంత బాగుండదు" అన్నాడు రాఘవ.

"ఈమధ్యన కట్టిన డెట్రాయిడ్, డెన్వెర్ ఎయిర్‌పోర్ట్‌లు కూడా బాగా ప్లాన్ చేసి కట్టారు"

"అమెరికాలో ప్రజలు వేలకి వేలమైళ్లు ఇట్టే ప్రయాణం చేసేస్తారు" అన్నాడు రాఘవ.

"చేయక ఏం చేస్తారు? ఉద్యోగంకోసం తప్పదు కదా? నేను నివశించేది చికాగోలో, పని చేయడం మినియాపోలీస్‌లో, సోమవారం ఉదయం పనికి మినియాపోలీస్ వచ్చి శుక్రవారం సాయంకాలం చికాగో చేరుతాను. నాలాగే చాలామంది ఎక్కడెక్కడినుంచో వచ్చి మా కంపెనీకి పనిచేస్తారు. కాంట్రాక్ట్ పద్ధతిమీద" అన్నాడు టిమ్.

"అబ్బ! ఇలా ప్రతీవారం తిరగడం, కుటుంబానికి దూరంగా ఉండడం చాలా శ్రమ" అన్నాడు రాఘవ.

"ఏం చేయను? ఇంకేమీ మార్గంలేదు. చికాగోలో ఉద్యోగాలు చాలా పోయాయి. ఉన్న వాటిలో మీ దేశంనుంచి వచ్చిన వాళ్లని తక్కువ జీతం ఇచ్చి తీసుకుంటున్నారు. నేను ఇదే కంపెనీలో ఐదేళ్లు పని చేసి, మార్కెట్ బాగున్న రోజులలో ఉద్యోగం వదిలి, ఇండిపెండెంట్ కన్సల్టెంట్ అయి అదే కంపెనీకి పనిచేసేవాడిని. రోజులు మారాయి. ఇప్పుడు ఆ కంపెనీ,

గతంలో నాకు గంటకి ఇచ్చిన వేతనంలో కేవలం నలభైశాతం ఇస్తోంది. నేను పనిచేయనంటే మీదేశంనుంచి వచ్చి హెచ్ వీసా మీద ఉన్న వ్యక్తులు అంతకన్నా తక్కువ వేతనానికి పనిచేయడానికి సిద్ధంగా ఉన్నారు. పై దేశంనుంచి అంతమంది సాంకేతిక పనివాళ్లని ఈ దేశం తీసుకురావడం చాలా తప్పు. మేమందరమూ చాలా నష్టపోయాం. ఇది చాలా దారుణం. ఈ ఉద్యోగంపోతే, నేను నా కుటుంబసభ్యులు వీధిన పడతాం. చూసిచూసి ఆ ఫెనిగన్‌లా ఆత్మహత్య చేసుకోవాల్సి వస్తుంది" అన్నాడు టిమ్.

"ఏమైందేమిటి? పేపర్లో చదివానుకాని వివరాలు జ్ఞాపకానికి లేవు"

"అతను ఒక పెద్ద కంపెనీకి పనిచేశాడు. అతని పని, మీదేశంనుంచి వచ్చిన సైంటిస్ట్‌లకి తర్ఫీదు ఇవ్వడం. తను ఆ తర్ఫీదు ఇచ్చాక, అతనిని ఉద్యోగంలోంచి తీసేశారు. అతను బాధ భరించలేక ఆత్మహత్య చేసుకున్నాడు" అన్నాడు టిమ్.

వాదనలోనికి దిగుదామా? వద్దా? అని తటపటాయిస్తుంటే, మానస తనని పిరికివాడన్న మాటలు గుర్తుకువచ్చాయి. ఈ మారు ఊరుకోకూడదు అనుకుని.

"దానిలో తర్ఫీదు పొందిన ఇండియన్ల తప్పేమిటి? తప్పంతా ఆ కంపెనీది. ఇండియానుంచి వచ్చిన ఇంజనీర్లు ఒళ్లు వంచి పనిచేస్తారు. కొంచెం తక్కువ జీతం ఇచ్చినా పట్టించుకోరు. తక్కువ ఖర్చుతో పని అవచేయడంతో కంపెనీకి లాభం ఎక్కువ మిగులుతోంది. స్టాక్ హోల్డర్స్‌కి డివిడెండ్లు ఎక్కువవుతాయి. 'మా దగ్గర పని ఉంది. మాకు మనుష్యులు కావాలి అంటూ ఎకానమీ బాగున్నప్పుడు కంపెనీలు వాళ్లని దిగుమతి చేశారు. అప్పుడు ఎవ్వరూ పట్టించుకోలేదు. కాని ఎకానమీ దెబ్బతిని ఉద్యోగాలు పోవడం మొదలయేసరికి, మార్కెట్‌లో పనులకి కాంపిటీషన్ పెరిగింది. పై దేశంనుంచి వచ్చి పనిచేస్తున్న వాళ్లు తమ ఉద్యోగాలు తీసేసుకుంటున్నారని ఇప్పుడు వాపోతున్నారు. ఒక వ్యక్తి ఉద్యోగం పోయి ఆత్మహత్యచేసుకుంటే పెద్దపెద్ద తాటికాయంత అక్షరాలతో పేపర్లలో అచ్చువేయించి, ఇండియన్లు విలన్స్ అన్నట్లు రాస్తున్నారు. కోకోకోలా కంపెనీలు మా దేశం వచ్చి ఇతర కంపెనీలని దివాలా తీయించినపుడు మా దేశంలో ఉద్యోగాలు పోలేదా? మా దేశంలో వందల మంది జీవనభృతి కోల్పోతే ఆత్మహత్య చేసుకున్నారు, వాళ్ల సంగతేమిటి? " అనడిగాడు రాఘవ మెల్లిగా పదాలని బైటకి వదులుతూ.

"దానికి దీనికీ ఏమిటి సంబంధం? "

"పై దేశంనుంచి వచ్చిన కంపెనీలవలన ప్రాంతీయ కంపెనీలు మూతలుపడినా ప్రభుత్వం అడ్డు పెట్టలేదు, ఆంక్షలు విధించలేదు"

"గ్లోబలైజేషన్‌లో అంతే. కంపెనీలు ఎక్కడ పడితే అక్కడ స్థాపించవచ్చు. ఈ దేశం మంచి సరుకులని తయారుచేసి ప్రపంచం అంతా అమ్మి ప్రజలకి ఉపయోగపడుతోంది. బలహీన కంపెనీలు ప్రపంచ కాంపిటీషన్‌కి తట్టుకోలేకపోతే నశించిపోతారు" అన్నాడు టిమ్.

"మీరన్నమాట నిజమైతే, అదే ఇప్పుడు అమెరికాలో జరుగుతోంది. కాంపిటీషన్. ఇండియానుంచి వచ్చిన ఇంజనీర్లు, సాఫ్ట్‌వేర్ రాసే వాళ్లు తమ మెదడుని మార్కెట్‌లో పెట్టి నెగ్గుకొస్తున్నారు. ఇదొక రకమైన ప్రోజెక్ట్" అన్నాడు రాఘవ.

"నాకు ఒప్పుకోవాలని లేదు, కాని నువ్వు చెప్పిన దాంట్లో కొంత నిజం ఉంది. నైస్ టాకింగ్ టుయు విష్‌యు బెస్ట్‌ఆఫ్‌లక్" అన్నాడు టిమ్.

"మీరు నే అన్నదానిని తప్పుగా అర్థంచేసుకోలేదనుకుంటాను" అన్నాడు రాఘవ.

"నాటెటాల్. దిస్ ఈజ్ ఎ సివిలైజ్డ్






కంట్రీ. విభిన్న ఊహలు, భావాలు, మతాలు ఉన్నవాళ్లు సఖ్యంగా కలిసి బతకగలరని నమ్మిన దేశం ఇది. అమెరికన్ రాజ్యాంగం రాసేటప్పుడు పెద్దలు అందరూ వీటిగురించి ఆలోచించే ఉంటారు" అంటూ సీట్‌లోంచి లేచి విమానంలోంచి బైటకి నడిచాడు టిమ్, అతనిని అనుసరించాడు రాఘవ.

★ ★ ★

'నీ సామాన్లని తీసుకుని బైట నిలబడితే కారులో వచ్చి నిన్ను తీసుకెళ్తాను. కారు పార్క్‌చేసి రావడానికి అనవసరంగా కాలం వృధా అవుతుంది' అంది మానస ముందర రోజు టెలిఫోన్‌లో.

కస్టమ్స్, ఇమ్మిగ్రేషన్ గొడవ లేకపోవ డంతో విమానం కిందకి దిగిన పదిహేను నిమిషాలకే సామాన్లతో ఎయిర్‌పోర్ట్‌లోంచి

బైటపడి, కాలిబాట దగ్గర నిలుచుని మానస కోసం ఎదురుచూడసాగాడు. ఏ టొయోటా క్రేమీ కారులాంటిది కనిపించినా మానస దానిలో ఉందేమోనని పరీక్షగా చూసిచూసి కళ్లు నొప్పులు పుట్టాయి. కాని మానస జాడలేదు.

చీకటిపడబోతున్న సమయం, మిచిగన్ లేక్ మీదనుంచి వస్తున్న చల్లనిగాలి విజృంభణ ఎక్కువచేసింది. 'ఎండాకాలం ఇంకా పూర్తిగా పోలేదు, చలి ఉండద'ని అనుకున్న రాఘవని చలి చుట్టుముట్టి ఇబ్బంది కలిగిస్తోంది. కోటుకున్న రెండు బొత్తాములుని పెట్టుకుని చలిగాలిని శరీరానికి దూరంగా ఉంచడానికి ప్రయత్నిస్తుంటే, చిన్నప్పటి 'చలిగాడు' కథ జ్ఞాపకానికి వచ్చింది. అది ఎప్పటి మాట! కసరత్ చేస్తున్న వానిమీద చలి ప్రభావం తక్కువగా ఉంటుందన్నది జ్ఞాపకానికి రాగా, పచార్లు చేయడం ఆరంభించాడు. టిమ్ కూతురు కాబోలు కారులో వచ్చి టిమ్‌ని ఎక్కించుకుని వెళ్తుంటే టిమ్ చేయి ఊపాడు. తిరిగి రాఘవ చేయి ఊపాడు. టిమ్ తను చెప్పినదంతా విని,

"నువ్వు చెప్పినదాంట్లో నిజం లేకపోలేదు' ' అన్నాడు. 'ఎవరివాదన వాళ్లకి పకడ్బందీగా కనిపించడంలో ఆశ్చర్యంలేదు. తన వాదనలో టిమ్‌కి లోపం కనిపించిందా? పత్తి పండించడానికి బేంక్‌ల దగ్గర అప్పు పట్టుకువచ్చి, పత్తి పండకపోవడంవలనో, పండిన పత్తికి సరిఅయిన ధర మార్కెట్‌లో రాక నష్టపోయి, బాంక్ అప్పు తీర్చలేక ఆత్మహత్య చేసుకున్న వ్యక్తికి, పై దేశంనుంచి వచ్చిన ఇంజనీర్లని తర్ఫీదు చేశాక, వాళ్లే తన ఉద్యోగం పోవడానికి కారణమైతే ఆత్మహత్య చేసుకున్న వ్యక్తి ఒక్కలాంటివారేనా? అమెరికా పత్తి విత్తనాలని మార్కెట్‌లోనికి గుమ్మరించి, వాటిని వాడేలా చేసి తరువాత ఇంకోరకం విత్తనాలని వాడకుండా చేసి నాశనానికి దారితీసింది అన్న వాదన ఉన్నా, దానికీ దీనికీ ఏమీ సాపత్యం లేదు. బలం ఉన్న వానిదే బతుకు అంటూ సాఫ్ట్‌డ్రింక్‌లని ప్రవేశపెట్టి, చవుకగా అమ్మి, ప్రత్యర్థులని పడకొట్టి, కంపెనీలు మూతపడగా ఉద్యోగాలు పోయినదానికి, టిమ్ ఉద్యోగం పోగొట్టుకోవడానికి కారణాలు చాలా మట్టుకు ఒకేలా ఉన్నాయి. అమెరికన్లు ఏదేశానికి వెళ్ళి అయినా వ్యాపారం చేసుకోనివ్వాలి అని ఎలుగెత్తి ఆర్భాటం చేస్తే, అలాగే ఇతర దేశాలు అమెరికాలో వ్యాపారం చేసుకోవడానికి ఆంక్షలుపెడితే ఎలా? ' అనుకుంటుంటే కారు హారన్ వినిపించింది. కారువేపు చూస్తే మానస.

"డిక్కీ తెరిచాను, సామాన్లు వెనకాతల పెట్టు" అంది.

సామాన్లని లోపలికి సర్ది, పేసింజర్ సీట్‌లో కూర్చుని, సీట్ బెల్ట్ పెట్టుకుంటూ, "ఎలా ఉన్నావు మానసా? " అనడిగాడు రాఘవ.

"నేను బాగానే ఉన్నాను. కాబోలు" అంటూ అటూఇటూ చూసి కారు వేగం పెంచింది.

"క్రేమీ కారు కోసం వెతుకుతున్నాను, కొత్తకారులో వచ్చావే? " అన్నాడు రాఘవ కారుని పరిశీలనగా చూస్తూ.

"ఇది ఒక కోలీగ్‌కి చెందిన కారు, చవుకగా వస్తే కొన్నాను. నువ్వు ఎలా ఉన్నావు? ఆలస్యానికి సారీ, ట్రాఫిక్‌లో ఇరుక్కుపోయాను" అని తిరుగు ప్రశ్న వేసింది మానస.

"బాగానే ఉన్నాను" అంటూ మానసవేపు చూశాడు.

నుదుటన ముడతలు, నెరుస్తున్న జుత్తు, లోతుకుపోయిన కళ్లు, కంటికింద చారికలు విస్తరించి ఉన్నాయి. మానసలో చాలా మార్పు కనిపించింది రాఘవకి.

"చాలా మార్పు కనిపిస్తోంది కదూ? అవును, గత ఐదేళ్లలో ఈ మార్పు ఎక్కువయింది" అని "నీలో అట్టే మార్పులేదు.





ఐదారు పౌన్లు బరువు పెరిగేవేమో" అంది మానస.

"సంతోష్ ఎలా ఉన్నాడు? "

"ఇంటికి వెళ్ళాక మాటలాడదాం" అంటూ కారువేగం డెబ్బయి ఐదుమైళ్లకి పెంచి గబగబా రెండు లేన్‌లు మార్చింది.

మానస! ఏమైంది మానసకి? చిరుచీకటిలో చిందరవందరగా ఉన్న చిన్నచిన్న ముంగురులు కదలలేక కదులుతున్నాయి. పాలబుగ్గలలాగ నున్నగా ఉండే బుగ్గలు, చిక్కిశల్యమవడంతో ఎత్తైన చెక్కిళ్లు, చాలా బైటకి తన్నుకువచ్చినట్లున్నాయి. ఎర్రని పెదిమలు పోషణలేక, నలుపురంగు దరిదాపులలోనికి చేరాయి. ఇదివరలో పావురం మెడలా మృదువుగా అత్యంత నునుపుగా కనిపించే కంఠం ఇలా, కాకరకాయకి ఉన్న గరుకు తొక్కలా, చర్మంమీద ముడుతలేమిటి?

ఈమె మానస కాదు, ఇంకెవరో! దైన్యం మూర్తీభవించిన ఈ వ్యక్తికి, తను మన సంతా ఆరాధించే వ్యక్తికీ పోలికేలేదు. అనుకుంటుంటే బైట వాన మొదలైంది. సన్నని వెలుతురుని సాంతం మింగి, బలంగా నీటి చినుకులని భూమిమీదకి విసిరి కొడుతోంది మేఘం.

"షిట్!" అంటూ వాననీటిని తుడవడానికి వైపర్‌లని ఆన్‌చేసింది మానస. వాటితో పాటు కారు లైట్లు వెలిగాయి.

"వైపర్స్ ఆన్‌చేయగానే ఈ కారుకి లైట్లు ఆటోమెటిక్‌గా వెలుగుతాయి. టెక్నాలజీ... అదే మన జీవితాలని మార్చింది, ధ్వంసం చేసింది" అంది మానస జీర కంఠంతో.

మానస కంఠంలో జీర, మాటల్లో ఆవేదన! ఏమైందో మానసకి? అని గింజుకుంటుంటే హైవే వదిలి మామూలు రోడ్డంబట రెండు నిమిషాలు ప్రయాణం చేశాక, ఒక ఇంటి దగ్గర కారు ఆపింది.

"తొందరగా వచ్చేశాం కదూ? దానికి రెండు కారణాలు ఒకటి కారు వేగంగా నడపడం, రెండు ఇల్లు దగ్గరయింది" అంటూ కొత్త ఇంటిలోనికి ప్రవేశించి లైట్లని వెలిగించింది మానస. ఒకసారి పాదరసం లాంటి వెలుతురు చిమ్ముకుంటూ మానస మొహం మీద పడగానే పాలిపోయి ఉన్న మానస మొహం ఇంకా పాలిపోయింది.

"నన్ను అంత పరీక్షగా చూడకు, ఇబ్బందిగా ఉంది" అంది మానస. మాటలాడకుండా రాఘవ కొత్త ఇంటిని గమనించసాగాడు. మనిషిలో శారీరకంగా మార్పు కనిపిస్తున్నా, యధాప్రకారం ఇల్లు అంతా సమర్థవంతంగా అమర్చింది మానస. వివిధ రకాల వస్తువులు షోకేస్‌లో విన్యాసాలు ఒలకపోస్తున్నాయి. ఉన్నట్టుండి మానస బైటకి పరిగెత్తింది. ఏమైందా? అని ఆశ్చర్యం నుంచి తేరుకునేలోగా తడిసి లోపలికి వచ్చిన మానస.

"వాన నీరు పోవడానికి గట్టర్స్ వాడతాం కదా? అవి పూడుకుపోతే బేస్‌మెంట్‌లోనికి నీళ్లు వెళ్ళిపోతాయి. ఒకసారి అలా జరిగిందిలే. అవి చూడడానికి అర్జంట్‌గా పరిగెత్తాను" అంది మానస ఒగరుస్తూ.

తడిసిన దుస్తులలో మానస శరీరాకృతి, ఒగర్చడం వలన తన్నుకువస్తున్న ఉపరి భాగం చూడగానే రాఘవలో అలజడి, వెన్వెంటనే కంగారు మొదలయ్యాయి.

"జ్ఞాపకం ఉందా అరకులోయలో వాన. అప్పుడూ ఇలాగే పూర్తిగా తడిసిపోయావు. జలుబు, మర్నాడు జ్వరం వచ్చాయి నీకు. త్వరగా బట్టలు మార్చు లేకపోతే ఏ న్యూమోనియానో పట్టుకుంటుంది" అన్నాడు రాఘవ.

జాగ్రత్తగా అడుగులు వేసుకుంటూ బాత్‌రూమ్‌లోనికి వెళ్ళింది మానస.

★ ★ ★

"సంతోష్ పనిమీద ఊరువెళ్లారా? ఇంటిలో ఏమీ అలికిడిలేదే? " అనడిగాడు రాఘవ నైట్‌డ్రెస్ వేసుకుని వచ్చిన మాన

సతో. మానసలో వచ్చిన మార్పుకి అలవా టుపడ్డాడో, లేక స్నానం చేయడంవలన స్వచ్ఛత పెరిగిందో, లేక మానసలో నిజంగా ధైర్యం పెరిగిందో కాని మానస తేరుకున్నట్లు కనిపించింది. కంటికింద చారి కలు వగైరా అలాగే ఉన్నాయి. కాని మొహంలో దైన్యం బాగా తగ్గింది.

"ఉన్నారు. కాని మేడమీద నిద్రపోతు న్నారు" అంది మానస రహస్యం చెబుతు న్నట్లు.

"అప్పుడే నిద్రపోతున్నారా? " అన్నాడు రాఘవ ఆశ్చర్యంగా.

"నువ్వు ఇంకా ఐదు రోజులు ఉంటావు కాబట్టి మెల్లిగా అన్నీ నీకు చెబుతాను. ఓపి కపట్టు. డిన్నర్‌కి ఏం తిందాం? ఈమధ్య వంటమీద శ్రద్ధ తగ్గింది. ఏదో తినేస్తు న్నాను. నేను చేసినది నీకు నచ్చుతుందో, లేదో! ప్రెషర్‌కుక్కర్‌లో బంగాళాదుంపలు, అన్నం పడేసి వస్తాను. ఆవకాయతో ఈవేళకి కానిచ్చేద్దాం.

"ఐయామ్ సారీ, నిన్ను ఇక్కడకి రప్పించి, నీకు సరిఅయిన తిండి అమర్చనం దుకు మరేమీ అనుకోకు" అంటూ లేచింది మానస.

మళ్లీ మానసలో దైన్యం బైటపడింది. కంటిలో నీరు తిరిగి కరిగిపోయింది. గొంతుక బొంగురయింది అనుకున్నాడు, ఏమైంది మానసకి? ఎందుకు ఇలా క్షోభప డుతోంది?

"భలేదానివే, నువ్వు చేసిన వంట నాకు నచ్చకపోవడమేమిటి? " అని రాఘవ, రిమోట్ కంట్రోల్ తీసి, టెలివిజన్‌లో ఏఏ కార్యక్రమాలు వస్తున్నాయో చూస్తున్నాడు. ఇదివరలో ఏ ముఖ్యమైన టెలివిజన్ ఛానల్ చూసినా ఇజ్రాయిల్, పాలస్తీనాల మధ్య రావణకాష్టంలా తగలపడుతున్న తగువు. ఒక ఇజ్రాయిల్ పౌరుడు పాలస్తీ నీయుల ఆత్మాహుతి దళంవలన చనిపోతే, దానికి పదిరెట్లు పాలస్తీనీయులని టాంక్‌లతో వెళ్లి, వాళ్ల ఇళ్లను చదునుచే యడం కనిపించేది. కాని దాని స్థానంలో ఎక్కడ చూసినా ఇరాక్ యుద్ధం గురించి వార్తలే! అమెరికా ఎంత సునిశితమైన మిసై ల్స్‌ని ప్రయోగించి శత్రువులని, శత్రువులస్థా వరాలని నాశనం చేసిందో వివరిస్తున్నారు. ఒక్క రాత్రిలో ఇరాక్ ప్రభుత్వ భవనాలని ఎలా కూలదోశారో వివరించే వార్తలు తెగ ముమ్మరంగా వస్తున్నాయి. రిటైరయిన జన రల్స్‌ని ఇంటర్వ్యూ చేసి వాళ్ళ అభిప్రా యాలు ప్రసారం చేస్తున్నారు. యుద్ధం నుంచి నౌకలలో తిరిగి వచ్చిన సైనికులు తమ తల్లితండ్రులని, భార్యలని, ప్రియురా ళ్లని, పిల్లలని ఆరునెలల తరువాత కలిసిన పుడు జనించే ఆవేశంలో గాఢంగా ముద్దుపె ట్టుకుంటున్నారు. దేశం యావత్తూ విజ యంతో, ఆనందంతో మత్తుగా ఊగుతోంది. వార్తలు అన్నీ విజయానికి పరిమితమై ఉన్నాయి. యుద్ధంలో చనిపోయిన సంఖ్య గురించి కాని క్షతగాత్రుల గురించి కాని ప్రత్యేకంగా ప్రస్తావించడంలేదు. మిగతా ప్రపంచం యుద్ధం గురించి ఏమనుకుం టుందో అన్నది కనిపించలేదు రాఘవకి.

"మరో పదినిమిషాలలో భోజనం తయా రవుతుంది" అంటూ మానస వంట గది లోంచి తిరిగి వచ్చింది.

"నా శరీరం ఇంకా కాలిఫోర్నియా కాలంలో ఉంది. ఇంకో రెండుగంటలకి కాని అది తిండి కావాలని అడగదు. ఇండి యాలో వచ్చిన సి.ఎన్.ఎన్, బి.బి.సి.ల వార్తలే ఇక్కడ వస్తున్నాయి. ఇంకే వైవిధ్యం ఉన్న వార్తలు రావడంలేదు. 'యుద్ధం అన్యాయం' అంటూ ప్రజలు అరుస్తున్నా రుట. అలాంటిదేమీ చూపించడంలేదే" అన్నాడు రాఘవ.

"ఏనుగు వెళ్తుంటే కుక్కలు అరుస్తాయి, ఏనుగు పట్టించుకుంటుందా? యుద్ధం వార్తలు విని విసుగేసింది, రిమోట్ నాకు





ఇయ్యి" అంటూ రిమోట్ తీసుకుంది మానస.

'మానస వ్యంగ్యంగా మాట్లాడిందా? లేక తను అలా అనుకుంటున్నాడా?' అని ఆశ్చ ర్యపడ్డాడు రాఘవ.

రిమోట్‌ని వాడి ప్రసారమవుతున్న సిని మాల గురించి వెతుకుతూ ఒకచోట ఆగి,

"ఓహో, ఈ సినిమా కాస్సేపు చూద్దాం" అంటూ ఒకటి ఎన్నుకుంది. ఎడ్వర్టైయిజ్ మెంట్స్ వచ్చినపుడు కిచెన్‌లోనికి వెళ్ళి పని చేస్తూ, తిరిగి వచ్చి సినిమా చూసింది మానస. సినిమా ముగియగానే "డిన్నర్ తినేద్దాం. ఎలా ఉంది 'ఫాలింగ్ ఇన్ లవ్' సినిమా" అనడిగింది.

"బాగుంది కాని ఇలాంటి కథలు నిజజీవి తంలో సంభవిస్తాయా? అమెరికాలో సాధ్యమేమో కాని ఇండియాలాంటి దేశా లలో వీలవదు" అన్నాడు రాఘవ.

"ఇంటరెస్టింగ్ కామెంట్. నాకు నువ్వు తెలుసుగా, అదే అంటావని ఊహించాను. కాస్త బంగాళాదుంప వేపుడు వేసుకో. మరీ అంత తక్కువ తింటే నేనూ మానేయాల్సివ స్తుంది" అంటూ రాఘవ ప్లేటులో వేపుడు వడ్డించింది మానస.

"ఈమధ్య నా బరువు పెరుగుతోంది. తిండి తగ్గించకపోతే గేదెలా అయిపోతాను" అన్నాడు రాఘవ.

"నీలో పెద్దమార్పేమీలేదే, మహాఅయితే నాలుగు ఐదుపౌన్లు బరువు పెరిగావేమో. నువ్వు అనవసరంగా కంగారుపడకు. మనం ఎంత జాగ్రత్తపడినా, ఎంత వద్దనుకున్నా, శరీరంలో మధ్యవయస్సు వచ్చేసరికి మెట బాలిజం మారుతుంది. సునాయాసంగా బరువువచ్చేస్తుంది. కాని నీకేం చాకులా ఉన్నావు" అంటూ సంభాషణలోనికి హాస్యాన్ని జొప్పించింది మానస.

రాఘవ సిగ్గుపడడం చూసి చిరునవ్వు నవ్వింది.

మానసని ఈమారు కలిసాక మొట్టమొద టిసారి ఆమె మొహంమీద కనిపించిన చిరు నవ్వది. గతంలో మానస నవ్వుని అది జ్ఞాపకానికి తెచ్చి ఈ నవ్వులో జీవంలేదని తెలియచెప్పింది.

"ఏమైంది మానసకి? " అన్న ప్రశ్న మరో సారి ఉదయించి, ఆవేదనని కలగచేసింది రాఘవకి.

భోజనం అయ్యాక ప్లేట్లని, గిన్నెలని కిచెన్ సింక్‌లో పడేస్తూ "గిన్నెలని కడి గేద్దాం" అన్నాడు రాఘవ.

"నీకెందుకా శ్రమ, ఒక్కసారి నీళ్లలో ముంచి డిష్ వాషర్‌లో పడేస్తాను నువ్వు ఏమీ చేయకుండా కూర్చో" అంది మానస.

"దీనిలో శ్రమేముంది. ఇద్దరమూ కడి గేద్దాం" అన్నాడు రాఘవ.

మానస మొహంలో రంగులు మారడం రాఘవ పసికట్టలేదు. మొదట ఆనందం, తరువాత విచారం ఒకటి తరువాత ఒకటి రావడం చూస్తే ఏమనుకుంటాడోనని తలని వాల్చి, కంటిలో తిరిగిన నీళ్ళని అదుపులో ఉంచుకుంటూ, గిన్నెలని కడగడం ముగించి 'థాంక్స్ ఫర్‌ది హెల్ప్' అంది మానస.

"ఇప్పుడు చెప్పు నీలో ఇంత మార్పుకి కారణం ఏమిటి? నీ ఆరోగ్యం బాగులేదా? నీ తత్వం నాకు అపరిచితం కాదు. అలాంటి నువ్వు నన్ను ప్రత్యేకంగా ఎందుకు రమ్మని అడిగావు? " అంటూ మానసని నిల దీశాడు రాఘవ.

మానస సమాధానమీయకుండా సంశయి స్తోంది. చెబుదామా? వద్దా? అనిపించేలా సందేహిస్తోంది. మానస ఏం చెబు తుందోనని ఎదురుచూస్తున్నాడు రాఘవ.

"ఇప్పుడు రాత్రి పదకొండు గంటలు అవ బోతోంది. రేపు నాతో నిన్ను డిపార్ట్‌మెం ట్‌కి తీసుకెళ్తాను. అక్కడ వివరంగా చెబు తాను. ఇప్పుడు మొదలుపెడితే అది విన్నాక ఒక పట్టాన నీకు నిద్రపట్టదు" అంటూ లేచి రాఘవవేపు చూడకుండా

మేడమెట్లవేపు మెల్లిగా కదిలింది మానస.

రాఘవకి మానస ఇబ్బందుల గురించి వెంటనే వినాలని ఉంది. కాని మానస దానికి ఆస్కారం ఇవ్వకుండా, సంభాషణని తుంచి వెళ్ళిపోతుంటే ఇంకేమీ చేయలేక 'గుడ్‌నైట్' అంటూ మానస తనకి కేటాయించిన గదివేపు నడిచాడు.

బట్టలు మార్చుకుని పక్కమీదకి చేరిన రాఘవకి నిద్రరావడంలేదు. 'ఈమధ్య తరచూ రాత్రుళ్లు నిద్రసరిగ్గా పట్టడంలేదు. కొంపతీసి తనకి పరిధులని మించి బ్లడ్‌ప్రెషర్ ఉందేమో! తన బరువు పెరుగుతోంది. అది ఆరోగ్యానికి మంచిదికాదు. బ్లడ్‌ప్రెషర్ తగ్గాలంటే బరువు తగ్గాలి. అంటే వ్యాయామం చేయాలి' అనుకుంటుంటే ఆలోచనల్ని చెదరకొడుతూ కిటికీ మీద శబ్దంచేస్తూ వానపడడం మొదలయింది.

'మానస గురించి ఆలోచిస్తూ, ఇదేమిటి తన ఆరోగ్యం గురించి ఆలోచనలోపడ్డాడు' అనుకుంటూ ఆలోచనల్ని మానసమీదకి మళ్ళించాడు.

'మానసకి వచ్చే కష్టాలు ఏమై ఉంటాయి? ఉద్యోగ విషయంలో మానసకి కష్టాలు ఉండే అవకాశం ఏమాత్రం లేదు. ఆమె జీవితకాలానికి ఆమెని ఉద్యోగంలోంచి తీసే అధికారం దేశ ప్రెసిడెంట్‌కి కూడా లేదు. మానసని చూస్తే అస్థిపంజరానికి అక్కడా ఇక్కడా చిన్నచిన్న మాంసపుముద్దలు అతికించినట్లు ఉంది. మానస ఆరోగ్యం బాగులేదా? ఆ కంటికింద నల్లని చారికలు మరీ దారుణంగా పెరిగాయి. ఒత్తుగా తుమ్మెద రెక్కలులా ఉన్న ఆ జుత్తు అంతలా పలచపడిపోయిందేమిటి? అప్పుడే జీడికడుతూ నవనవలాడుతూ ఉన్న మామిడికాయకళతో ఆహ్లాదాన్ని కలిగించిన మానస, ఒడలిపోయి సడలిన శరీరంతో ఉందేమిటి? మానస ఏదైనా కేన్సర్ లాంటి మొండివ్యాధికి గురయిందా? కావచ్చు అదికాక పోతే ఇంకేకారణం మనసుని తినేస్తుంది? ఇప్పటివరకు సంతోష్ కనపడలేదు. సంతోష్ నిద్రపోతున్నాడు అంది మానస. సాయంకాలం ఏడున్నర గంటలకే నిద్రేమిటి? సంతోష్ ఆరోగ్యం బాగులేదా? అదే మానస ఆవేదనకి కారణమా? సంతోష్ ఉద్యోగం బాగుండకపోతే, అతనిని వదిలి, తనతో అంతసేపు కబుర్లు చెబుతుందా? సినిమా చూస్తుందా? ఇహ మిగిలింది కాంచన. కాంచన మానసలాగే స్వతంత్ర భావాలు కలది. తల్లి అంటే గౌరవం ఉన్నా, తన ఉద్దేశ్యాలు, ఊహలు తనవి. కాంచన నడవడి సరిగ్గాలేదా? అది మానసని కృంగతీస్తోందా? కాంచన మత్తు పదార్థాల వాడకానికి అలవాటుపడిందేమో! అమెరికాలో హైస్కూల్‌లో, కాలేజీ మొదటి సంవత్సరాలలో, స్వతంత్రం ప్రకటించే ప్రదర్శనలో, ఇలా మత్తుపదార్థాలు సేవిస్తారని ఎవరో అనగా తను విన్నాడు, కొంపతీసి కాంచన? ఛ! కాంచనకి మానస కావలసినంత స్వేచ్ఛ ఇచ్చింది. తిరుగుబాటు చేయవలసిన అవసరం ఏముంది? ఒకవేళ కాంచన అమెరికన్‌ని ఎవరినైనా పెళ్లిచేసుకుందేమో! అది మానసకి అంత బాధ కలిగిస్తుందా? ఏమో, ఎన్ని విధాల ఆలోచించినా, మానస ధోరణికి సరి అయిన సమాధానం దొరకడంలేదు' అనుకుంటూ ఆలోచనల్ని కట్టివేయబోయాడు రాఘవ.

'తన గురించి మానసకి బాగా తెలుసు, అందుకే "నాకు తెలుసు నువ్వు అలా అంటావని" అంది సినిమా చూడడం ముగిశాక. 'మానస గురించి తనకి తెలిసినది తక్కువ' అనుకుంటుంటే సినిమా మళ్ళీ జ్ఞాపకానికి వచ్చింది.

మార్గరెట్, ఫ్రేంక్ క్రిస్టమస్ షాపింగ్ చేస్తూ న్యూయార్క్‌లో ఒక పుస్తకాల దుకాణంలో కలుసుకుంటారు. ఎక్కువ సామాన్లని మోయలేక అవస్థపడుతున్న ఫ్రేంక్‌కి సహాయం చేయడంలో కొన్ని సామాన్లు




తారుమారవుతాయి. ఇళ్లకి వెళ్లాక ఆ మార్పిడి గ్రహించి నవ్వుకుంటారు ఎవరికి వారు. మార్గరెట్ అప్పుడప్పుడు న్యూయార్క్ పిల్లల పుస్తకాల ప్రచురణ సందర్భంలో ట్రెయిన్‌లో వెళ్ళి వస్తూ ఉంటుంది. ఫ్రేంక్ పెద్ద భవనాలు కట్టే కంపెనీలో ఆర్కిటెక్. కారు పాడైతే పట్టణానికి రైలులో ప్రయాణంచేస్తూ మార్గరెట్‌ని రెండవసారి చూస్తాడు. ఒకర్ని ఒకరు పలకరించుకుని విడిపోతారు, కాని సాయం కాలం అదే రైలులో ఒకరికొకరు ఎదురుపడడంతో పరిచయం చేసుకుంటారు. ప్రతీ రోజూ తను రైలులో ప్రయాణం చేయనని శుక్రవారం మాత్రం న్యూయార్క్ పట్టణానికి, అస్వస్థతగా ఉన్న తండ్రిని చూడడానికి వెళ్తానని చెబుతుంది మార్గరెట్. చాలా సంవత్సరాలుగా పరిచయం ఉన్న స్నేహితులలా గలగలా స్వంత విషయాలు చర్చించుకుంటారు. తన భర్త ఒక డాక్టర్ అని పురిట్లోనే ఒక బిడ్డ చనిపోయిందని మార్గరెట్ చెబితే, ఇద్దరు కొడుకులు తనకని ఫ్రేంక్ చెబుతాడు. ఇద్దరిమధ్యా స్నేహం చిలవలు పలవలు వేస్తుంది. ఒకరంటే ఇంకొకరికి ప్రేమ అని గ్రహిస్తారు.

తనకి భర్త ఉన్నాడని, ఇలా కలుసుకోవడం సాంప్రదాయవిరుద్ధమని, తను ఇక ఫ్రేంక్‌ని కలవలేనని చెబుతుంది మార్గరెట్ బాధపడుతూ. ఖిన్నుడవుతాడు ఫ్రేంక్.

మార్గరెట్ తండ్రి చనిపోవడంతో న్యూయార్క్ వెళ్లడం ఆగిపోతుంది. ఫ్రేంక్ ప్రతీరోజూ ఆమె గురించి రైలులో వెతుకుతూ ఉంటాడు. ఆమె కనిపించక మూడీగా విచారంలో మునిగిపోతాడు. తండ్రి చనిపోతే తను విచారంలో కూరుకుపోయిందని భ్రమ పడుతున్న స్నేహితురాలితో, "అలాంటిదేమీ కాదు. నేను శుభ్రంగా ఉన్నాను. అయితే రాత్రి పడుకోబోయే ముందు ఆఖరి ఆలోచన, ఉదయం లేవగానే మొదటి ఆలోచన ఫ్రేంక్ గురించే. ప్రతి క్షణమూ అతని ఆలోచనే. ఇది సాంప్రదాయవిరుద్ధమని, నువ్వు ఒప్పుకోవని నాకు తెలుసు. ఐనప్పటికీ అది నిజం" అంటుంది మార్గరెట్. ఫ్రేంక్ పరిస్థితి ఇంచుమించు ఇలాగే ఉన్నపుడు భార్యతో "రైలులో ఒక స్త్రీని కలిశాను. ఏమీ జరగలేదు. అది గతం" అని చెబుతాడు. భార్యకి కోపం వచ్చి పిల్లలని తీసుకుని తల్లి దగ్గరకి వెళ్ళిపోతుంది. హోస్టన్ పట్టణంలో ఉద్యోగంకి వెళ్ళమని కంపెనీ ఆదేశిస్తే, ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళిపోబోతూ, "ఒక్కసారి నిన్ను చూడాలని ఉంది. ఒక్క నిమిషం రాగలవా? నేను ఊరు వెళ్ళిపోతున్నాను" అని ఫ్రేంక్ ఫోన్‌చేస్తాడు మార్గరెట్‌కి. ముందర రాలేనని చెప్పినా, భర్త వారిస్తున్నా వినకుండా ఫ్రేంక్‌ని చూడడానికి ప్రయత్నించి విఫలురాలు అవుతుంది. రోజులు గడిచి మళ్ళీ సంవత్సరం క్రిస్టమస్ కాలానికి ఫ్రేంక్ ఇల్లు అమ్మడానికి న్యూయార్క్‌కి వచ్చి సంవత్సరం క్రితం మార్గరెట్‌ని కలిసిన దుకాణంలో తిరిగి ఆమెని చూస్తాడు. మార్గరెట్ తను కలవలేకపోవడానికి కారణం చెప్పబోతుంది. తను విడాకులు తీసుకున్నానని చెబుతాడు. తనూ భర్త నుంచి విడిపోయానని ముందర చెప్పకపోయినా, ఒకరంటే ఒకరికి ప్రేమ సడలలేదని తెలిశాక, కథ సుఖాంతం అవుతుంది.

'అమెరికాలాంటి దేశాలలో ఇవి సాధ్యమవుతాయేమో! ఒక స్త్రీ పురుషుడు కలిసే అవకాశంలేని దేశంలో ఇలాంటి ప్రేమకథ సాధ్యమా? వీలవదని తను అంటే "నువ్వు అలా అంటావని" నాకు తెలుసు అంది మానస. అంటే మానస ఉద్దేశ్యం వేరనుకోవాలా? లేక ప్రేమించడానికి, సాంప్రదాయానికి తేడా ఉందని చెబుతోందా? ఒక వ్యక్తితో కాపురం చేస్తూ ఇంకొకర్ని ప్రేమించడం జరుగుతుందా? ప్రేమ కేవలం శారీ

రకమేనా? ఏమిటో, తనకేమీ అర్థమవడం లేదు' అనుకుంటూ చేతి సంచీలోంచి కాంపోజ్ మాత్ర వేసుకుని నిద్రలోనికి ఒరగబోయాడు రాఘవ. గుండెల్లో సన్నని మంట! కాస్సేపు ఉండి తగ్గింది. కాస్సేపయాక మళ్ళీ మంట పెరిగింది, రాత్రంతా గుండెలో మంట చల్లారలేదు. పూర్తిగా నిద్రలోనికి ఒరిగేముందు "మానస ఎందుకు అంత బాధ పడుతోంది" అన్నదే ఆఖరి ఆలోచన.

రాఘవని వదిలి వచ్చి పరుపుమీదకి చేరిన రెండు నిమిషాలలో నిద్రలోనికి జారింది మానస. అలసిన మెదడు, అలసిన శరీరం జతకలిసి, మానసని నిద్రపుచ్చినా, రెండు గంటలు గడిచాక బైట ఫైరింజన్లు పరిగెడుతూ చేసిన హోరు వలన మానసకి తెలివి వచ్చింది. ఒకసారి నిద్రలోనికి ఒరిగితే మళ్ళీ ఉదయమే తెలివివచ్చే అలవాటున్న మానసకి ఆ అలవాటు తప్పి ఒక సంవత్సరమైంది. ఏమాత్రం శబ్దమైనా తెలివి వచ్చేస్తుంది. పక్కన సంతోష్ సన్నగా గురకపెడుతూ గాఢ నిద్రలో ఉన్నాడు. తెలివి తెప్పించిన ఫైర్ ఇంజన్లు వెళ్ళిపోయినా, మళ్లీ నిశ్శబ్దం అలుముకున్నా, మానసకి నిద్రరావడంలేదు. చాలా రోజుల తరువాత కడుపు బరువెక్కేలా తిన్నా, అది నిద్రని తెప్పించడం లేదు. ఆవలింతలు వస్తున్నాయి, కాని నిద్రకి దూరంగా ఉంది. 'జెట్‌లాగ్ అంటూ ఎప్పుడూ గోలపెట్టే రాఘవ నిద్రపోతున్నాడా? ఇందాక పరిగెత్తుకుంటూ వెళ్ళిన ఫైర్ ఇంజన్లు అతనినీ లేపిఉంటాయా? అతను లేచి ఉంటే అతనిని మాటల్లో దింపితే కాస్సేపయాక తిరిగి నిద్రవస్తుందేమో' అనుకుంటూ మానస పరుపు మీద నుంచి లేవబోయింది.



'తను లేచి వెళ్ళి రాఘవతో ఇంతరాత్రి వేళ కబుర్లు చెబుతూ కూర్చుంటే, సంతోష్ లేచి చూసి ఏమనుకుంటాడో! అస్సలే పరిస్థితులు బాగాలేవు, అగ్నికి ఆజ్యం పోసినట్టు అవుతుందేమో' అనుకుని ఆ ప్రయత్నాన్ని విరమించి ఆలోచనలో పడింది.

రాఘవ! రాఘవ! రాఘవ! అంటూ అతని గురించి నువ్వు ఆలోచిస్తావు, వ్యర్థప్రయాస అంటూ మెదడు పొడిచినా మానస పట్టించుకోలేదు.

'తనకి ఉన్న ఇబ్బందులన్నీ రాఘవ ఉన్న నాలుగు రోజులలో అతనికి చెప్పి మనసులో ఉన్న భారం తీర్చుకోవాలి. సంతోష్ వలన వచ్చిన చిక్కులు, ఇబ్బందులే కాకుండా ఇతర విషయాలు అతనితో చెప్పుకుంటే తనకి కాస్త రిలీఫ్ వస్తుంది. లేకపోతే పిచ్చెక్కేలా ఉంది. సంతోష్ తనతో ఏమీ చర్చించడు సరికదా అతను చేసే పనులు నేను సమర్థించనని వాటిని మరుగుపరుస్తాడు. కాంచన తనతో అరమరికలు లేకుండా అన్నీ చర్చించేది. కాని కాలేజీకి వెళ్ళిన దగ్గరనుంచి దాని ధోరణి మారింది. తను మరీ ఒంటరిదయింది. ఒంటరితనం ఒంటరిదై తోడు కావాలంటోంది. రాఘవ కాన్ఫరెన్స్‌కి వస్తు

న్నాడని తెలిసి తనలో ఆరాటం ఎక్కువ యింది. రాఘవ ఇక్కడికి వచ్చి నాలుగురోజులుంటే అతనితో తన గోడు వెళ్లబోసుకోవచ్చు రాఘవ అతిగా మాట్లాడని రాఘవ! తను విసుక్కున్నా, కసిరినా ఏమీ చలించకుండా తనతో స్నేహం పాడవకుండా నిలిచిన వ్యక్తి! తెల్లవారాక ఏమాత్రం అవకాశం కలిగినా రాఘవతో అన్ని విషయాలు చెప్పేయాలి, అనుకుని రెండు కాంపోజ్ మాత్రలు వేసుకుంది మానస.

రాఘవకి రాత్రుళ్లు నీళ్లు తాగే అలవాటుంది. తను ఆలోచనలో పడి అది మరచిపోయింది. బాత్రూంలో నీళ్లు తాగి మళ్లీ జబ్బు కొనితెచ్చుకోడుకదా! అనుకుంటూ మధనపడింది మానస నిద్రపోయేటప్పుడు.

'రాఘవతో నీ విషయాలు, ఇబ్బందులు చర్చించి అతనిని అనవసరంగా ఇబ్బందుల పాలు చేస్తావేమో? రాఘవకి తన ఇబ్బందులు ఉంటాయి. వాటికి తోడు నీ సమస్యలనీ అతనికి అంటిస్తావా?' అంటూ మెదడు హెచ్చరించినా మానస పట్టించుకోలేదు. కళ్లు మూతలుపడేముందు "రాఘవ నా మనిషి కాకపోయినా అతనిమీద నాకు చాలా అధికారం ఉంది. అతను అవసరమైతే నా కష్టాలని పంచుకోవడానికి వెనుదీయడు" అని సమాధానపడింది మానస.

★ ★ ★

ఆకాశంలో వెలుతురు బైటపడి లేవగానే కాఫీకి బానిస అయిన రాఘవని "ఏదీ నా కాఫీ?" అంటూ రాఘవ కడుపు రొద మొదలుపెట్టింది. గడియారం ఐదున్నర గంటలు చూపిస్తోంది. పూర్తి వెలుతురు రాలేదు. కాని చీకటి సాయంత్రం వస్తానని వెళ్లిపోయింది. పళ్లు తోముకుని వంటింటిలోకి ప్రవేశించి షెల్ఫ్ తలుపు తెరవబోతుంటే కిర్ మంటూ శబ్దం చేయగా ఆ శబ్దానికి సంతోష్, మానసలు లేస్తారేమోనని అనుమానించి 'ఏం చేయాలా?' అంటూ ఆలోచనలో పడ్డాడు రాఘవ. ముందు రోజు సాయంత్రం ఎయిర్‌పోర్ట్ నుంచి వస్తున్నపుడు మానస ఇంటికి దగ్గరగా రెండు మూడు కాఫీ దుకాణాలు ఉన్నట్లు జ్ఞాపకం వచ్చింది రాఘవకి. అక్కడికి వెళ్తే కాఫీ తాగి రావచ్చని బట్టలు మార్చుకుని మెల్లగా ఇంటినుంచి బైటపడ్డాడు. ఎందుకైనా మంచిదని టెలిఫోన్ నెంబర్ల పుస్తకాన్ని జేబులో ఉంచుకుని నడక మొదలుపెట్టేడు. నడుస్తూ తను మలుపులు తిరుగుతున్న వీధుల పేర్లు మననం చేసుకోనారంభించాడు. రెండు మలుపులు తిరిగేసరికి మొదటి మలుపు పేరు మెదడులోంచి మాయమైంది.

"వెధవ వీధుల పేర్లు సరిగ్గా జ్ఞాపకం ఉండి చావవు" అని విసుక్కుంటూ ముందుకి నడిచాడు. ముందురోజు పడిన వాన వాతావరణాన్ని చల్లపరిచింది. దానికి తోడు రివ్వున వచ్చిన గాలి రాఘవ చెవులని తాకగానే కోటుకి బొత్తాములని పెట్టుకుని చెవులని మూసుకుంటుంటే ఎదురుగా వస్తున్న ఒక స్త్రీ, జానెడులాగు, జానెడు బనియన్ వేసుకుని రాఘవని దాటి పరిగెత్తిపోతూ, "గుడ్‌మార్నింగ్" అంది. గుడ్‌మార్నింగ్ అంటూ గ్రీట్ చేశాడు రాఘవ. తను కోటు వేసుకున్నా చలితో చస్తుంటే తొడల వరకూ ఏమీలేకుండా ఆ కాస్త వక్షోజాలని మాత్రం కట్టి ఉంచిన గుడ్డపీలిక తప్పిస్తే ఏమీ శరీరంమీద లేకుండా పరిగెడుతున్న ఈ అమ్మడికి చలివేయడం లేదా అనుకుంటూ కాఫీ అంగడి కనిపించగానే లోపలికి దూరి అరచేతులని రుద్దుకున్నాడు. కాఫీ అంగడిలో ఎవ్వరూ లేరు. కౌంటర్ వ్యక్తి వెనకాల ఇరవై రకాల కాఫీల పేర్లు, వాటి ధరల పట్టిక ఉంది.

"ఈవేళ నీకు ఎలాంటి సేవ అందించగలను" అనడిగాడు ఏప్రన్ వేసుకుని అత్యంత నీట్‌గా ఉన్న వ్యక్తి.

"హౌస్‌కాఫీ" అన్నాడు రాఘవ.

"షార్ట్, లార్జ్, టాల్ ఏ సైజ్ కావాలి?"

అనడిగాడు కౌంటర్ వ్యక్తి.

"టాల్" అని డాలర్ ఏభై సెంట్లు సమర్పించి కిటికీ దగ్గర కాఫీతో ఆసీనుడయ్యాడు రాఘవ.

'కాఫీ చాలా స్ట్రాంగ్‌గా ఉంది, దానికి తోడు రవ్వంతచేదు. దీని దుంపతెగ' అనుకుంటూ లేచి మరికొంత పంచదార, క్రీమ్ జోడిస్తే చేదు శాంతించింది. శరీరంలోకి ధారాళంగా కెఫీన్ ప్రవేశించగానే వేడి ఉద్భవించి చలి తగ్గింది.

ఇండియాలో చికోరీ కలిపిన కాఫీ పొడితో తయారుచేసే కాఫీకి, ఇక్కడ కొత్తగా పాప్యులర్ అయిన స్టార్‌బక్ కాఫీకి చాలా తేడా ఉంటుంది. కెఫీన్ ఎక్కువే కాకుండా కాస్త ఎసిడిక్‌గా ఉంటుంది అన్న అరోరా మాట జ్ఞాపకానికి వచ్చింది.

మెల్లిగా కాఫీ తాగడం ముగించి బైటకి వచ్చేసరికి సూర్యుడు ఆకాశంమీదకి రావాలని ఉబలాటపడుతున్నాడు. ఆకాశంలో మేఘాలు లేవు కాని ముందు రోజు కురిసిన వాన ప్రభావం వలన కాబోలు చెట్ల మీద పొగమంచు పేరుకుని ఉంది. వాటి లోంచి సూర్యకిరణాలు మందంగా వస్తున్నాయి. వాన దట్టంగా కురవడంవలన చెట్ల కొమ్మలు బరువుగా వేలాడుతుంటే వాటి చివర్న ఉన్న పూలు భూమివేపు చూస్తున్నాయి. రోడ్లకి ఇరువైపులా దాదాపు ఒకేరకమైన ఇళ్లు, ఇళ్ల వెనకాల పచ్చనిచెట్లు, ఇంకా దూరంగా కనీకనిపించకుండా చెరువు, జనసంచారం ఎక్కువయింది. కార్ల శబ్దం పెరిగింది. బద్ధకంగా కుక్కల్ని బైటకి నడిపిస్తున్నవారు, వ్యాయమం కోసం జాగింగ్‌కి నడకకి వెళ్లే వ్యక్తులు తమతమ ధోరణిలో ఉన్నారు. ఎదురుపడిన పదిపన్నెండుగురు వ్యక్తులలో ఇద్దరు మాత్రం హలో అని, గుడ్‌మార్నింగ్ అని పలకరించారు. అమెరికాలో కళ్లలోకి కళ్లు పెట్టిచూడరు కాబట్టి కనిపించిన నాగరికుల మొహాలలో ఎలాంటి భావాలు ఉన్నాయో తెలియలేదు రాఘవకి.

వీధుల పేర్లు జ్ఞాపకానికి తెచ్చుకుంటూ మానస ఇంటికి చేరేటప్పటికి దాదాపు ఆరున్నర అయింది. మెల్లగా తలుపు తోసుకుని లోపలికి ప్రవేశిస్తుంటే

"హలో" అంటూ కిచెన్‌లో కాఫీ కలుపుకుంటున్న సంతోష్ కనిపించాడు.

"గుడ్‌మార్నింగ్, రాత్రి నేవచ్చేటప్పటికి మీరు నిద్రపోతున్నారు" అన్నాడు రాఘవ.

"అలా అని చెప్పిందా మానస? ఎనీవే కాఫీ తాగుతారా? " అంటూ షెల్ఫ్‌లోంచి ఒక మగ్ తీసి దానిలో కాఫీ నింపి రాఘవకి అందిచ్చేడు.

ఇప్పుడే తాగేను వద్దు అని చెప్పాలనిపించినా "థాంక్స్" అంటూ కాఫీ మగ్ అందుకున్నాడు రాఘవ. ఇద్దరూ కబుర్లలో పడ్డారు.

గతంలో చూసిన దానికి, ఇప్పటికి సంతోష్‌లో మార్పు కనిపించింది. ఎభై ఏళ్ల దగ్గరపడుతున్న వ్యక్తిలా శరీరానికి ఒక రకమైన నిండుతనం వచ్చింది. ముఖ్యంగా బొజ్జ ప్రదేశంలో. బరువు పెరిగినా ఆరడుగుల ఎత్తు మనిషిలో అది ప్రస్ఫుటంగా కనిపించలేదు. కాని కళ్లు లోతుకు వెళ్లిపోయాయి. కంటిరెప్పలని ఆనుకుని ఉన్న భాగం పొంగి ఉంది అనుకున్నాడు రాఘవ.

"ఏమిటి పరీక్షగా చూస్తున్నారు? నాలో ఎంత మార్పు వచ్చిందనా? అందరిలోనూ మార్పు సహజమే కదా? మనుషులలోనే కాదు ఈ దేశంలోనే మార్పు వచ్చింది" అంటూ గలగలా నవ్వేడు సంతోష్.

"రాత్రి నిద్రపట్టిందా? తొందరగా లేచేవా? " అంటూ రాఘవని ప్రశ్నిస్తూ మానస కాఫీ కప్పు అందుకుంది. తల ఊపాడు రాఘవ.

"నేలేచేటప్పటికి మార్నింగ్ వాక్‌కి వెళ్లి వచ్చేడు మీ ఫ్రెండ్" అన్నాడు సంతోష్.

చివాలున భర్త వేపు చూసింది మానస.





కళ్లు కలవకుండా రాఘవవేపు చూశాడు సంతోష్.

"ఈ ప్రాంతపు అమెరికన్ కాంగ్రెస్ ఉమె న్‌ని కలవాలి. గతంలో ఆమె ఎలక్షనప్పుడు నేను చాలా డబ్బు ఆ పార్టీకి ఇచ్చేను. ఆమెతో ఒంటిగంటకి లంచ్. ఆ మీటింగ్‌కి కావలసిన కాగితాలని తయారుచేయాలి. స్నానం అదీ కానిచ్చి తొమ్మిది గంటలకల్లా ఆఫీసుకి చేరితే చాలు" అంటూ తయారవ డానికి లేచి మేడ మెట్లు ఎక్కాడు సంతోష్.

రాఘవ ఏమీ మాటలాడలేదు.

"ఈవేళ డిపార్ట్‌మెంట్‌లో ఒక ముఖ్య మైన పని ఉంది. నిన్ను నాతో తీసుకు వెళ్తాను. నువ్వు ఇంటర్‌నెట్ మీద పేపర్లు చదువుతుంటే ఆ పని పూర్తిచేసి వస్తాను. తరువాత ఇతర విషయాలు మాటలా డదాం. బ్రేక్‌ఫాస్ట్‌కి దోసెలు వేసేదా? లేక సీరియల్ టోస్ట్ కావాలా?" అనడిగింది మానస.

"ఇంత ఉదయమే దోసెలు తింటే నాకు నిద్ర వస్తుంది. సీరియల్ టోస్ట్ ఐ ప్రిఫర్" అన్నాడు రాఘవ.

★ ★ ★

ఉదయం పదిన్నర గంటలయింది. "ముఖ్యమైన మీటింగ్ ఉంది. కాని ఎక్కువ సమయం పట్టదు" అంటూ మానస వెళ్లి అరగంట అయింది. ఇంటర్‌నెట్ మీద వార్తలు వగైరాలు చదివి చాలాకాలంగా ఇమెయిల్స్ పంపని వాళ్లకి మెయిల్ పంపడం దాదాపు పూర్తవుతుంటే మెల్లిగా తలుపు తెరచుకుని మానస లోపలికి వచ్చింది. కత్తివేటుకి నెత్తురుచుక్క లేదన్న సామెతలా మానస మొహం తెల్లగా పాలి పోయి ఉంది.

"కంప్యూటర్ మీద పని అయిపోతే మనం వెళదాం" అంది మానస. రాఘవ కంప్యూటర్ ఆఫ్ చేయగానే ఇద్దరూ బైటకి నడుస్తుంటే "మరో రోజు వచ్చి పాత ప్రొఫె సర్లని కలుద్దాం" అంటూ పార్క్‌చేసిన కారు తలుపు తెరచింది మానస. కారుని ఒక కాఫీ దుకాణం దగ్గర ఆపి రెండు కాఫీలతో తిరిగి వచ్చి ఒకటి రాఘవకి అందిచ్చి కారుని లేక్ మిచిగన్ ఒడ్డుకి పోనిచ్చి కారు ఆపి "దిగు" అంది మానస. మానస కారు ఆపిన ప్రదేశంలో సరస్సు అలలు తీవ్రంగా ఒడ్డుకు కొట్టుకువచ్చి భూమిని కోసేస్తుంటే అలల తాకిడికి తట్టుకునే పెద్దపెద్ద పణుకు రాళ్లు ఉన్నాయి.

మైళ్లకి మైళ్లు విస్తరించి ఉన్న మిచిగన్ సరస్సునుంచి కెరటాలు సముద్రపు కెరటా లులానే ఒడ్డుకు కొట్టుకు వస్తున్నాయి. సర స్సుకి ఎదురుగా ఒక రోడ్డు. దానిమీద ఒకటో రెండో కార్లు నడుస్తున్నట్లు పరిగెడు తున్నాయి. రోడ్డుకి రెండవ వైపు ఖాళీగా ఉన్న కర్ర బెంచీలమీద కూర్చుంది మానస. ఆమె పక్కనే ఆసీనుడయాడు రాఘవ. ఆకా శంలో మేఘాలలోంచి మసకగా సూర్యుడు కనిపిస్తున్నాడు. అలలు మందంగా ఒడ్డుని తాకుతున్నాయి. సీగల్స్, కెనేడియన్ బాతులు, పావురాలు, పక్షులు రోడ్డుకి, సర స్సుకి మధ్యన పారవేసిన తిండిని నంజు కుంటూ తింటున్నాయి.

"మా డిపార్ట్‌మెంట్‌లో ఒక బంగ్లాదేశీ యురాలు పనిచేస్తోంది. ఆమె గత వారం రోజులుగా డిపార్ట్‌మెంట్‌కి రాలేదు. ఆమె ఇంటికి ఫోన్ చేస్తే ఫోన్ ఎవ్వరూ ఎత్త లేదు. యూనివర్సిటీకి దూరంగా నివశి స్తోంది ఆమె. ఆమె భర్త పశ్చిమ ఏసియా దేశీయుడు. ఆమెకి మూడేళ్లకి కాంట్రాక్ట్ మీద ఉద్యోగం ఇచ్చేం. ఆమె అన్నివిధాలా సమర్థవంతురాలని డిపార్ట్‌మెంట్ ఆమో దిస్తే మరో మూడేళ్లు ఉద్యోగం పొడి గిస్తాం. ఉన్నట్టుండి ఆమె కనిపించడం లేదు. నిన్న వాకబు చేస్తే ఆమె ఇల్లు ఖాళీ అయిందని కనుక్కున్నాం. నిన్న మా డిపా ర్ట్‌మెంట్‌లో డీన్‌కి 'ఆమె, ఆమె కుటుంబం క్షేమంగా ఉన్నారని ఆమె గురించి వెతకవ ద్దని ఆమె చేస్తున్న ఉద్యోగానికి ఇంకొకర్ని

నియమించమని' ప్రభుత్వం దగ్గరనుంచి ఇమెయిల్ వచ్చిందిట. అది తెలిసేక ఏం చేయాలో తెలియలేదు. ఈవేళ పాత ధరఖాస్తులు బైటకి తీసి కొత్తగా ఇంటర్వ్యూకి ఎవరిని పిలవాలో నిశ్చయించేం" అంటూ ఆగింది మానస.

"నువ్వు చెప్పినది నిజమా? ఉన్నట్టుండి ఆమె ఎలా మాయమౌతుంది? ఎవరు దీనికి బాధ్యులు? " అనడిగాడు రాఘవ.

"సెప్టెంబర్ పదకొండు తరువాత కొన్ని దేశాలనుంచి వచ్చిన ప్రజలని వీసాకాలం పూర్తయితే, అనుమతి లేకుండా చట్టవిరుద్ధంగా ఈ దేశంలో ఉంటున్న ప్రజలుగా గుర్తించి వాళ్లకోసం ప్రభుత్వం గాలిస్తోంది. సెప్టెంబర్ పదకొండవ తారీకున దాడికి కారణమైన వాళ్లు వీసాని దురుపయోగం చేసి ఇక్కడ దాక్కుని ఉండిపోయేరుకదా! ఆ నేపథ్యంలో ఎఫ్.బి.ఐ, ఎ.టి.ఎఫ్ స్థానిక పోలీసులు, ఇతర సంస్థలు విధ్వంసకారుల కోసం ముందు చూపుగా కొందర్ని గమనిస్తున్నారు. ఆమె భర్తకి సరైయిన ఉద్యోగం లేదు. ఇతర విషయాలు మనకి తెలియదు' ' అని మానస బంగ్లాదేశీయురాలి అంతర్ధానంకి కారణం ఊహించింది.

"చాలా ఆశ్చర్యంగా ఉందే. చెప్పాపెట్టకుండా ఇలా తీసుకెళ్లడమే? అమెరికాలో ఇలా జరుగుతుందంటే నేను నమ్మను" అన్నాడు రాఘవ.

"నీ నమ్మకం గురించి ఎవరికి కావాలి? ఇక్కడ పరిస్థితులు, సెప్టెంబర్ పదకొండు తరువాత జాగ్రత్తలు ఎక్కువయేయి. ఇదివరలో ఎప్పుడూ వాడని చట్టాలని ఇప్పుడు వాడుతున్నారు" అంది మానస.

"మరి ఆ చట్టాలని సరిగ్గా అమలు పరుస్తున్నారో లేదో! న్యాయస్థానానికి అప్పీల్ చేసుకోవడానికి వీలుందా? " అనడిగేడు రాఘవ.

"ఈ కొత్త చట్టాలని కోర్టులు ఏమీ చేయలేవు. దేశరక్షణకోసం అనుమాన పరిస్థితులలో నిర్బంధన చట్టవిరుద్ధం కాదు. అదీకాక వాళ్ల తరఫున ఎవరు కోర్టుకి వెళతారు" అనడిగింది మానస.

"మరి పౌరుల ప్రాథమిక హక్కులు? "

"యుద్ధకాలంలో దేశ రక్షణ దృష్ట్యా కొన్ని ప్రాథమిక హక్కులపై ఆంక్షలు తప్పవు అంటోంది ప్రభుత్వం. కొత్త చట్టాలని ఏమీ తయారు చేయలేదని పాత చట్టాలనే రాజ్యాంగంలో రాసిన వాటినే అమలు పరుస్తున్నామని అంటోంది. ఆఫ్ఘనిస్తాన్ యుద్ధం, ఇప్పుడు ఇరాక్ యుద్ధంతో ప్రజల ధోరణి, ఆలోచనలో తేడా వచ్చింది. సెప్టెంబర్ పదకొండు నాడు జరిగిన దాడి వంటిది మళ్లీ ఎక్కడా జరగకుండా ఉండాలంటే దాడి చేసిన వాళ్లనే కాకుండా వీళ్లు ఈ దాడి ఎలా చేయగలిగేరు? దాడికి ఎక్కడ తరిఫీదు పొందేరు? ఏఏదేశాలలో వాళ్లకి సహాయం లభిస్తోంది? ఈ దాడిని ఖండించిన దేశాలు ఏవి? దాడి ఖండించని దేశాలు, దాడిని సమర్థించినట్లేకదా? రేపు మళ్లీ ఆ దేశాలు ఇలాంటి దాడి చేసే అవకాశం ఉందికదా? అని పరిపరి విధాల ప్రభుత్వం ఆలోచిస్తోంది. ఏమీ చర్యలు తీసుకోకుండా ఊరుకుంటే ప్రజలు ఏం చేస్తున్నారని అడుగుతారు. ఇలా అనుమానం ' న్నవాళ్లని తీసుకెళ్లి దాడిచేయడంని ప్రీ ఎమ్ప్టివ్ స్ట్రైక్ అంటుంది. అంటే వాళ్లు మన మీద దాడి చేసే అవకాశాన్ని ఇలా నిలుపుచేస్తున్నాయట" అంది మానస.

"ప్రభుత్వం ఏ ఆధారం మీద ఎవరి మీదనైనా చర్య తీసుకుంటుంది? నిర్బంధిస్తుంది? " అనడిగేడు రాఘవ.

"ప్రభుత్వం ఇంటిలిజన్స్ సేకరిస్తుంది. ఏ కారణం చేతనైనా ఎవరి మీదనైనా అనుమానం పొడచూపినా ప్రభుత్వం ఆ వ్యక్తి టెలిఫోన్‌లో ఎవరితో ఏమిటి మాటలాడుతున్నాడో రికార్డ్ చేసి వినగలదు. ఆ వ్యక్తి ఉత్తరాలు, ఇమెయిల్ చదవగలదు. ఆ




వ్యక్తి ఏఏ ప్రదేశాలలో ఏఏ వ్యక్తులతో సంచరిస్తున్నాడో, సంబంధాలు పెట్టుకుంటు న్నాడో, ఎలా డబ్బు ఖర్చుపెడుతున్నాడో, అతనికి డబ్బు ఎలా వచ్చిందో అంతా ఆరా తీయగలదు. ఒక్క సోషల్ సెక్యూరిటీ తెలిస్తే చాలు ప్రభుత్వమేమిటి నేను కూడా కాస్త డబ్బు ఖర్చుపెడితే ఆ వ్యక్తి హిస్టరీ తెలుసుకోగలను" అంది మానస.

రాఘవకి నోట మాటరాలేదు.

"అమెరికాలో ఒకరి విషయాలు ఇంకొక రికి తెలియవని, రహస్యంగా ఉంటాయని అనుకున్నాను. వ్యక్తి స్వాతంత్రం, ప్రాథమిక హక్కులు చాలా ముఖ్యమని, వాటిని ఉల్ల ఘించలేరని ఇంతవరకు నమ్మాను. నువ్వు ఒక్కసారి ఆ నమ్మకాన్ని తారుమారు చేశావు"

"అవన్నీ ముఖ్యమేకానీ దేశానికి ముప్పు వాటిల్లే పరిస్థితులలో వ్యక్తికంటే దేశం ముఖ్యమట. అలనాడు వియత్నాం యుద్ధ సమయంలో యుద్ధం వద్దని చాలా ప్రదర్శ నలు జరిగాయి. చాలామంది ఆ యుద్ధం నుంచి అమెరికా త్వరగా ఎందుకు బైటప డాలో వివరిస్తూ ప్రభుత్వ వాదనని ఖండిస్తూ పేపర్లలో రాశారు. అప్పుడు టెలి విజన్‌లో అమెరికా బాంబులు కురిపించడం తోపాటు సైనికులు నష్టపోవడం గురించి కూడా చూపించారు. కాని ఇప్పుడు అలా కాదు. ఈ యుద్ధాన్ని కొత్త వ్యూహాత్మకంగా నడిపారుట. యుద్ధం గురించి ఎవరైనా నెగెటివ్‌గా రాస్తే ఆ జర్నలిస్టని, దానిని ప్రసారం చేసే టెలివిజన్ స్టేషన్‌ని 'అన్ అమెరికన్', అని 'అన్‌పేట్రియాటిక్' అన్న ముద్ర వేయడంతో అందరూ గప్‌చిప్ అయిపోయారు. అన్ని పేపర్లూ, అన్ని టెలి విజన్ ఛానెల్స్ మేము దేశభక్తులమంటే మేము అంతకన్నా దేశభక్తులమంటూ ప్రభుత్వ ఉద్దేశాన్ని పసికట్టి దానికి అనుగు ణంగా వ్యాసాలు రాశారు. వార్తలు ప్రసారం చేశారు" అంటూ ఆపింది మానస.

సరస్సునుంచి అలలజోరు ఎక్కువై ఒడ్డున ఉన్న పణుకురాళ్లని ఢీకొని మీదకి ఎగుస్తున్నాయి. సన్నని నీటి తుంపర అప్పు డప్పుడు మానస మొహంమీద, జుత్తుమీద పడుతోంది. చల్లని చలిగాలి ఉధృతం ఎక్కువవుతున్నా పట్టించుకోకుండా ఆలోచ నల్లో మునిగి వున్న మానసని మేల్కొలప డానికి సంశయించాడు రాఘవ. చలివల్ల ఒంటిలోంచి ఒణుకు మొదలైంది రాఘవకి. ఒక్క నిమిషం కూడా మౌనంగా ఉండని మానస గంభీరంగా మౌనవ్రతాన్ని పాటి స్తోంది.

"నీకు బాగా చలిగా అనిపిస్తోందేమో లే వెళదాం" అంటూ లేచి

"ఇంటికి వెళ్లి లంచ్ తిందామా? లేక ఇక్కడకి దగ్గరగా ఉన్న ఒక ఇటాలియన్ రెస్టారెంట్‌లో లంచ్ తిందామా? " అనడి గింది మానస.

"లంచ్‌కయ్యేఖర్చు నేభరిస్తాను, లేదంటే ఇంటికి వెళ్లదాం" అన్నాడు రాఘవ.

"ఈ దేశంవచ్చి మా ఊరిలో నువ్వు నాకు లంచ్ ఇప్పించడమేమిటి? ఇండియా వస్తే అప్పుడు నువ్వు ఇద్దువుగానిలే" అంటూ కారుని రోడ్డుమీదకి మళ్లించింది.

పార్కింగ్ ప్రదేశంలో ఉన్న కారు దగ్గరకి చేరి తలుపు తీసేలోపల మానస తనని తాను కంట్రోల్ చేసుకున్నా ఆమె చెప్పలేని బాధేదో రాఘవ కంటపడింది. కారు స్టార్ట్ చేసేలోపల ముక్కు ఒకసారి ఎగపీల్చింది.

ఎవరి ఆలోచనల్లో వాళ్లు మునిగి ఉన్నారు.

రాఘవ కనిపించిన దగ్గరనుంచి మాన సలో ధైర్యం పెరిగింది. 'ఈ దేశం గురించి అతి తక్కువ తెలిసిన రాఘవ తనకి ఏ రక మైన సలహాకాని సపోర్ట్‌కాని ఇవ్వడని తెలి సినా తను చెప్పినది విని తన బాధ కాస్త పంచుకుంటాడని నమ్మకం. కాంచన కాలే జీకి వెళ్లిపోయిన దగ్గరనుంచి తనకి

సహాయం చేసేవారే లేరు. క్రితం రోజు రాత్రి గిన్నెలు కడగడంలో రాఘవ సహాయం చేస్తానని చేయడం తనకి ఎంత ఆనందం కలిగించిందో! ఆ సహాయము వలన తనకి శారీరక శ్రమ తక్కువయిందని కాదు కాని కబుర్లు చెప్పుకుంటూ పని చేసు కుంటుంటే ఒక రకమైన రిలీఫ్. పక్కన ఒక తోడు ఉన్నాడన్న నగ్నసత్యం తనకి కొత్త అనుకుంటూ కాస్సేపు బాధాపూరితమైన ఆలోచనల్ని వెనక్కి పెట్టింది మానస.

రాఘవ, సంధ్య మంచి జోడీ. రాఘవ నిదానత్వం, సంకోచం, ముభావత్వంకి సంధ్య ఉత్సాహం, చొరవ ఒకదానికి రెండ వది విభిన్నమైనా వాళ్లలో తనకి ఎప్పుడూ పొరపొచ్చాలు కనిపించలేదు. ఇంటిని నడి పేది సంధ్య, రాఘవ ఆమెని తర్కించడు. ఆమె మాటలకి అడ్డు తగలడు.

రాఘవని పెళ్లిచేసుకున్న సంధ్య అదృష్ట వంతురాలు.

రాఘవలాంటి వ్యక్తికోసం తను కలయ చూసింది. అతనికున్న నిదానత్వం, ముభా వత్వం ఉన్న వ్యక్తులు తారసపడినా రాఘ వలాంటి దొడ్డమనసు వాళ్లలోలేదు. తనకి ఇష్టమైన రాఘవకున్న అర్హతలున్న వ్యక్తులు తటస్థపడలేదు. అవన్నీ ఒక్క రాఘవలోనే కనిపించాయి. దేవదాసు సినిమాలో నాగే శ్వరరావు నటన తనకి బాగా నచ్చింది. ఆ చిత్రం తనకి హత్తుకుంది. తరువాత ఇత రులు తీసిన దేవదాసు సినిమాలలో నటిం చిన వ్యక్తుల నటన చూసినపుడు "అబ్బే ఇది బాగాలేదు, నాగేశ్వరరావు వేసిన ఆ దేవదాసే బాగుంది" అని ఎప్పుడూ అనిపి స్తుంది. దానికి కారణం నాగేశ్వరరావు నటనే తతిమ్మా వాటిని బేరీజు వేయడానికి కొలతబద్ద. అదొక ఒరిజనల్. ఇతర ఏ దేవదాసు చూసినా అవి నకిలీలులా కనిపిం చేవి. అలాగే కొంతమంది రాఘవలాంటి వ్యక్తులు కనిపించినా వాళ్లెవరూ రాఘవలు కారు. జీవితం విచిత్రమైనది, అనుకుంటూ ఆలోచనల్లో ఇరుక్కుపోయింది మానస.

మానస మౌనంగా కారు నడుపుతుంటే రాఘవ మెదడు తీవ్రంగా ఆలోచించడంలో నిమగ్నమైంది. మానస వ్యధకి కారణాలు వెతుకుతోంది. 'డిపార్ట్‌మెంట్‌లో గొడవలు, బంగ్లాదేశ్ యువతి మాయమవడం, ఫ్రీడమ్ అభిలషించే మానసకి విషాదకర మైనా బాధాపూరితమైనా ఆమెని కృంగతీసే సంఘటనలుకావు. అది కానప్పుడు కార ణాలు ఏమై ఉంటాయి? సంతోష్‌లో మార్పు కనిపిస్తున్నా పెద్ద చిక్కులలో ఉన్న ట్లేమీ అనిపించడంలేదు. మరి? ' మెదడు అరిగిపోయిన గ్రామ్‌ఫోన్ రికార్డులా తన అనుమానాలు ఆ మూడు అంశాల చుట్టూ తిరుగుతోంది. 'కాంచన! కాంచన ప్రేమలో పడిందేమో! అదీ ఒక టెర్రరిస్ట్‌తో? !' గ్రామ్ ఫోన్ రికార్డ్ ఆగింది. 'ప్రేమ విషయానికి వచ్చేసరికి తల్లి, తండ్రి, ఇతరుల సలహాల ప్రభావం ఉండదు. సమాజ ప్రభావం తక్కువగా వున్న ఈ దేశంలో అలాంటివాటి గురించి అంత వ్యాకుల పడనవసరంలేదు. కాని కాంచన టెర్రరిస్ట్ ప్రేమలోపడితే, అది తీవ్రమైన మానసిక సంక్షోభానికి కారణమౌ తుంది.' ఒక్కసారి రాఘవ శరీరం జలద రించింది. అలాంటిదేదో అయివుండాలి అనుకుంటూ తల పట్టుకున్నాడు రాఘవ. కాస్సేపు ఆ ఆలోచన దగ్గర మనస్సు తచ్చాడి శాంతిగా వుంది. అయితే అది కేవలం తాత్కాలికం.

'మానస చాలా బరువు తగ్గడం, ఒడలి పోవడం గమనిస్తుంటే ఆమె వ్యాధిగ్రస్తు రాలు అయి ఉండవచ్చేమో' అంటూ ఆలో చన పాతధోరణి పట్టింది. 'ఏదిఏమైనా మానసకి తొందరగా ఉపశమనం కావాలి.

హేభగవాన్! మానసకి కేన్సర్ వ్యాధి లాంటిది రానివ్వకు. 'అనుకుంటుంటే చటు క్కున రాఘవకి నవ్వు వచ్చింది.' మనలో నమ్మకాలని, అలవాట్లని మనచుట్టూ వున్న ప్రజలు మనలో నాటుకునేలా చేస్తారు.




అలాంటివేవీ నమ్మని తను, తను ఆరాధించేలాంటి మానస గురించి ఆలోచిస్తూ సహాయంకోసం యాంత్రికంగా, అనాలోచితంగా, 'హేభగవాన్' అని ఉచ్చరించాడు. ఈ అలవాట్లు, ఊతపదాల వాడకం మన శరీరంలో వున్న జీన్స్‌లో కరుడుకట్టి, నిబిడీకృతమై శరీరంలో అమీబియాసిస్ వ్యాధి లాగే అప్పుడప్పుడు బయటపడతాయి. ఉత్తరానికి, దక్షిణానికి వలసవెళ్ళే పక్షులు ఒకసారి అనుభవం లేకపోయినా పరిగెత్తి అదే చోటుకి చేరుతాయి. జీన్స్ ప్రభావం, ఇన్‌స్టింక్స్!

"ఏమిటి ఆలోచనల్లోపడి, నీలో నువ్వే నవ్వుకుంటూ, ఇప్పుడు నన్ను పరీక్షగా చూస్తున్నావు? " అంటూ రాఘవవేపు తిరిగింది మానస.

"కొన్ని విషయాలలో ఎంత సమాధానపరచి, సముదాయించినా ఆలోచనలు మన అధీనంలో వుండవు. నే ఊరుకి వేళ్ళేలోపల కాంచన ఇక్కడకి వచ్చే అవకాశం వుందా? " అనడిగాడు రాఘవ.

"ఏమో చెప్పలేను. వీలుంటే రమ్మనమని ఫోన్‌చేశాను. నిన్ను ఇక్కడకి బలవంతపెట్టి నాలుగు రోజులకి రప్పిస్తున్నానని చెప్పాను. చూద్దాం, దానికి పరీక్షలులాంటి గొడవలేకపోతే వస్తుంది" అంది మానస.

"బలవంతంగా రప్పించాను" అంది మానస. 'కాని తను ఇక్కడకి రావడానికి ప్లాన్ చేయకపోవడానికి కారణాలు, మానస దాని ప్లాన్ గురించి ఊహిస్తున్న కారణాలు ఒకటి కావని చెప్పాలని వుంది. కాని మానస కారణాలు తనకి సరిగ్గా తెలిస్తే కదా? ' అనుకుని సమాధానమివ్వకుండా రోడ్డుని గమనించసాగాడు రాఘవ.

ఆకాశంలో వెలుగు చటుక్కున తగ్గి, ఉరుములు మెరుపులతో వాన ఆరంభమైంది. ఆదేదో సినిమాలో ఒక హీరోయిన్ నడుముకట్టి, సర్కస్ ఫీట్స్ చేసినట్టు కాకుండా అత్యంత నిబ్బరంగా, లాఘవంగా కారుని నడిపి, రెస్టారెంట్ తలుపు దగ్గర కారు ఆపి, "నువ్వు దిగిపో, నేకారు పార్క్‌చేసి వస్తాను" అంది మానస. రాఘవ కారు దిగాడు.

"కాపర్ సల్ఫేట్ రంగు చీర మీద వాన పడడంతో వాన చినుకులు నీచీరకి కొత్త డిజైన్‌ని ఇచ్చాయి" అన్నాడు రాఘవ రవ్వంత తడిసివచ్చిన మానసతో.

"అబ్బో! కొత్త భాష మాట్లాడుతున్నావే" అంటూ వెయిట్రెస్ చూపించిన టేబుల్‌వేపు నడిచింది మానస.

లంచ్ తింటున్న రెస్టారెంట్‌లో పెద్ద టెలివిజన్ ఆన్‌చేసి ఉంచింది రెస్టారెంట్ యాజమాన్యం. సి.యన్.యన్. ఛానల్ నడుస్తోంది. వార్తలు ప్రసారమవుతున్నాయి.

బాగ్దాద్ పట్టణ సమీపంలో ఎవరో అమెరికన్ సైనికులమీద కాల్పులు జరిపారని, ఒక అమెరికన్ సైనికుడు మరణించాడని, నలుగురు అమెరికన్లు గాయపడ్డారని, అది జరిగాక ఎదురు కాల్పులు, ఇళ్ళసోదాలు చేస్తున్నప్పుడు జరిగిన సంఘర్షణలో ఐదుగురు ఇరాకీయులు మరణించారని ప్రసారంచేస్తూ, "సద్దాం రాజ్యం అంతరించినా, ఇంకా అరాచకం తగ్గలేదని, ఇరాక్‌కి డెమొక్రసీ రావడానికి ఇంకా కొంతకాలం పడుతుందని, ఎంతకాలం పడుతుందో ఖచ్చితంగా చెప్పలేమని" ఇరాక్‌లోవున్న అమెరికన్ సైనికధికారి ప్రకటించాడు. ఇరాక్ దేశస్థులకి డెమొక్రసీ అంటే తెలియదని, అది నెలకొల్పడానికి కృషిచేస్తామని చెబుతూ, మతాధికారులు పాలించే ప్రభుత్వాన్ని సహించమని వక్కాణించాడు. ఇరాక్‌లో సామాన్యపౌరుడు చాలా అధ్వాన్నస్థితిలో ఉండేవాడని, ఇరాక్‌మీద ఆంక్షలు, ఈ అనివార్య యుద్ధం వలన పరిస్థితి ఇంకా దిగజారిందని, ఇరాక్‌లో వున్న చమురుని అమ్మి, ఆ వచ్చిన డబ్బుతో ఇరాక్ పునర్నిర్మాణం జరిగేలా ఉపకరించేందుకు చమురు



ఉత్పత్తికి
చురుకుగా పనులు సాగుతున్నాయన్నాడు. అమెరికన్ సైనికులు నీరు, ఎలక్ట్రిసిటీ సరఫరా అందించడానికి శాయశక్తులా ప్రయత్నిస్తుంటే సద్దాం అనుయాయులు అవరోధాలు కల్పించినా వాటిని ఎదుర్కొని ప్రజల పరిస్థితి బాగుచేస్తామన్నారు.

"పొద్దున్నించి సాయంకాలం వరకూ ఇదే సుత్తి. చెప్పిందే చెప్పడం. నాలుగు రోజుల క్రితం న్యూయార్క్ టైమ్స్ పేపరు కొన్నాను. ఆరోజు మొదటి పదహారు పేజీలు న్యూయార్క్‌కి సంబంధించిన వార్తలే. రెండుమూడు సంవత్సరాల క్రితం ఇరాక్ గురించి ఏదైనా సమాచారం వుంటే అది ఏ ఆరవ పేజీలోనో, అదీ ఒక మూలగా, కాలమ్‌లో నాల్గువవంతు ప్రచురించేవారు. ఈ దేశంలో కాలేజీ స్టూడెంట్‌ని లేదా ఆఫీసుల్లో



పనిచేసే సాధారణ వ్యక్తిని, ప్రపంచ మేప్ ఇచ్చి, ఇరాక్ ఎక్కడ వుంది? అనడిగితే నే పందెం కడతాను నూటికి ఎనభైశాతం సమాధానం చెప్పలేరని. దాని జనాభా ఎంత? ఆ దేశం గురించి నీకేం తెలుసు? అది అమెరికాకి ఎంత దూరంలో వుంది? అనడిగితే, అఫ్ కోర్స్ జవాబు ఇవ్వలేరు. కాని టెలివిజన్‌లో ఆ దేశం అమెరికాపై అణ్వస్త్రాలు, మారణాయుధాలు ప్రయోగించి హానిచేస్తుందని పదేపదే చెబితే అందరూ నమ్మేస్తారు" అంటూ వాపోయింది మానస. రాఘవ తల పంకించాడు.

"ఎప్పటిలాగే ఏమీ మాట్లాడకుండా కూర్చున్నావు. యుఆర్ హోప్‌లెస్" అంది మానస. చిరునవ్వు నవ్వాడు రాఘవ.

"నువ్వు ఇండియా వెళ్ళాక ఎన్నోసార్లు నీ సూజన్ నీ గురించి అడిగింది. నువ్వు ఎలా ఉన్నావని ఆరా తీసేది" అంటూ రాఘవ సిగ్గుపడడం చూసి నవ్వు అందుకుంది మానస.

ఎవరో దూరంగా చేయి ఊపారు కాబోలు మానస చేయి ఊపింది. అరని మిషం తరువాత ఒక మధ్య వయస్కుడు మానస కూర్చున్న ప్రదేశానికి వచ్చి 'హలో' అని పలకరించాడు.

"ఇతను నా స్నేహితుడు రాఘవ. ఇండియా నుంచి విజిట్‌కి వచ్చాడు. ఈయన స్టీవ్, పొలిటికల్ సైన్స్ విభాగంలో ఎసోసియేట్ ప్రొఫెసర్ మన యూనివర్సిటీలో" అంటూ పరిచయాలు చేసింది మానస.

"నేను పని చేసినపుడు ఈయన లేరేమో! నైస్‌టు మీట్‌యు" అంటూ రాఘవ స్టీవ్ అందిచ్చిన చేయి అందుకున్నాడు.

రాఘవ, మానసలు కూర్చున్న టేబిల్‌కి దాదాపు ఎదురుగా ఉంది టెలివిజన్. టి.వి. వేపుచూసి "ఇలా ఎన్ని రోజులు దంచుతారో" అన్నాడు స్టీవ్.

"నేను అదే రాఘవకి చెబుతున్నాను. మీకు అర్థమైనట్లు మాకు పోలిటిక్స్ అర్థమవవు, పామరులం. నాకు ఈ యుద్ధం గురించి కొంత తెలుసు. కాని రాఘవకి నేచెప్పినది నచ్చడంలేదు. దీనిగురించి మీరేమనుకుంటున్నారో రాఘవకి వివరించండి" అంది మానస.

వెయిట్రెస్ వచ్చి నిలబడితే కుర్చీ లాగుకుని సర్దుకుంటూ "మస్కానీ సూప్, సాలడ్" అని ఆర్డరిచ్చి "ఇఫ్‌యు డోంట్ మైండ్? " అన్నాడు.

"నాటెటాల్, మాకు రెండు టెర్రామీసులు" అంది మానస.

"ఉదాహరణకి అమెరికాలో ఇద్దరికి మలేరియా జ్వరం వచ్చిందనుకోండి! ఆరోగ్యపరిస్థితి సీరియస్ అంటారు. రెండు రోజులు తరువాత మలేరియా జ్వరం వచ్చిన వాళ్ల సంఖ్య నాలుగుకి చేరితే ఎపిడమిక్ అని వర్ణించి వెంటనే ఏదో చేయకపోతే నెల్లాళ్లలో అమెరికాలో మలేరియా జ్వరం వచ్చిన వాళ్ల సంఖ్య పదివేలవుతుందని దానికయే ఖర్చు నాలుగు వందల మిలియన్లు అని వర్ణిస్తారు. అలా చేయకపోతే ప్రజలు పట్టించుకోరని భ్రమ. ఆఫ్ఘనిస్తాన్ మీద బాంబుల వర్షం కురిపించినా, సైన్యాలని మోహరించినా ఆ లాడెన్ తప్పించుకున్నాడు. అతను అమెరికా అంటే పడని ఏ దేశంలోనైనా తలదాచుకుని అమెరికన్లమీద దాడులు జరప ప్రయత్నిస్తాడు. అందుచేత అతనికి ఏ దేశమూ సహాయం చేయకూడదు. సౌదీ అరేబియాలోంచి అమెరికన్లు వైదొలగకపోతే వాళ్ల మీద దాడులు చేస్తానని లాడెన్ ప్రకటించాడు. అందుచేత సౌదీ అరేబియా స్థావరం నుంచి వైదొలగాలి, కాని పశ్చిమ ఏసియా ప్రాంతంలో ఒక స్థావరం అమెరికాకి కావాలి. సద్దాం అంటే ఎవరికీ మంచి ఉద్దేశంకాని మద్దతు కాని లేదు. సద్దాం దగ్గర విమానాలు లేవు. పదిహేనేళ్ల క్రితం టెక్నాలజీ ఉపయోగించి తయారయిన తుప్పుపట్టిన టేంక్‌లు ఉన్నాయి. ఐక్యరాజ్యసమితి ఇన్స్‌పెక్టర్లు మారణాయుధాలకోసం వెతికివెతికి మొండి చేతులతో తిరిగి వచ్చేశారు. ఆలస్యం అమృతం విషం అని వాడికి రెండు అంటించడానికి ఐక్యరాజ్యసమితి దీవెన కోసం ప్రయత్నించి అది లభించకపోయినా యుద్ధానికి దిగారు.

బాంబులు ఎందుకు వేస్తున్నారు? అని అమెరికన్ ప్రజ ముందు ముందు అడుగుతారేమోనని మారణాయుధాలు ఉన్నాయి, బేక్టీరియల్ ఆయుధాలు ఉన్నాయి, అణుబాంబులు తయారుచేయడానికి సిద్ధంగా ఉన్నాడు అంటూ ప్రచారం చేసిచేసి ప్రజలని నమ్మించారు.

'అమెరికా సూపర్‌పవర్, దాని జోలికి




వస్తే తాట ఒలిచేస్తాం' అని ఎలుగెత్తి చాట డానికి కారణం రానున్న రోజుల్లో ఇరాక్ ఆయిల్ చవుకగా కొనుక్కోవచ్చు అని బైటకి చెబితే బాగుండదుకదా! టెర్రరిస్టులతో సద్దాంకి లింక్ ఉంది. ఆ దేశాన్ని డెమోక్ర సీవైపు తీసుకెళ్లడం ఫ్రీడమ్ అభిలషించే అమెరికా విద్యుక్తధర్మం అంటూ జూలై నాల్గవ తారీకున జరిగే ఫైర్‌వర్క్స్‌లా బాంబుల వర్షం కురిపించేరు. పవర్‌గేమ్, ఆధిక్యతకోసం పడేపాట్లు. ఇరాక్ ప్రజల స్థితిగతులు మార్చడానికి, ఇరాక్ ఆయిల్ అమ్మి దానిని వాడతాం అన్నారు. ఇలాంటి ఆటలు అన్ని దేశాలూ ఆడతాయి. ఈ ఫుట్‌బాల్ ఆటకి రిఫరీ ఉండడు. బలం ముఖ్యం" అన్నాడు స్టీవ్. నోరు వెళ్లబెట్టేడు రాఘవ.

"ఇది నిజమా? లేక మీ వ్యాఖ్యా? కొన్ని న్యూస్‌పేపర్లలో మీరు చెప్పిన పాయింట్స్ కొంతమంది రాయగా చదివేను. అదంతా ఊహాగానమేమో అనిపించింది" అన్నాడు రాఘవ నోరు పెగల్చుకుని.

"మీరు చాలా అజ్ఞానంలో ఉన్నట్లున్నారే! క్షమించాలి ఇలా అన్నందుకు. నేను చెప్పేది ఏదీ కల్పనకాదు. యుద్ధం నడిపిన జనరల్స్, పెంటగాన్, అమెరికన్ విదేశాంగ శాఖ అధికారులు యుద్ధం ముగిసేక మెల్లి మెల్లిగా బైటకిస్తున్న ప్రకటనలే ఇవన్నీ. అవన్నీ క్రోడీకరించి చెప్పేను అంతే" అంటూ వెయిట్రెస్ తెచ్చిన సూప్ తాగనా రంభించేడు స్టీవ్.

మానస డిసర్ట్‌లో ఫోర్క్ గుచ్చింది. రాఘవకి స్టీవ్ చెప్పినది నమ్మాలనిపించడం లేదు. పరాకుగా, ఆలోచిస్తూ టెర్రామీసు తినడం మొదలుపెట్టాడు.

పదిహేను నిమిషాల తరువాత స్టీవ్ లేచి వెళ్లబోతుంటే "అమెరికాలాంటి దేశం మీరు చెప్పినట్లు ప్రవర్తిస్తుందంటే నమ్మలేకుండా ఉన్నాను. ప్రాథమిక హక్కులు, పౌరహక్కులు గౌరవించి అన్యాయం జరిగితే కోర్టుకి వెళ్లి న్యాయం సంపాదించుకునే మార్గం ఉన్న అమెరికా అలాంటి వాటన్నింటినీ విస్మరించి యుద్ధం చేస్తుందా? మీరు నన్ను చింతాక్రాంతుడిని చేశారు. దాని మాటకేం గాని నైస్ టు హేవ్ మెట్ యు" అంటూ స్టీవ్‌తో కరచాలనం చేశాడు రాఘవ.

భళ్లున నవ్వేడు స్టీవ్.

"మనలాంటి వాళ్ల గురించి ఎవరికి కావాలి? ప్రభుత్వ ధోరణి నిర్ణయించేది చాలా తక్కువ మంది. ఇతరులు దానిని అనుసరిస్తారు. ఆ వాదన సరిఅయినది అనిపించడానికి కృషి చేస్తారు. ఈ వేళ యుద్ధాలు చమురు కోసం జరుగుతున్నాయి. ముందుముందు నీళ్లకోసం జరుగుతాయి. వనరులు తగ్గిపోతుంటే ఉన్న వాటి కోసం కొట్లాటలు మొదలవుతాయని చెప్పడానికి నోబెల్ వారియట్ అవసఖ్ఖరలేదు. వస్తాను" అంటూ స్టీవ్ వెళ్లాడు.

"నువ్వు ఉండేది మూడు రోజులు మాత్రమే! నీకు సూజన్ తెలుసుగా. నువ్వు వస్తే ఆమె ఇంటికి నిన్ను లంచ్‌కి కాని డిన్నర్‌కి కాని తీసుకు రమ్మంది. రేపు రాత్రికి వస్తామని ఇదివరలో నిర్ణయించి అదే సంగతి చెప్పేను. నీకు అభ్యంతరం ఉందా? నువ్వు వెజిటేరియన్‌వని కోడి గుడ్లు, చేపలు కూడా తినవని చెప్పేను. నీకు పనికివచ్చేదేదో చేస్తుందిలే, కంగారుపడకు. ఎందుకో సూజన్‌కి నువ్వంటే చాలా ఆసక్తి. నువ్వు వెళ్లిపోయేక చాలాసార్లు నీ గురించి నీ కుటుంబం, క్షేమ సమాచారాలు గురించి అడిగింది" అంది మానస.

సూజన్ డోహెర్తి! ఐదు అడుగుల ఏడు ఎనిమిది అంగుళాల పొడవు, నూట ముప్పయి పౌన్ల బరువు, కోలమొహం, సన్నంగా రివటలా ఉండేది. ఇప్పుడు ఎలా ఉందో! హిందూ దేశ వంటలన్నా, భారతీయ సంస్కృతి అన్నా చాలా ఆసక్తి చూపించేది. తను ఒక సంవత్సరం పనిచే

యడానికి వచ్చినపుడు ఆమె వయసు బహుశా ముప్పయి రెండు ఏళ్లు ఉండేదేమో. ఆరు నెలల వివాహం తరువాత విడాకులయినా, మొహంలో విచారంకాని, దైన్యంకాని లేకుండా చలాకీగా మసిలేది. బాబ్డ్ హెయిర్‌స్టయిల్, బూడిదరంగు డ్రెస్‌లనే ధరించేది. ప్రతీరోజూ వ్యాయామం చేయడం వలన కాబోలు శరీరంలో ఎక్కడా మాంసపు ముద్దలు లేకుండా పొడవైన షాంపేన్ గ్లాసులా ఉండేది. శరీరంలాగే పొడవాటి ముక్కు, ఎర్రని పెదిమలు. ఎప్పుడు చూసినా జుత్తుని వెనక్కి తోస్తునో, తలనివిదిలించి జుత్తుని కదిలిస్తునో కనిపించేది. నీలం రంగు కళ్లలో ధైర్యం, చిలిపితనం తనకి కనిపించింది అప్పుడు. ఇప్పుడు ఎలా ఉందో అనుకుంటుంటే "పడ్డావూ అప్పుడే సూజన్ ఊహల్లో? " అంటూ ఆటపట్టించింది మానస.



"సూజన్ ఇక్కడ రిజైన్ చేసి వెళ్లి మూడేళ్లయింది. ఇండిపెండెంట్ కన్సల్టెంట్ ఆమె ఇప్పుడు. ఈమధ్యనే మళ్లీ పెళ్లి చేసుకుంది" అని బేరర్ తెచ్చిన బిల్ చెల్లించింది మానస.

మానస ఎవరెవరికో ఫోన్లు చేసి మాట్లాడుతుంటే పగలంతా గడిచిపోయింది. సంభాషణలో లాయర్స్ జడ్జిలు అంటూ పదేపదే వినిపించినా సందర్భం ఏమీ తెలియక, హాలులో ఉన్న టెలివిజన్ మీద దృష్టి కేంద్రీకరించాడు రాఘవ. సాయంకాలం ఐదు గంటలకి మానస, రాఘవలు సూజన్ ఇంటికి బయలుదేరి ఐదున్నర గంటలకి ఆమె ఇంటికి చేరారు.

తలుపు తట్టగానే సూజన్ తలుపు తెరచి "హల్లో రాఘవ్" అంటూ షేక్‌హేండ్‌తో పాటు చిన్నహగ్ ఇచ్చింది. ఆమె ప్రక్కనే నిలబడివున్న వ్యక్తిని ఆయన నా భర్త, ఎడ్మండ్ అంటూ పరిచయం చేసింది. చాచిన రాఘవ చేయిని అందుకున్నాడు ఎడ్మండ్.

"లోపలికి రండి" అంటూ మానసని, రాఘవని ఆహ్వానించింది సూజన్. అందరూ సోఫాలో కూర్చుంటుంటే అరవై డెబ్బై పౌన్లు బరువు ఉన్న ఒక కుక్క వచ్చి రాఘవని అందుకుంటూ మొరగడం మొదలుపెట్టింది.

"గో ఇంటు యువర్ రూమ్" అని ఎడ్మండ్ అరవగానే మొరుగుడు ఆపి మెల్లగా అక్కడనుంచి నిష్క్రమించింది. నలుగురూ కబుర్లలోపడ్డారు.

"టిమోతీ, అదే ఆ కుక్క వయస్సు పన్నెండేళ్లు. సాధారణంగా కుక్కలు పదమూడు పధ్నాలుగేళ్లు బతుకుతాయి. అందుచేత దానిని వదిలి ఎక్కడికైనా వెళ్లాలంటే ఇష్టపడం" అంటూ కుక్కతో ఉన్న అనుబంధం వివరించేడు ఎడ్మండ్.

"ఏమిటి తాగుతారు? వైన్, బీర్, విస్కీ, జిన్, రమ్? " అని ఎడ్మండ్ అడిగితే,

"ఆరెంజ్ జ్యూస్ లేకపోతే కోక్" అని రాఘవ అంటే "వైట్‌వైన్" అని మానస సమాధానం ఇచ్చింది.

 

"వాట్ ఎబౌట్ యు డార్లింగ్?" అని భార్యని అడిగేడు ఎడ్మండ్.

"నేనూ వైట్‌వైన్ తాగుతాను" అని రాఘవవేపు తిరిగి నీలో ఈ ఐదేళ్లలో ఏమీ మార్పు రాలేదు. ఎప్పటిలా చాలా స్మార్ట్‌గా ఉన్నావు" అంటూ రాఘవ వేపు తిరిగింది సూజన్.

"మీలోనూ అట్టే మార్పులేదు. ఇంకాస్త సన్నపడ్డారేమో" అని తిరుగు సమాధానం ఇచ్చాడు రాఘవ.

డ్రింక్‌లు సేవిస్తూ వివిధ టాపిక్‌ల మీద చర్చకొనసాగిస్తుంటే,

"నాలుగేళ్లక్రితం కన్సల్టెంట్‌గా గంటకి రెండు వందల డాలర్లు బిల్ చేసేవాడిని. ఇప్పుడు గంటకి డెబ్బై ఐదు డాలర్లకి దిగితే కాని కాంట్రాక్ట్స్ రావడంలేదు" అన్నాడు ఎడ్మండ్.

"అదీ అదృష్టమే! నేను నా రేటు గంటకి నూరునించి ముప్పయికి దించేను. ఎడ్మండ్ ఆ రేట్‌కి సోమవారం ఉదయం అట్లాంటా వెళ్లి శుక్రవారం రాత్రి తిరిగి వస్తాడు. నాకు అలా తిరగడానికి ఇష్టంలేక ఇక్కడ ప్రాంతీయంగా లభించిన ప్రోజెక్ట్‌లని మాడ్రన్ చేసి తృప్తి పడుతున్నాను. ఎకానమీ ఇంత దారుణంగా పడిపోతుందని ఎవ్వరూ ఊహించలేదు. ఆ డాట్‌కామ్ కంపెనీలు డింకీలు కొట్టేసేక సెప్టెంబర్ పదకొండవ తారీకున వచ్చిన ముప్పుతో ఉద్యోగాలన్నీ ఎండిపోయాయి. హైటెక్‌లో పనిచేసిన వాళ్లు బాగా దెబ్బతిన్నారు. అందులో ముఖ్యంగా మీ దేశంనుంచి హెచ్‌వీసా మీద అమెరికా వచ్చిన వాళ్ల పరిస్థితి మరీ దారుణం" అంది సూజన్.

"అయితే ఒకటి మీ దేశంలోని ప్రజలకి బాగా లాభం చేసింది. చేస్తుంది. మీ దేశంలో చదువు అంతా ఇంగ్లిషులో జరుగుతుంది కాబట్టి అమెరికన్ కంపెనీలకి మీ దేశంలో ఉన్న సాంకేతిక పనివాళ్లతో సమస్యరాదు. అందుకే పెద్దపెద్ద కంపెనీలు ఇండియాలో బ్రాంచీలు పెట్టి కాంట్రాక్ట్ విధానంమీద ఇండియా దేశ ప్రజలచేత, ఇక్కడ ఇచ్చే జీతంలో కేవలం మూడవ వంతు జీతం ఇచ్చి పనిచేయించుకుంటున్నారు. కొందరు అలా చేయకూడదు అని అరిచేరు. కొన్ని రాష్ట్రాలు అలాంటివాటిని ప్రతిఘటించడానికి చట్టాలు తీసుకు రావడానికి ప్రయత్నం చేస్తే అలాంటి చట్టాలు తెస్తే తమ కంపెనీలని ఇంకో రాష్ట్రానికి తరలిస్తామన్నారు. ఉద్యోగాల గురించి పెద్ద కంపెనీలకి బాధ ఎందుకు? షేర్ హోల్డర్స్‌కి డబ్బు పెరగాలి" అన్నాడు ఎడ్మండ్.

మా దేశంలో ఉదాహరణకి నూరు ఖాళీలు ఉంటే వాటిలో ఇరకడానికి పదివేల మంది తయారుగా ఉంటారు. అమెరికాకి వెళ్లడానికి ఉపయోగపడతారని ప్రతీ పట్టణంలో రెండు మూడు ఇంజనీరింగ్ కాలేజీలని తెరిచేరు. ఇప్పుడు ఏం చేయాలో తెలియక కొట్టుకు చస్తున్నారు. ఎప్పుడైతే అమెరికాలో కంప్యూటర్ సైన్స్ ఉద్యోగాలకి గిరాకీ తగ్గిందో ఆ విభాగంలో తరిఫీదు ఇచ్చే కేంద్రాలు తగ్గాయి, మూతపడ్డాయి. గతంలో అమెరికాలో హెచ్ వీసా వ్యక్తికి పెళ్లిళ్ల మార్కెట్‌లో ఉన్న గిరాకీ పోయి హెచ్‌వీసా వాళ్లు వద్దు బాబోయ్ వాళ్ల ఉద్యోగాలు ఎప్పుడు ఊడతాయో తెలియదు. అథవా ఉద్యోగాలు నిలిచినా ఆరేళ్ల తరువాత వాళ్లు ఇండియాకి తిరిగి రావడం ఖాయం అన్నది ప్రజలందరికీ తెలిసింది. హెచ్‌వీసాకే దిక్కులేకపోతే గ్రీన్‌కార్డు లభించడం మరీ అసంభవం. మార్కెట్‌లో తంబలుతంబలుగా క్వాలిఫైడ్ అమెరికన్ దరఖాస్తుదారులు ఉంటుంటే పైదేశంనుంచి తీసుకువచ్చి ఇక్కడ గ్రీన్‌కార్డు ఇవ్వడం, అమెరికన్ లేబర్ డిపార్ట్‌మెంట్ ఒప్పుకోకపోవడంలో ఆశ్చర్యమేముంది?" అంటూ తనకి అర్థమైనది చెప్పేడు రాఘవ.

"మీరందరూ చెప్పిన దానితో నూటికి



నూరుపాళ్లు ఏకీభవిస్తాను. కాని ఆరోజు తరువాత ఆ దుర్ఘటన జరిగాక దేశం ఆర్థికంగా దెబ్బతినడం ప్రత్యక్షంగా కనిపిస్తున్నా పరోక్షంగా ఇతర మార్పులు చూస్తున్నాం. ఈ దేశం అంతా 'నమ్మకం' మీద నడిచేది, అలా అనిపించేది. ఇప్పుడు చాలా చోట్ల 'అపనమ్మకం' ఆధిక్యతలో ఉంది. బతుకు, బతకనివ్వు అనే అమెరికా ధోరణిలో ఈ సంఘటన తరువాత ఒక తెగకి చెందిన వాళ్లందరూ అనుమానితుల జాబితాలోకి వెళ్లిపోయారు. సామాన్య అమెరికన్ పౌరుడు ఆ తెగకి చెందిన వాళ్లని గుర్తుపట్టని సంఘటనలలో అలాగే కనిపించే ఇతర తెగల వ్యక్తులు కూడా అవమానాలకి గురవుతున్నారు. నేరం నిరూపించేంతవరకు నిందితుడు నిరపరాధి అన్నది పాటించిన ఈ దేశంలో ప్రభుత్వం, ఒక రోజు ఉదయమే వచ్చి ఎవరినైనా నిర్బంధిస్తే తను నిరపరాధినని నిరూపించుకోవడానికి కూడా అవకాశం లేని ఉదాహరణలు వింటున్నాం. అది చాలా విచారకరం" అంటూ నిట్టూర్చింది మానస.

"ఎడ్! రాఘవ రీసెర్చ్‌లో దిట్ట. తను ఇక్కడ ఉన్న ఒక సంవత్సరంలో అసంపూర్తిగా మిగిలిన నా ప్రోజెక్ట్‌లు పూర్తవడంలో చాలా సహాయం చేశారు. ఆ సంవత్సరం డిపార్ట్‌మెంట్‌లో అందరికన్నా జీతం పెరుగుదల నాకే వచ్చింది. రాఘవ్ దగ్గరకి ఏ చిక్కు వ్యక్తిగత సమస్యని తీసుకెళ్లినా పోజిటివ్‌గా ఆలోచించేలా సలహా ఇస్తారు. ఐ లైక్ హిమ్ వెరీమచ్. ఆయన నాకు చేసిన సహాయానికి జోహార్లు" అంటూ సూజన్ వైన్ గ్లాసు మీదకి ఎత్తింది.

"ఆమెకి సహాయం చేసినందుకు థాంక్స్" అంటూ ఎడ్మండ్ తన గ్లాసుని మీదకి ఎత్తేడు. ఏమీ మాటలాడకుండా తన గ్లాసుని కూడా మీదకి ఎత్తింది మానస.

రాఘవకి సూజన్ పొగడ్త ఇబ్బందిగా ఉంది. రవ్వంత సిగ్గుని తెప్పించింది.

"మా దేశంలో అన్నింటికన్నా చవకది ఉచిత సలహా అన్న నానుడి ఉంది. నేను ప్రత్యేకించి సూజన్‌కి సలహా ఏమీ ఇచ్చినట్లు జ్ఞాపకంలేదు. అంతర్లీనంగా ఉన్న పోజిటివ్ దృక్పథమే ఆమెచేత అన్ని పనులు చేయించింది. ఎనీవే థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్" అన్నాడు రాఘవ.

డైనింగ్ టేబిల్ మీద అమర్చిన పదార్థాలని చూపిస్తూ "ఇవి మీకు రాఘవ్" అంటూ కార్నింగ్ వేర్‌లో అమర్చి పెట్టిన పదార్థాలని చూపించింది. "నీకు చేసిన వంటకాలు ఎడ్‌కి నచ్చవు. నీకు నచ్చుతాయనే ఆశిస్తాను" అంటూ రాఘవ్‌కి ప్లేటు అందిచ్చింది సూజన్.

భోజనం తింటుంటే మరోసారి చర్చ రాజకీయాలమీదకి మళ్లింది.

"ఎకానమీ బాగుండక ఈ ప్రాంతంలో చాలా కంపెనీలు మూతపడిపోయాయి. కంపెనీలనుంచి టేక్స్ రూపేణా వచ్చే ఆదాయం పడిపోయింది. దానితోపాటు తాత్కాలికంగా ఈ యుద్ధం వలన ప్రభుత్వానికి ఖర్చు పెరిగింది. దీనివలన ప్రజలకి లభించే సామాన్య సౌకర్యాలు బాగా తగ్గాయి. యుద్ధంలో దాదాపు రెండు వందల సైనికులు చనిపోయేరని విన్నాం. చదివేం. వాళ్ల చావుల మాట ఎలాగున్నా నాకైతే ఈ యుద్ధంలో పాత్రికేయత చనిపోయిందనిపించింది. పుకార్లకి, అభూత కల్పనలకి చిలవలుపలవలు సృష్టించి ప్రభుత్వ ఉద్దేశ్యాలకి వత్తాసుపలికి ప్రజలని పెడదారిన పట్టించడం జర్నలిస్టిక్ వ్యభిచారం. నిజం రాస్తే అది రుచించని ప్రజలు తమ ప్రోగ్రాంలను చూడరని ఆదాయం తగ్గిపోతుందని అబద్ధాలని ప్రసారం చేయడం అనూహ్యం. ఆఫ్ఘనిస్తాన్ యుద్ధం చేసి ఆ దరిద్రుడిని పట్టుకోలేకపోవడం అలా ఉంచి ఆ దేశంని పునర్ నిర్మాణం చేయకుండా, చేసిన వాగ్దానాలని నెరవేర్చకుండా ఇంకొక




యుద్ధం చేయడానికి సరిఅయిన కారణం ఉందా? అంత తొందర అవసరమైనదేనా? లాంటి ప్రశ్నలు ఇప్పుడిప్పుడే బైటపడి ప్రభుత్వాన్ని ఇబ్బంది పెడుతున్నాయి. కావాలంటే ఎడిటోరియల్స్, ఎడిటర్‌కి రాసిన ఉత్తరాలు చదవండి. రిపబ్లికన్స్ చరిత్ర తిర గేసి చూస్తే గతంలో వాళ్లు చాలాసార్లు అబద్ధాలు చెప్పారని జ్ఞాపకానికి వస్తుంది. ఇప్పుడూ అంతే. మరో ఆరు నెలలు ఆగి చూడండి. బండారం అంతా బైటపడుతుంది. మీ ఉద్దేశ్యంఏమిటి? " అనడిగాడు ఎడ్మండ్.

"నాకు అమెరికన్ రాజకీయాలు తెలియవు. మనకి నచ్చిన ఆలోచనల ఆధారంగా ఇలాంటి సంఘటనలని విభిన్న కోణాలలోంచి చూసే అవకాశం ఉంది. నా సంగతి వదిలేయండి. దేశంలో ఒక చిన్న ప్రదేశంలో నివశిస్తున్న సామాన్యపౌరుడిని ఉదాహరణగా తీసుకుందాం. అతనికి లేదా ఆమెకి ప్రపంచం గురించి టెలివిజన్, వార్తాపత్రికలు ద్వారా తెలుస్తుంది. ఈ సామాన్య పౌరుడు వక్రీకరించి ప్రసారం చేస్తున్న వార్తలని, అంతే దారుణంగా పేపర్‌లో రాసిన వ్యాసాలని ఉపన్యాసాలని చదివి ఏమనుకుంటాడు? ఇది నిజమా? కాదా? అన్న అనుమానం అతనికి ఎందుకు ఉద్భవిస్తుంది? పై దేశాలలో ఇంకొక రకమైన వ్యాఖ్యలు, యుద్ధానికి దారితీసిన కారణాలు పేపర్లలో ఇప్పుడు వస్తుంటేకదా ప్రజలకి అనుమానాలు ఎక్కువవుతున్నాయి? ప్రభుత్వం పూర్తి నిజం చెప్పకుండా యుద్ధానికి దిగిందా? అని ముక్కుమీద వేలువేసుకుంటున్నా తమని తాము సముదాయించుకోలేకుండా ఉన్నారు.

'ఈ యుద్ధాలలో గెలిచేం, జాగ్రత్త మాతో విరోధం పెట్టుకోకు' అని సంబరపడుతున్న ప్రజకి, మున్ముందు వీటికి పర్యవసానం ఏమైనా ఉంటుందా? అన్న ఆలోచనకి సమయంలేదు. అమెరికన్లంటే కొన్ని తెగలకి ద్వేషం పెరిగిందని గ్రహించడంలేదు" అంటూ రాఘవ సమాధానమిచ్చేడు. తొమ్మిది గంటలపుడు మానస నిలబడి "ఇహ మేం వెళ్తాం" అంది.

"నా ఆహ్వానాన్ని అందుకుని వచ్చినందుకు థాంక్స్" అన్న సూజన్, ఎడ్మండ్‌లతో కరచాలనం చేశాక రాఘవ, మానసలు కారువేపు నడిచారు.

★ ★ ★

"ఏమిటి నువ్వు ఇచ్చిన అంత మంచి సలహా సూజన్‌కి! నిన్ను అంతలా పొగుడుతోంది" అనడిగింది మానస.

"అదే నేనూ ఆలోచిస్తున్నాను. ఏమీ జ్ఞాపకానికి రావడంలేదు. నాకు తెలియకుండా నేనేదైనా అంటే అది పని చేసిందేమో" అన్నాడు రాఘవ.

రాఘవ వేపు పరీక్షగా అరనిమిషం చూసి రోడ్డుమీదకి దృష్టి మరల్చింది మానస. చలికాలం చాలాదూరంలో ఉన్నా దగ్గరగా ఉన్న సరస్సు ప్రభావం వలన కాబోలు, పొగ మంచు రోడ్డుకి అడ్డంగా పరిగెడుతోంది. కారు లైట్ వెలుతురు దానిని ఛేదించలేక కారుకి ఇరవై ముప్ఫయి అడుగులు దగ్గరే ఆగిపోయింది. కంటి అద్దాలని సరిచేసుకుంటూ "ఎదురుగా వస్తున్న వాహనాలు దగ్గరకి వచ్చేక కాని కనపడడంలేదు" అంది మానస.

మాటలాడకుండా దెయ్యాలలాంటి చెట్లని భూతంలాంటి పొగమంచుని చూస్తూ ఇరవై నిమిషాలు గడిపేసరికి గరాజ్‌లో కారు ఆపి, రిమోట్‌తో గరాజ్ తలుపు మూసింది మానస.

"గుడ్‌నైట్" అంటూ తన గదిలోకి వెళ్లబోతుంటే "మానసా ఒక్కసారి నువ్వు ఇలా మారిపోవడానికి కారణమేమిటి? " అనడిగాడు రాఘవ.

"అదంతా ఒక పెద్ద కథ, ఇప్పుడు వీలవదు. సంతోష్ మేడమీద ఉన్నాడు" అంది

మానస.

"ఎల్లుండి ఉదయమే నా ఫ్లైట్, రేపు ఒక్కరోజే మిగిలింది. గుడ్‌నైట్" అంటూ తన గదిలోకి ప్రవేశించేడు రాఘవ.

ఒక నిమిషం తరువాత "హలోడార్లింగ్ నీ తిరుగుళ్లు అయేయా? ఏమంటుంది ఆ లవలీ సూజీ? " అంటున్న సంతోష్ ముద్ద మాటలు వినిపించగానే ఇంకా ఏం వినాల్సి వస్తుందోనని గది తలుపు వేసి బట్టలు మార్చుకుని పరుపుమీదకి చేరాడు.

'ఏమైపోతోంది ఈ ప్రపంచానికి? సెప్టెంబర్ పదకొండు ఘాతుకం జరిగిన దరిమిలా ప్రపంచంలో ఇంత మార్పు ఒక్కసారి ఎలా వచ్చింది? లేక అంత వరకూ మారు తున్నా గమనించ కుండా ఉండిపో యిన కరుకు నిజాలు ఆ రోజు తరువాత బైటప డ్డాయా? ఆ దారుణానికి కారకు డైన వ్యక్తి అమెరి కాకి దొరకకుండా తిరుగుతుంటే అతని ముఠాని నాశనం చేసే ప్రయత్నాలు, ముందు చూపు చర్యలు బట్టి కొంతమంది అమాయకులు బాధలకి, వేధింపులకి గురవుతున్నారు. చెప్పిన కారణాల ఆధారంగా చేసిన యుద్ధం అనవసరమని అసమంజసమైనదని నిర్ధారణ అయిననాడు, అమెరికా మాటకి విలువ ప్రపంచంలో దిగజారిపోదా? తరువాత అమెరికా ఏదైనా చెబితే ఇతర దేశాల ప్రజలు నమ్ముతారా? నువ్వు నమ్మకపోయినంతమాత్రాన ఏమిటి? అని ఇతర దేశాలని పట్టించుకోకుండా తన ధోరణిలో వెళ్తుందా? వాట్ ఎ పిటీ?' అనుకుంటూ నిద్రలోకి జారుతూ, 'రేపు మానస ఏం చెబుతుందో' అంటూ కళ్లు మూసుకున్నాడు రాఘవ.



రాఘవ నిద్రలేచి కిందకి వచ్చేటప్పటికి సంతోష్ తయారయి బైటకి వెళ్లడానికి సిద్ధంగా ఉన్నాడు.

"హల్లో బావున్నారా? ఐయామ్‌సారీ. మీరెప్పుడు వచ్చినా నేను ఉరుకులు, పరుగులు పెడుతున్నాను. రేపు మీరు ఇండియా వెళ్లిపోతున్నారటకదా! నేను లేకపోయినా ఐనో మానస మీ సంగతి చూస్తుంది. బెస్ట్ ఆఫ్‌లక్" అన్నాడు సంతోష్.

"మీరు సాయంకాలం వస్తారుగా అప్పుడు మాట్లాడదాం" అన్న రాఘవతో "సారీ నేను న్యూయార్క్ వెళుతున్నాను. రేపు రాత్రికి తిరిగి వస్తాను" అన్నాడు సంతోష్.

"సంతోష్ వెళ్లిపోయేడా? " అంటూ అరగంట గడిచేక గదిలోంచి బైటకి వచ్చింది మానస కళ్లు నులుముకుంటూ.

"ఒక అరగంటయింది" అంటూ లేచి రెండు కప్పులలో కాఫీ పట్టుకు వచ్చి ఒకటి మానసకి ఇచ్చి రెండవ కప్పుతో డైనింగ్ టేబిల్ దగ్గర కూర్చున్నాడు రాఘవ. ఎదురుగా కూర్చున్న మానస వడలిపోయిన మందారంలా ఉంది. రాత్రి నిద్దర సరిగ్గా పట్టలేదు కాబోలు. కంటిరెప్పల నుంచి కిందకి విస్తరించి అలసటని, అశాంతిని స్పష్టంగా తెలియచెబుతున్నాయి. ఈవేళ అయినా మానస తనని ఎందుకు రమ్మందో

తెలియచెబుతుందా? అనుకుంటూ మెల్లిగా కాఫీ తాగనారంభించాడు.

★ ★ ★

స్నానం ముగించి బట్టలు వేసుకుని కిందకి దిగబోతున్న రాఘవకి కింద హాలులో మానస, ఇంకోవ్యక్తి మధ్య సాగుతున్న సంభాషణ వినిపించసాగింది. రాఘవ కిందికి దిగగానే ఆ కొత్త వ్యక్తిని "రాఘవ్, ఈయన ప్రకాష్" అంటూ మానస పరిచయం చేసింది. రాఘవ కిచెన్‌లోకి వెళ్లి కాఫీ కలుపుకుని వచ్చి వాళ్లిద్దరి మధ్యా జరుగుతున్న సంభాషణ వినసాగాడు.

"అయితే సంతోష్ గార్ని కలవాలంటే రేపు కాని వీలవదు. రేపు ఎన్ని గంటలకి ఇంటిలో దొరుకుతారు? "

"సంతోష్ రేపు రాత్రికి తిరిగి వస్తారు. రాబోయే రోజుల్లో ఆయన చాలా బిజీగా ఉంటారు. అదీకాక ఆయన నీకు సహాయం చేసే స్థితిలో లేరు"

"అలా అంటే ఎలా మేడమ్. ఆయన మీద చాలా ఆశలు పెట్టుకుని వచ్చేను. నిజానికి ఆయనే నా ఆఖరి ఆశ. మీరైనా చెప్పండి" అంటూ ప్రకాష్ రాఘవవేపు తిరిగాడు.

"సంతోష్ మీకు ఏమీ సహాయం చేయలేరని అంత స్పష్టంగా చెబుతుంటే నేను ఆమెకి ఏం చెప్పగలను? మానసగారు చెప్తున్నది మీరు వినాలి" అన్నాడు రాఘవ.

"సంతోష్‌గారు చాలా మందికి ఉద్యోగాలు వేయించేరు ఇదివరలో. ఆయన వేయించిన ఉద్యోగం పోయింది. ఇండియాలో ఉన్న కంపెనీలతో ఆయనకి లావాదేవీలు ఉన్నాయి. నాలాంటివాళ్లు ఇండియాకి వెళ్లిపోతున్నారు. నేను కెనడా దేశానికి ఇమ్మిగ్రేషన్‌కి దరఖాస్తు పంపేను. హెచ్‌వీసా మురిగిపోకుండా ఉండడానికి ఇక్కడ ఉన్న కొన్ని కంపెనీలు, ఈ మనుష్యులు మాకు పనిచేస్తున్నారంటూ ఒక కాగితం రాసిస్తే చాలు. కెనడా ఇమ్మిగ్రేషన్‌కి ఇక్కడ నుంచి ప్రయత్నం చేస్తే త్వరగా వస్తుంది. నేను ఈ దేశం వచ్చి ఐదేళ్లు పూర్తికావస్తోంది. నాలాగే చాలామంది ఉన్నారు. వాళ్లందరికీ నాలాగే భయాలు పట్టుకున్నాయి. అందులో హెచ్‌వీసాలు పొడిగింపబడవని తెలిసిన దగ్గర నుంచి మరీను. ఈ పరిస్థితులలో సంతోష్‌గారి సహాయం ఎంతో అవసరం" అంటూ ప్రకాష్ ప్రాధేయపడ్డాడు.

"సంతోష్‌గారి కంపెనీ అధ్వాన్న స్థితిలో ఉంది. ఆయన నీకు సహాయం చేయడమేమిటి? అయినా నువ్వు వచ్చేవని ఆయన రాగానే చెబుతాను. నువ్వు ఇతర ప్రయత్నాలు చేసుకోవడం ఉత్తమం. ఆ తరువాత నీ ఇష్టం" అంటూ మానస వెళ్లబోతున్న ప్రకాష్‌తో "ఆయనని కలవాలంటే ఇలా ఇంటికి రావడం సరైన పద్ధతికాదు. ముందర ఫోన్ చేసి ఆయన ఉన్నారని, నిన్ను కలవడానికి సుముఖంగా ఉన్నారని తెలిసినపుడే రా" అంటూ ప్రకాష్‌ని సాగనంపింది మానస.

దిగులుగా వెళ్ళిపోయాడు ప్రకాష్.

"వై టు-కె కోసం చాలామందిని దిగుమతి చేసింది ఈ దేశం. ఎకానమీ దెబ్బతినడంతో పరిస్థితి దినదినానికీ దిగజారుతున్న సమయంలో ఆ సెప్టెంబర్ పదకొండు ఉదంతమయింది. అంతవరకూ ప్రత్యేకంగా వీసాల గురించి పట్టించుకోని ప్రభుత్వం, వీసా గడువు పూర్తయినవాళ్ళని వెతికి పట్టుకుని బంధించడమో, లేక డిపోర్ట్ చేయడమో చేస్తోంది. ఉద్యోగాలు పోగానే, ఉన్న డాలర్లని పుచ్చుకుని ఇండియా తిరిగి వెళ్ళిపోయినవాళ్ళు, ఇండియాలో ఇక్కడ కంపెనీల బ్రాంచీలలో ఇక్కడ జీతంలో నాల్గవవంతు జీతం ఇస్తామంటే ఇండియా వెళ్ళినవాళ్ళు తెలివైనవారు, అదృష్టవంతులు. ఎకానమీ బాగుప

డుతుందని స్వంత డబ్బు ఖర్చుపెట్టి ఉండి పోయినవాళ్ళు కుదేలవడం ఖాయం. వీసాలు సరిగ్గా లేకపోతే, ప్రభుత్వం ఏమాత్రం సహించదు" అంది మానస.

రాఘవ ఏమీ మాటలాడలేదు. మానస సంతోష్ గురించి ఏమైనా చెబుతుందా? అని ఎదురుచూశాడు. ఆలోచనల్లో పడిన మానస మౌనంగా ఉండిపోయింది.

"నేనూ స్నానం ముగించి వస్తాను" అంటూ లేచింది మానస.

★ ★ ★

పగలంతా గడిచింది కానీ మానస తనని బాధిస్తున్న సమస్య గురించి మాటలాడ లేదు. టెలిఫోన్లో సంభాషణతో చాలాకాలం గడిచింది. ప్రశాంత వాతావరణం కుదరక మానస సమస్యమీద చర్చని వాయిదా వేసిందనిపించింది రాఘవకి.

"మనం బైటకి వెళ్ళం, ఇక్కడే డిన్నర్ తింటాం. నీ సామాన్లు అన్నింటినీ సర్దుకుని బట్టలు మార్చుకురా" అంటూ మానస రాఘవని మేడమీదకి పంపింది. అరగంట తరువాత కిందకి వచ్చేసరికి, మానస నైట్ డ్రస్‌లో సోఫాలో కూర్చుని ఉంది. ఎదురుగా వైన్ బాటిల్, రెండుగ్లాసులు ఉన్నాయి.

రాఘవ ఆమె పక్కన చతికిలపడ్డాడు. వైన్ బాటిల్ తెరచి రెండు గ్లాసులలో పోసి ఒకటి తను తీసుకుని రెండవది రాఘవకి అందించబోతే,

"వద్దు, నేను ఇంతవరకూ తాగలేదు" అన్నాడు.

"అవును నాకు తెలుసు. ఎక్కువ తాగద్దు. చారు రుచి చూసినట్లు రుచి చూడు, కంపెనీకోసం, నాకోసం" అంటూ గ్లాసుని అందించింది.

"సంతోష్ కంపెనీ ఇండియానుంచి, ఇతర దేశాలనుంచి ఇంజనీర్లని, కంప్యూటర్ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లని దిగుమతి చేసేది. అదేకాకుండా, ఇతర ఆఫీస్ స్టాఫ్‌ని కూడా సప్లయ్ చేసేది ఆ కంపెనీ. ఉద్యోగాలకి గిరాకీ ఉన్న రోజుల్లో బాగా ఆదాయం పెరగడంతో ఆఫీస్ జాగా, స్టాఫ్‌ని పెంచి లైఫ్ స్టైల్ మార్చాడు సంతోష్. ఇక్కడ చర్చికి, ప్రాంతీయ రాజకీయనాయకులకి ఎలక్షన్లకి విరాళాలు ఇచ్చి ఒక వెలుగు వెలిగాడు కొంతకాలం. నువ్వు క్రితంసారి వచ్చావు చూశావా, ఆ కాలంలో అన్నమాట. ఆఫీసులో పనిచేసేవాళ్ళలో పాకిస్తానీయులు, ఇండియన్లు, అమెరికన్లు ఉండేవారు. ఇస్మాయిల్, అతని గర్ల్‌ఫ్రెండ్ కాబోలు ముంతాజ్ కూడా సంతోష్ ఆఫీసులో ఉండేవారు. ఇస్మాయిల్ సంతోష్‌కి కుడి భుజం లాంటివాడని చెప్పలేంకానీ, ఆఫీసు పని అంటూ పై దేశాలకి తెగ తిరిగేవాడు. ఈ ఉద్యోగం చేస్తూ దానితోపాటు అతను స్వంత బిజినెస్‌గా రహస్యంగా కంప్యూటర్లని విక్రయించేవాడని తరువాత తెలిసింది. అతను హెచ్-1 వీసామీద పని చేస్తున్న వ్యక్తి. ఎకానమీ దెబ్బతినడంతో పరిస్థితులు విషమించాయి.

హైక్వాలిటీ స్కాచ్, షాంపేన్లు, డిన్నర్ పార్టీలకి ధారాళంగా ఖర్చుపెడుతున్న సంతోష్‌కి తాగుడు బాగా ఎక్కువయింది. రాబడి బాగా తగ్గింది" అంటూ వైన్ రెండు గుక్కలు తాగి, "నువ్వు ఇంకా రుచి చూడలేదుకదా? " అంది.

రాఘవ అడ్డంగా తల ఊపాడు.

"ప్లీజ్ అలా అయితే నాకు సంభాషణ కొనసాగించాలని లేదు" అంటూ తనగ్లాసుని కింద ఉంచింది. రాఘవకి ఆమెని నొప్పించాలనిలేదు. దానికి తోడు 'ఆమెకి ఇప్పుడు సలహా అవసరం. తను నిరాకరిస్తే, మానస బిగుసుకుపోతుంది' అనుకుంటూ వైన్ ఒక గుక్క వేసి, "అబ్బా! అదో కరకమైన వగరు" అన్నాడు.

"వగరు! మై డియర్ ఫ్రెండ్ జీవితమంతా వగరే కొందరికి" అంటూ వైన్




తాగుతోంది మానస.

'మై డియర్ ఫ్రెండ్', 'వగరు'లాంటి పదాలు మానస చెప్పబోయే దానికి ఉపోద్ఘాతంలా అనిపించాయి రాఘవకి.

"సెప్టెంబర్ పదకొండున అమెరికాలో అరాచకం సృష్టించిన వ్యక్తుల పేర్లు చదివావుగా. కొన్ని దేశాలనుంచి వచ్చి ఇక్కడ అలా ఉండిపోయినవాళ్ళు ఎవరైనా అలాంటి ఘోరం చేస్తారేమోనని, ముందుచూపుగా అనుమానాస్పదులని రిమాండ్‌లోకి తీసుకున్నారు. వాళ్ళనేకాదు, వాళ్ళతో పరిచయం ఉన్న కొందరిని కూడా అదుపులో ఉంచారు. ఇస్మాయిల్ చాలా దేశాలు తిరిగేవాడు, అతనిని రిమాండ్‌లోకి తీసుకున్నాక ఆరాతీస్తే అతని ఎకౌంట్‌లో చాలా డబ్బు కనిపించింది. ఆ డబ్బు కంప్యూటర్లు దొంగదారిన అమ్మగా వచ్చినది కాబోలు. 'ఇంత డబ్బు ఎలా వచ్చింది?' అనడిగితే ఇస్మాయిల్ అనుమానరహితంగా వివరించలేకపోవడంవలన అతని పేరు అనుమానితుల జాబితాలోనికి చేరిందట. పేట్రియట్ చట్టం అమలుపరచడం మొదలుపెట్టాక, ఇలాంటి అనుమానితులకి లాయర్ సంప్రదింపులు వీలవకుండా నిషేధించారు. ఇస్మాయిల్‌లాంటి వ్యక్తిని ముందూ వెనకా చూడకుండా సంతోష్ ఉద్యోగంలో నియమించినందుకు, అతను ఇటూఅటూ అనుమాన పూర్వకంగా తిరుగుతుంటే గమనించకుండా బాధ్యత విస్మరించినందుకు సంతోష్ మీద ప్రభుత్వం ఒత్తిడి తెచ్చింది. అదీకాక సంతోష్ కంపెనీ నష్టంలోనికి వెళ్ళడంతో ఒక ముంతాజ్‌ని మాత్రం ఉంచి, తతిమ్మా ఉద్యోగస్థులకి ఉద్వాసన చెప్పాడు సంతోష్. అందర్నీ తీసేసి ఒక్క ముంతాజ్‌ని మాత్రం ఉద్యోగంలో ఉంచడంతో ఆఫ్ కోర్స్... చాలాకాలంగా నాలో ఉన్న అనుమానం బలపడింది. సంతోష్ తను కేస్ నుంచి బైటపడడానికి చాలా మంచి లాయర్లని నియమించుకున్నాడు. మంచి లాయర్లు అంటే మాటలా? డబ్బుకావాలి. గంటకి నాలుగువందల డాలర్లు లాయర్ ఫీజ్. ఆఫీసు డబ్బు అయిపోయింది, ఇంటి మీద అప్పుతెచ్చి డబ్బు ఇచ్చాను. రోజులు బాగున్నపుడు ప్రాంతీయ కాంగ్రెస్ ప్రతినిధికి ఎలక్షనపుడు డబ్బు ఇచ్చినందుకు ప్రతిఫలంగా అతను సంతోష్ తరపున బలమైన వకాల్తా ఇస్తే, జైలుకు వెళ్ళకుండా ఈ కేస్ నుంచి సంతోష్ బైటపడతాడు. దాదాపు ఇరవై రెండేళ్ళక్రితం నేనున్న ఆర్థిక పరిస్థితి ఇప్పటిపరిస్థితి ఒకలాగే ఉంది" అంటూ తన ఖాళీ గ్లాసులో వైన్ వంచుకుంది మానస. రాఘవ అతి కష్టంమీద మరో చెమ్చా వైన్ చప్పరించాడు. వైన్‌లో వగరు అలాగే ఉన్నట్లనిపించింది రాఘవకి. అది చూసి మానస ఒక నవ్వు నవ్వింది. రెండో గ్లాసు వైన్ తాగుతున్నా మానస మాటల్లో తొట్రుపాటుగానీ, అసందర్భంకానీ కనిపించడంలేదు రాఘవకి.

"మనం జీవితంలో ఏవేవో కోరికలు కోరుకుంటాం. అవి తీరవు. జీవితం వెళ్ళిపోతుంది భారంగా" అంటూ కళ్ళంబట నీళ్ళు కారుస్తూ ఏడుపుని కంట్రోల్ చేసుకోలేకపోతోంది మానస.

మానసని ఎలా ఊరడించాలో స్ఫురించలేదు రాఘవకి. కాస్సేపు ఆగి, మానస ఏడుపు తగ్గకపోతే, దగ్గరగా జరిగి, "ఇంక ఆపు మానసా... నేను అర్థం చేసుకున్నాను నీ బాధ" అంటూ మానస తలని దగ్గరగా లాక్కున్నాడు. రాఘవ భుజంమీద తల వాల్చి

వెక్కివెక్కి ఏడుస్తోంది మానస. ఎన్నాళ్ళనుంచో కరడుకట్టి పేరుకుపోయిన ఆవేదన, నిరాశ, నిస్పృహ బైటకి ఉబకడంతో నాగార్జునసాగర్ డామ్ బద్దలయి ఒక్కసారి నీళ్ళు తోసుకువచ్చినంత ఉధృతంగా, అగ్నిపర్వతం బద్దలయి మండిపోతున్న లావా గాలిలోనికి ఎగతన్ని దిగువకి ప్రవహించినట్లు మానస కళ్ళలోంచి కన్నీరు ఆగ

కుండా జారి ప్రవహిస్తూ రాఘవ చొక్కాని, ఛాతీని తడిపాయి. రాఘవ మానసని అక్కున చేర్చుకుని సముదాయిస్తూ, బుజ్జగిస్తూ, ఉపశమనం అందిస్తూ ఎంతసేపు కూర్చున్నాడో తెలుసుకునేసరికి తెల్లవారబోతోంది. మానస రాఘవ భుజంమీద నిద్రపోతోంది. వాన వెలిసిన తరువాత మేఘాలు మాయమయ్యాక తెరిపిన పడి కనిపించే ఆకాశంలా ప్రశాంతత చోటుచేసుకుంది మానస మొహంలో. గుండ్రంగా, ఆకాశంమీద చందమామ ఆకాశంమీద వెన్నెలని ప్రసరిస్తున్నాడో లేదోకానీ, మీదకి వస్తున్న సూర్యకిరణాల ముందర వెలవెలాపోతున్నాడు చంద్రుడు. కళ్ళు విప్పిన మానస, రాఘవ ఒడిలోంచి కంగారుగా లేస్తూ "సారీ" అంది. మానస కొత్తగా విచిత్రంగా కనిపిస్తోంది రాఘవకి. ముందర రోజు దైన్యంగా, భీతహరిణిలా విషాదాన్ని మూట కట్టుకున్నట్లు ఉన్న మానసకి, చాలా దూరం పరుగెత్తి ఇక పరుగెత్తలేక అలసిపోయిన అశ్వానికి సరస్సు కనిపిస్తే సేద తీరినట్లు, సుదీర్ఘకాలం ఇబ్బంది పెట్టిన జబ్బు ఇట్టే మాయమైతే బాధ తీరినట్లు, ఈ ఉదయం చూస్తున్న మానసకి చాలా తేడా కనిపించింది రాఘవకి.

"తెల్లవారింది. రాఘవ! నువ్వు మళ్ళీ దూరంగా వెళ్ళిపోయే రోజువచ్చింది. ఐదేళ్ళ తరువాత నువ్వు కనిపించావు. అంతకు ఐదేళ్ళముందు నేను వచ్చి నిన్ను చూశాను. మళ్ళీ ఎప్పుడో! రేపు గురించి ఒకప్పుడు నాకు చాలా నమ్మకం ఉండేది. ఇప్పుడు ఆ ఆశ లేదు. అయితే చాలాకాలంగా తికమక పెడుతూ, వేధిస్తున్న ఒక ప్రశ్నకి సమాధానం దొరికింది" అంటూ కాఫీ ఫిల్టర్ ఆన్ చేసి, "మొహం కడుక్కొని వస్తాను, నువ్వు తొందరగా తయారవు. నిన్ను ఎయిర్‌పోర్ట్‌లో డ్రాప్ చేయాలిగా" అంటూ మానస కదిలివెళ్ళింది.




అరగంట తర్వాత రాఘవ గదిలోనికి వచ్చి, రాఘవ తయారుగా ఉండకపోవడం చూసి "ఏమిటి అలా ఉన్నావు?" అనడిగింది మానస.

"ఏమిటో వెళ్ళాలనిపించడంలేదు" అన్నాడు రాఘవ సూట్‌కేస్ సర్దుతూ.

"మనం జీవితంలో చెయ్యాలనిపించనివి చాలా చేస్తాం. చేయాలనిపించినవి చెయ్యలేకపోతాం... తొందరగా కిందకి దిగు" అంటూ మెట్లు దిగింది మానస.

మరో పదిహేను నిమిషాలలో ఎయిర్‌పోర్ట్‌వేపు రాఘవ, మానసలతో వేన్ పరుగెత్తడం మొదలైంది.

"వచ్చేశాం. కంగారుపడకు. ఫ్లైట్ అందుతుందిలే" అంటూ కారు స్లో చేసింది మానస.

"నేనేమీ కంగారుపడడంలేదు" అన్నాడు రాఘవ.

"నీకు వీడ్కోలు ఇక్కడనుంచే చెప్పేస్తాను. జీవితంలో ప్రేమింపబడకపోవడం విచారకరమే. కానీ ప్రేమించలేకపోవడం చాలా విషాదం అన్నారు వెనకటికెవరో బెస్ట్ ఆఫ్ లక్" అంటూ చేయి చాచింది మానస నీళ్ళు నిండిన కళ్ళతో.

మానస అందించిన చేయిని బలంగా అదిమి, బరువైన గుండెతో ఎయిర్‌పోర్ట్‌లోకి నడిచాడు రాఘవ.

ఫ్లైట్ రెండుగంటలు ఆలస్యం అన్న ఎనౌన్స్‌మెంట్ చూసి మానస లోపలికి వచ్చి ఉంటే మరొక రెండుగంటలు గడిపేవాళ్ళం అన్న ఆలోచన ముందర వచ్చినా, మానస స్థితి ఎలా ఉందో అన్న రెండవ ఆలోచన దానిని చంపింది. ఆలోచించడానికి మనస్కరించక అటూఇటూ చూడసాగాడు. 'ఎయిర్‌పోర్ట్‌లో సెక్యూరిటీ గార్డ్స్ ఎక్కడ చూసినా ఈ దేశం అంతా భయంతో కంపిస్తోంది. ఎక్కువ భయంలో కూరుకుపోయిన వ్యక్తి ప్రాణానికి ముప్పు వాటిల్లబోతున్నట్లనిపించినపుడు విరుచుకుపడడం అసాధారణంకాదు.

అందుకే అమెరికా ఇరాక్ మీద విరుచుకుపడిందా? లేక బైటకి చెప్పని కారణాలని మరుగుపరచి, 'దేశానికి, ప్రాణాలకి ముప్పు' అని ఘోషిస్తూ ప్రజల ధోరణిని పెడమార్గాన మళ్లించి యుద్ధానికి దిగిందా? చెప్పిన కారణాలకి ఆధారాలు, తార్కాణాలు మృగ్యమైనపుడు ప్రజలు నిలదీస్తుంటే, కప్పిపుచ్చుకోవడానికి మరిన్ని అబద్ధాలని చెప్పడం చూసిన సామాన్య పౌరునికి ప్రభుత్వం మీద నమ్మకం సడలదా? అనుమానాస్పదమైన ఇంటలిజెన్స్ సమాచారం మీద ఆధారపడి ఎవరినైనా నిర్బంధిస్తే, దానిని ప్రతిఘటించ కలిగే ప్రాథమిక హక్కు రద్దుచేస్తే ఎలా? ' అనుకుంటుంటే,

"దేశం ఆరెంజ్ లెవెల్ ఎలర్ట్‌లో ఉంది, ఏవైనా ఎలాంటివైనా అనుమానం కలిగించే సంఘటనలు తారసపడితే ఫలానా టెలిఫోన్ నెంబర్‌కి ఫోన్ చెయ్యండి" అన్న టెలివిజన్ ప్రకటన వినిపించింది.

అమెరికాలో అప్రమత్తత, అదీ చాలా భారీ ఎత్తున! అమెరికాలో ఉన్న ప్రజలు 'ఫ్రీడమ్'ని చాలా వాంఛిస్తారు. నిజానికి దానికిచ్చినంత ప్రాముఖ్యం ఇంక దేనికి లేదు. 'ఫలానా దేశంలో ఉద్రిక్త పరిస్థితి ఉంది. అమెరికన్ పౌరులు ఆ దేశానికి వెళ్ల వద్దు' అంటూ తరచూ వినడం ఎక్కువయింది. ఏఏ దేశాలలో అమెరికన్ పౌరులంటే ద్వేషముందో అమెరికన్ ప్రభుత్వం ప్రకటిస్తుంటే, క్రమేణా దేశాల జాబితా ఎక్కువయితే అమెరికన్లు అతితక్కువ దేశాలనే సందర్శించగలరు. ప్రజల మనుగడ అమెరికా దేశ సరిహద్దులకే పరిమితమైతే ఆఫ్ఘనిస్తాన్, ఇరాక్ దేశాలని ఉద్ధరించడం వలన సామాన్య పౌరుడు వాంఛించే 'ఫ్రీడమ్' పెరిగిందా? తగ్గిందా? తెల్లగా ఉన్న అమెరికన్లకి, యూరప్‌లో ఉన్న తెలుపురంగు ఉన్న మనుష్యులకి తేడా తెలియక, యూరోపియన్లని అమెరికన్లనుకుని టెర్రరిస్టులు చంపేయడమో, హింసించడమో సంభవిస్తే, ఏ సంబంధమూ లేని యూరోపియన్లు భయకంపితులయ్యే అవకాశం ఎంతైనా ఉంది. క్రమేణా ప్రపంచ జనాభా రెండు పక్షాలయి, ఒకర్ని ఇంకొకరు చంపుకునే దశకి చేరుతాయా? అనుకుంటూ తల పట్టుకున్నాడు రాఘవ. తలనొప్పికి మాత్ర తీసుకోవడానికి చేతిసంచి తీసి మాత్రల సీసాకోసం వెతుకుతుంటే, ఒక చిన్న బ్రౌన్ పాకెట్ కనిపించగా, తీసి విప్పాడు రాఘవ.

'ఈరోజుల్లో విమానాలలో తిండి ఇవ్వడం మానేశారు. నీకు ఇష్టమైన రెండు సాండ్‌విచ్‌లు పెడుతున్నాను. ఆకలేస్తుంది, అప్పుడు తిను'అంటూ రాసిన చీటితోపాటు సాండ్‌విచ్ పాకెట్ చూసి కంటిలో నీరు తిరిగింది రాఘవకి.

'మానస!

వీడ్కోలు చెబుతూ కంటి నీరుతో మానస! ముందర రోజు కన్నీరు మున్నీరుగా విలపించిన మానస! అలాంటి బాధాపూరిత దశలోనే తన గురించి ఆలోచించి, తనకి తిండి అమర్చింది. ఇంటికి చేరాక మానస పరిస్థితి ఎలా ఉంటుందో! సంతోష్ ఆఫీస్ సమస్య సామరస్యంగా, త్వరగా పరిష్కారమైతే ఆమెకి కొంత ఊరట! కొంత వయస్సు వచ్చాక మనుష్యులు మారడం అసామాన్యం. ఇతర విషయాలలోనైనా సంతోష్‌లో మార్పువస్తుందా? తను ఆమెకి ఏవిధంగా సహాయపడగలడు? ఏ సలహా ఇవ్వగలడు? మానస గురించి ఆలోచనలు వదలడంలేదు. మానసకి తను సహాయం చేయాలంటే తను శాంతంగా ఆలోచించే స్థితిలో ఉండాలి. కానీ మానస బాధ గురించి తన మెదడు అవిరామంగా ఆలోచిస్తే తనేమౌతాడు? ' అనుకుంటూ కళ్లు మూసుకున్నాడు రాఘవ. లాస్ ఏంజెల్స్ వెళ్లే విమానం ఇంకో ముప్ఫయినిమిషాలలో బయలుదేరుతుందన్న ప్రకటన విని చేతి సంచీతో నిర్ణీత గేట్‌వేపు నడుస్తుంటే, తాగిన స్ట్రాంగ్ కాఫీ ప్రభావమో ఏమో కాని

గుండెలో మంట మొదలయింది.

★ ★ ★

"వాట్ వుడ్ యు లైక్ టు డ్రింక్?" అన్న ఎయిర్ హోస్టస్ మాట విని కళ్లు తెరిచాడు రాఘవ.

మొహంమీద ఎగురుతున్న ముంగురులతో, సరిదిద్దిన కంటి రెప్పలమీద నలుపుతో, సన్నగా తెల్లగా ఉన్న ఎయిర్ హోస్టెస్‌లో మానస పోలికలు కనిపించగా,

"వైట్ వైన్" అన్నాడు రాఘవ. సీసాలోంచి వైన్‌ని గ్లాసులోనికి వంచి,

"ఎంజాయ్ యువర్ డ్రింక్" అంటూ మనోహారంగా నవ్వి, డ్రింక్‌లు ఉన్న బండీని తోసుకుంటూ ముందరికి కదలి వెళ్ళింది. పైలట్ ఆలస్యంగా ఫ్లైట్ బైలుదేరినందుకు నాలిక కరుచుకుంటూ చాలా బాధపడిపోతూ, బాధపెట్టినందుకు విచారపడుతూ క్షమాపణలు చెబుతున్నాడు.

నాగరికత!

నిజాన్ని చెప్పకుండా, అబద్ధాన్ని అందంగా చెప్పడం నాగరికత! మనసులో ఉన్నదానిని బైటకి చెప్పలేక, భావాల్ని పూర్తిగా అణిచిపెట్టి ఏ ఆలోచనలూ లేవని ప్రదర్శించడం నాగరికత!

ఒక్క చదువులో తప్ప ఇంకే ఇతర ఆలోచనలు అన్నా చాలా కాలం భయం తనకి. అలాంటిది మానస పరిచయం పెరిగాక, "ఏమీ ఆలోచించకుండా అన్ని పనులు చేస్తావు" అన్న మానస అనటం విన్నాక, మెదడు క్రమేణా ఆలోచనల్ని భరించగలిగిన దశకి చేరుకుంది. 'ఆలోచన అలజడికి దారితీస్తుంది సుమా' అన్న మానస హెచ్చరిక మరోసారి జ్ఞాపకానికి రాగా, మెదడుని మొద్దుబారచేయడానికి గ్లాసులో ఉన్న వైన్ తాగడం మొదలుపెట్టి కళ్లు మూసుకున్నాడు రాఘవ. యాంత్రికంగా ఎయిర్ హోస్టెస్ ఇచ్చిన పదార్థాలని చూసి ఏదీ నచ్చేలా కనిపించక, చేతిసంచీలో మానస ఉంచిన సాండ్‌విచ్‌లు తిని వెనక్కి చారపడ్డాడు. రెండు గంటలుసేపు నిద్రపోయాక, గుండెలో సన్నని మంట రాఘవకి తెలివి తెప్పించింది.

★ ★ ★

రాఘవ ఎయిర్‌పోర్ట్‌లోనికి వెళ్తుంటే ఆఖరిక్షణం వరకు చూసి, కంటినుండి జారిన కన్నీళ్లని తుడుచుకుని ఇంటివేపు కారుని మళ్లించింది మానస. 'మళ్ళీ రాఘవని చూస్తానా? చూస్తే ఎలాంటి పరిస్థితులలో చూస్తాను? రాఘవ తన గురించి పడిన బాధ చూశాక, రాఘవ మనస్సులో తనంటే ఉన్న భావన పసికట్టాక మనసు రవ్వంత తేరుకుంది. "పగలయినా, రేయయినా ఎడారిలో ఒకటేలే" అన్నాడు ఒక కవి. తనది అలాంటిదే అయినా, పగలుకన్నా రేయి నయం. గమ్యం తెలియకుండా నడిచినా, చల్లగా ఉన్న రాత్రిలో నడక పగలు ఎండలో నడక కన్నా మెరుగు, అనుకుంటూ ఇల్లు చేరేసరికి సంతోష్ హాలులో కూర్చుని బీర్ తాగుతున్నాడు. ఉదయం పదకొండు గంటలకే బీర్!

"హలో డార్లింగ్, మీ దోస్తుని వదిలివచ్చేశావే. ఫ్లైట్ రెండు గంటలు లేటంటే, నువ్వు ఇప్పుడప్పుడే రావనుకున్నానే. నువ్వు నన్ను మరోసారి ఆశ్చర్యపరిచావు' అన్నాడు సంతోష్.

"మీరు వెళ్లిన పని ఏమైంది"

"ఆ! అవడానికి ఏముంది? జడ్జి ముందర డిపోజిషన్ ఇచ్చాను, వచ్చేశాను" అంటూ బీరు గడగడా తాగడం మొదలుపెట్టాడు సంతోష్.

"డాళింగ్, ఇది నీకు చెప్పానా? లాయర్ మరో పదివేలు కావాలంటూ ఫోన్ చేశాడు. వచ్చే నెల మొదటి తారీఖుకల్లా కేసు పూర్తవుతుందన్నాడు" అంటూ మానసవేపు చూశాడు సంతోష్.

కింది పెదవి కొరుకుతూ ఆలోచనలో




పడింది మానస!

రాఘవ ఇండియా చేరాక వెంఠనే రాసిన ఉత్తరం తప్ప ఇంకే ఉత్తరామూ రాలేదు. 'ఎలా ఉన్నాడో రాఘవ! తనని మరచిపోయి ఉండాలి. లేకపోతే ఉత్తరప్రత్యుత్తరాలు నడిచేవి కదా? అనుకుంటుంటే రాఘవ రాసిన ఉత్తరానికి తను జవాబు రాయలేదని జ్ఞాపకానికి వచ్చింది మానసకి. తను జవాబు రాయకపోతే మళ్లీ మరొక ఉత్తరం రాయకూడదేమిటి? పోస్టులోవేసిన ఉత్తరం అందకపోయే ఆస్కారం ఉంది కదా? అయినా తను రాయడానికి విశేషాలు ఏమున్నాయి? సంతోష్ జైలుకి వెళ్లకుండా చేసే ప్రయత్నంలో, ఇరవైఏళ్ల ఆర్జన అంతా వెచ్చించవలసి వచ్చిందని రాయనా? అది రాస్తే రాఘవ చదివి బాధపడడూ? చేయడానికి ఏమీలేక ఇంటిలోనే కాలం వెళ్ళపుచ్చుతున్న సంతోష్ తాగుడుకి బానిస అయ్యాడని రాయనా? ఇస్మాయిల్, ముంతాజ్‌లని పాకిస్తాన్‌కి డిపోర్ట్ చేశారని రాయనా? వచ్చి ఉన్న నాలుగు రోజులు నాతోనే తిరిగినందుకు, ఊరట కలిగించినందుకు తను కనీసం కృతజ్ఞత అయినా చెప్పలేదు. తన బాధలు రాఘవ శాంతంగా విన్నాడు కాని, తను కనీసం "నీకేమైనా బాధలు ఉన్నాయా? " అనైనా అడగలేదు. రాఘవ వెళ్ళిపోయిన మర్నాడు వచ్చిన కాంచన,

"నేను అంకుల్‌ని కలవకుండానే వెళ్ళిపోయారు. ఐ లైక్ హిమ్" అంటే తను మనసులో ఉన్నా "నేనూ లైక్ చేస్తాను" అని తనెందుకు చెప్పలేదు?

రేపు ఎలాగైనా తీరుబడిచేసుకుని ఉత్తరం రాసిపడేయాలి, అనుకుంటూ రోజులు వెళ్ళదీస్తుంటే, ఓ రోజు ఇండియా నుంచి హఠాత్తుగా ఫోను. రాఘవ అన్నయ్య మాట్లాడాడు. అది వినగానే గుండె ఒక్కసారి ఆగిన భావన. సన్నగా మంట మొదలై సోఫాలో ఒరిగింది మానస.



'తనకీ రాఘవకీ మధ్య ఉన్నది స్నేహమా, ప్రేమా, ఆకర్షణా? ఏ ప్రశ్నకీ సమాధానం దొరకలేదు. అసలు ప్రశ్నేరాలేదు. మెదడు మొద్దుబారి శూన్యమయింది. 'తన దిగులునంతా నింపుకుని విమానం ఎక్కిన రాఘవ అది మొయ్యలేక పోయడా? వేల మైళ్లలో వున్నా తనకంటూ ఓ ఆత్మీయుడు వున్నాడన్న భావం మైళ్లుమైళ్లు ఎండలో నడిచిన బాటసారికి దొరికిన వృక్షచ్ఛాయలా ప్రశాంతతని అందించేది. నన్ను నన్నుగా అర్థంచేసుకుని తన ప్రశాంతమైన చిరు నవ్వుతో, ఎప్పటికప్పుడు మౌనంతోనే స్ఫూర్తినిచ్చే నా స్నేహితుడు ఇక లేడు. ఇక్కడికి ఎప్పటికీ రాడు' అనుకుంటున్న ఆమె హృదయం దుఃఖాన్ని భరించలేక విలవిలలాడింది. కొన్ని బంధాలు ఎందుకు ఎదురవుతాయో, ఎందుకు మనసుకు హత్తుకుంటాయో, ఎందుకు శాశ్వతంగా నిలవకుండా

హఠాత్తుగా మటుమాయమవుతాయో దాని వెనుక ఏ అనూహ్య హస్తం ఈ మానవ మానసిక క్రీడను చూసి ఆనందిస్తోందో...' ఇలా ఎన్నో ఊహలు, మాటల కందక మౌనంగానే సుళ్లు తిరుగుతున్నాయి మానస మనోసాగరంలో.

★ ★ ★

మానసని చూడగానే లేచివచ్చి కౌగలించుకుని బావురుమంది సంధ్య. సంధ్యని వాటేసుకున్న మానస కంటివెంబడి నీళ్లు జలజలా రాలాయి. చాలాకాలం ఏడ్చిన తన కళ్లలో, కార్చడానికిక నీళ్లు లేవనుకున్న మానసని ఆశ్చర్యపరుస్తూ నీళ్లు తపతపా కిందకి జారుతున్నాయి.

"ఏం జరిగింది సంధ్యా? " అనడిగింది మానస సంధ్య ఏడుపు కాస్త తగ్గుముఖం పట్టాక.

"బరువు పెరుగుతున్నానని నేను రోజూ ఉదయం నడకకి వెళ్తుంటే, తనూ బరువు పెరుగుతున్నానంటూ నాతో ఉదయం నడకకి వచ్చేవారు. ఆరోజు, "బద్ధకంగా ఉంది. నాకు ఈవేళ నడకకి రావాలని లేదు. నువ్వెళ్లిరా" అన్నారు. నేను నడకనుంచి తిరిగి వచ్చేసరికి పరుపుమీదనుంచి కింద పడి ఉన్నారు. హాస్పిటల్‌కి తీసుకెళ్తే, "ప్రాణంపోయి చాలా సమయమైంది" అన్నారు డాక్టర్లు. అంతా క్షణాల్లో జరిగిపోయింది, ఆయన చనిపోయినపుడు నేను దగ్గరగా లేను" అంటూ ఏడుస్తోంది సంధ్య.

'సంధ్యా నువ్వు అక్కడ లేకపోవడం దురదృష్టం. కాని నీకు ఆఖరి చూపు లభించింది. నాకు అదీ లభ్యమవలేదు' అనుకుంటూ సంధ్యని వాటేసుకుని తన బాధని దిగమింగే ప్రయత్నం చేస్తోంది మానస.

"చనిపోయేముందు బాధపడినట్లులేదు. బాధపడినా అలాంటిదేమీ ఆయన మొహం మీద కనిపించలేదు. కనిపించినది చిరునవ్వే" అంటూ కళ్లని తుడుచుకుంది సంధ్య.

"అవును, రాఘవ మొహంమీద చిరునవ్వు చెదరడం నేనెప్పుడూ చూడలేదు" అంది మానస సంధ్యనుంచి దూరంగా జరుగుతూ.

"ఈమధ్య అదే అమెరికా ట్రిప్ నుంచి వచ్చిన దగ్గరనుంచి ఆయనలో ఆలోచనలు మరీ ఎక్కువయ్యాయి. ఒంటరిగా ఉన్నపుడు మథనపడడం నేను చాలాసార్లు గమనించాను" అంది సంధ్య.

"మా పరిచయం అయిన మొదటిరోజుల్లో, 'దేని గురించీ ఆలోచించవు పిరికివాడివి, గోడమీద పిల్లివాటం' అంటూ అప్పుడప్పుడు అతనిని గేలిచేసేదాన్ని. చిరునవ్వు నవ్వేవాడు. ఐ లైక్డ్ హిమ్ వెరీమచ్" అంది మానస.

"లైక్డ్ హిమ్ అనే కంటే లవ్డ్ హిమ్ అంటే నిజాన్ని సరిగ్గా చెప్పినట్లుంటుంది. నాకు తెలుసు మానసా, నేను ఎప్పుడో గ్రహించాను. ఆ సంగతి నువ్వు రాఘవకి ఎప్పుడైనా చెప్పావా? " అనడిగింది సంధ్య.

ఒక్కసారి బిత్తరపోయింది మానస. సంధ్యవేపు చూడడానికి ఇష్టపడక తలవంచుకుంది. 'ఒక వ్యక్తి ఇద్దర్ని ఒకేసారి ప్రేమించడం సంగతి నాకు తెలియదు, కాని ఒకేవ్యక్తిని ఇద్దరు ప్రేమించడం మనం తరచూ చూస్తాం. రాఘవకి నువ్వంటే ఎంతో గౌరవం, అభిమానం. తనకి నిన్ను ప్రేమిస్తున్నానన్న విషయం ఈమధ్యనే అవగాహనకి వచ్చినట్లుంది. మానస చాలా ఇబ్బందులలో ఉందని చాలాసార్లు నాతో అన్నారు" అంది సంధ్య.

మానస ఒక్కసారి బావురుమంది. సంధ్య లేచి వచ్చి మానసని అక్కున చేర్చుకుంది.







# 'పిచ్చోడు' పై సమీక్షలు

సెప్టెంబర్ 'చతుర'లో ప్రచురితమైన ఆదెళ్ళ శివకుమార్ నవల 'పిచ్చోడు' పై మాకందిన ఉత్తమ సమీక్షల్ని ఈ దిగువ ప్రచురిస్తున్నాం

## ఫలించిన ప్రయత్నం

*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

ప్రకృతికి వసంతంలా ప్రతి మనిషికి యవ్వనం దేవుడిచ్చిన వరంలాంటిది. ఆ యవ్వనావేశంలో వయసు వశం తప్పినపుడు దాని ప్రభావం మగవారికన్నా ఆడవారిపైనే ఎక్కువగా ఉంటుందని 'పిచ్చోడు' నవలద్వారా మరోసారి రుజువు చేశారు రచయిత ఆదెళ్ళ శివకుమార్.

నవ మాసాలు మోసిన పసిగుడ్డుల్ని సమాజానికి వెరచి నిర్దాక్షిణ్యంగా కుప్పతొట్టిపాలు చేస్తున్న పెళ్ళికాని తల్లులు పెరుగుతున్న నేటి తరుణంలో అరుంధతి తీసుకున్న నిర్ణయం అభినందనీయం. కానీ సహనం చేతకానితనంగా, నిజాయితీ గలవారిని పిచ్చివాళ్ళుగా భావించే మన సమాజంలో 'పిచ్చోడు'లాంటి పిచ్చోళ్ళు ఇంకా ఉన్నా అరుంధతిలా అందరికీ అందుబాటులో ఉంటారని గ్యారంటీ లేదు. కాబట్టి అలాంటి ఆలోచన అనుసర



ణీయంకాదు.

ఒక కళాకారుడి ఫీలింగ్స్‌ని కళ్ళకు కట్టినట్లు చూపించడంలో రచయిత ప్రయత్నం ఫలించింది. నవల చదువుతున్నంతసేపూ మానవత్వానికి నిలువెత్తు నిదర్శనమైన ఆత్మీయుడు తన జీవితంలోని కష్టసుఖాల్ని మనతో పంచుకున్నట్లుగా ప్రతి పాఠకుడూ ఫీల్ అవుతాడు. అవకరాన్ని అడ్డంపెట్టుకుని అడుక్కోవడానికి అలవాటుపడ్డ అసమర్థులు, ఉద్యోగావకాశాలు లేవని ఉసూరంటూ జులాయిల్లా తిరుగుతూ కన్నవాళ్ళను, ప్రభుత్వాన్ని విమర్శించే బద్ధక ప్రబుద్ధులు ఈ నవల చదివి బుద్ధి తెచ్చుకోవాలి. వెన్నకన్నా సున్నితమైన స్త్రీ హృదయం అవసరమైతే ప్రాణం తీయడానికి కూడా వెనుకాడదని కిరణ్ పీక పట్టుకున్న అరుంధతి నిరూపించింది. అనాధబాలలు పెరుగుతున్న ఈ రోజుల్లో సందర్భోచితమైన నవలను ప్రచురించిన చతురకు, ఒక ఆర్టిస్టు పాత్రను ప్రధానంగా చేసి కథ నడిపిన రచయితకు నా ధన్యవాదాలు.

– కె. శివరామకృష్ణ
విజయవాడ

## ఆవలి తీరాలు

*(రెండవ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

ఒకింత పలకరింపుకోసం, కాసింత లాలన కోసం ఆర్తితో తపించిన మూగ హృదయపు ఆరాటాన్ని ఆర్ద్రంగా స్పృశించిన నవల 'పిచ్చోడు'. బతకడమే వ్యర్థమని అనుకొనే స్థాయినుంచి అనంత ప్రదేశాల ఆవలితీరాలు సైతం వెదుక్కుంటూ అడుగులు వేయగలననే స్థాయికి వ్యక్తి అంచెలంచెలుగా ఎదిగిన వైనాన్ని అందంగా ఆవిష్కరించారు రచయిత. 'మీ ఆవేశం, కోపం ఇవన్నీ మీరు మాటలలో వ్యక్తం చేయగలరు. కానీ నాకు ఆ అవకాశంలేదు. అందుకే నన్ను నేను శిక్షించుకుంటున్నాను. పిచ్చివానిలా ప్రవర్తిస్తున్నాను అని రాసి చూపిన కృష్ణలో సంఘంపట్ల కసి, ఉక్రోషం కనిపిస్తాయి. కానీ 'లోకం గురించీ, మనుషుల స్వార్థంగురించీ తెలుసుకున్నాను. కృత్రిమంగా నవ్వడం, లేని ప్రేమ నటించడం నాకు చేతకాదు' అన్న మాటలలో, వ్యక్తుల నిజస్వరూపాలను ఆకళింపు చేసుకున్న పరిణతి కనిపిస్తుంది. 'మానవత్వంతో ఆ మాతృమూర్తిని ఆదుకోవాలనే నేను నిర్ణయించుకున్నాను' అన్నప్పుడు హిమాలయాలంత ఎత్తుకు ఎదిగిన వ్యక్తిత్వం దర్శనమిస్తుంది. 'తప్పొప్పులూ, మానవ బలహీనతలూ అర్థం చేసుకునే వయసు వచ్చినప్పుడు వాడు నీకు దగ్గరౌతాడు' అనే క్రాంత దర్శనం అంతకంటే పైమెట్టు. తానేదో త్యాగం చేశాననే భావన అణుమాత్రం కూడా లేకుండా, 'ఆమె నాకు దూరమైతే శూన్యంగా మిగిలిపోతాను' అనే తాత్త్వికత, స్వచ్ఛమైన ప్రేమకు పరాకాష్ఠ. 'కృషి, పట్టుదల... ఈ రెండే మనిషికి ఆయుధాలు కావాలనీ, ఈ ఆయుధాలతో ఆకాశమంత ఎత్తుకు ఎదగాలనే' శారదాంటీ ఆశయాన్ని సఫలం చేసిన కృష్ణ జీవితం యువతకు మార్గదర్శకం. మంచి నవలందించిన రచయిత అభినందనీయులు.

– టి.వి. శ్రీధర్
గూడూరు- 524 101

## అనూహ్య పరిష్కారం

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

నవల పేరు చూడగానే సాదాసీదా అనిపించినా- మంచి కథావస్తువు, సంఘటనలనూ,





పాత్రలనూ బాగా నడిపించిన తీరూ చాలా ప్రశంసనీయం. అంగవైకల్యం వున్న కథానాయకుడు కృష్ణ అందుకు కృంగిపోకుండా అందివచ్చిన ప్రతీ మంచి ఆలంబననుంచీ స్ఫూర్తిని పొంది ఆదర్శప్రాయమైన ఉన్నతిని ఆత్మవిశ్వాసంతో సాధించడం, అందరికీ ప్రేమనూ, మంచితనాన్నీ పంచియివ్వడం చాలా ఉదాత్తమైన సందేశాన్ని యిస్తుంది. అన్నివిధాలా బాగా వున్నవాళ్లు కూడా ఏదో రకమైన వంకలతో ఏ మంచి మార్గాన్నీ కూడా సాధించే ప్రయత్నం చేయకుండా సోమరితనంతో కాలక్షేపం చేసేవాళ్లను ఎంతోమందిని చూస్తుంటాము.

ఇందులోని అన్నిపాత్రలూ దేనికదే స్వభావసిద్ధంగా భిన్న మనస్తత్వాలతోనూ, ఆలోచనా విధానాలతోనూ, చాలా సహజంగా కనిపిస్తాయి. అయినప్పటికీ కృష్ణ వీళ్లందరితోనూ కలిసే నడచి, తనదైన ప్రత్యేక నడవడికతోనూ, నిర్ణయాలతోనూ తనకూ అందరకూ మంచి జరిగేలా చేయగలిగాడు. ముఖ్యంగా అరుంధతినుంచి తను ఆలంబనను పొందుతున్నానని చెప్తున్నా, యథార్థానికి అతను ఆమెకి యిచ్చిన చేయూత, ఉన్నత సహజీవనం చాలా గొప్పవి. అరుంధతి పాత్రను ఎంతబాగా నడిపించినా కృష్ణను మోసం చేసి పెళ్ళిచేసుకోవడం కొంత వెలితిని కలిగించింది. అయితే ఆ వెలితిని ఎక్కడా పెద్దది చేయడంగానీ, యితర సమస్యలకు దారితీయడంగానీ చేయకపోవడంలో రచయిత మంచి నేర్పును చూపించారు.

కిరణ్ సృష్టించిన సమస్యకు అనూహ్యమైన ఒక చక్కని పరిష్కారాన్ని కృష్ణ ద్వారా సాధించడం కూడా రచయిత చాలా బాగా చేయగలిగారు. మామూలుగా అనుకునే విధంగా కాకుండా తన ఉదాత్తతతో కిరణ్‌ను కూడా తనవైపు మళ్లించుకోవడం కృష్ణ పాత్రకు ఒక ప్రత్యేకతను కలిగించింది.

అన్నివిధాలా యిలా అందరిలోనూ మంచి అనుబంధాలూ, ఆత్మీయభావాలూ పెంపొందితే సమాజంలో అందరూ కూడా ఒక మంచి సహజీవనం సాగిస్తే మంచి అన్నది తప్పకుండా గెలుస్తుంది.

– వి. వీరభద్రరావు
హైదరాబాద్-500076

## రాయన్నది ఒకనాటికి రత్నమైతే...!

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

పిచ్చోడు నవల ఆద్యంతమూ ఉత్కంఠగా, ఆసక్తిదాయకంగా సాగింది. 'రాయన్నది ఒక నాటికి రత్నమైనట్లు' తనను ఎందుకూ పనికిరాని వాడిగా ముద్రవేసిన వ్యక్తులను పిచ్చోళ్లను చేసి తనచుట్టూ తిప్పుకున్న (పిచ్చోడు) కృష్ణపాత్ర చిత్రణ మనోహరంగా వుంది. కుటుంబానికి తానే ఆధారభూతుడై వేలకు వేలు ఇచ్చి కుటుంబసభ్యులు సిగ్గుపడేటట్లు చేశాడు. శారద ఆంటీ సుహృద్భావ ప్రోత్సాహంతో చేయి తిరిగిన చిత్రకారుడై ఎనలేని కీర్తిప్రతిష్టలు ఆర్జించాడు. తన కలల రాణి అరుంధతిని తనదాన్ని చేసుకున్నాడు. 'అహింసా పరమోధర్మః' అన్నట్లు తనెవ్వరిని హింసించకుండా కిరణ్, అరుంధతిపట్ల ఔదార్యం చూపాడు. కిరణ్ విషయంలో కూడా కృష్ణ తీసుకొన్న నిర్ణయం అనితర సాధ్యం. సమస్యను ఎదిరించి పోరాడాలి తప్ప పారిపోగూడదనే అసాధారణ వ్యక్తిత్వానికి జోహారు చెయ్యాలి. రచయిత గొప్పతనం కృష్ణచే పలికించిన మాటలద్వారా అంచనా వేయవచ్చు. 'కేసు నువ్వు ఓడిపోతే అరుంధతి నిన్ను తన ఛాయలకు రానీదు. చందన్‌కు శాశ్వతంగా దూరం అవుతావు.

కేసు గెలిస్తే చందన్ నీకు, మాకు గాకుండా పోతాడు'. అంటూ కిరణ్‌ను 'డూ ఆర్ డై' స్టేజిలో ఉంచడం, కేసు వాపసు తీసుకొనేటట్లు చేయడంలో రచయితనైపుణ్యం పరాకాష్టకు చేరుకుంది. ఎంతటి అహంభావినైనా మంచితనంతో, మానవత్వంతో మార్చడం సాధ్యమని పిచ్చోడి ద్వారా చెప్పించడంలో రచయిత కృతకృత్యులయ్యారు. ఈ నవలను ఏదో ఒకరకంగా చదవకుండా ప్రతి సంఘటననూ ఆస్వాదిస్తూ చదివితే ఎంతో ఆనందం కలుగుతుంది. కుటుంబానికి ఏమీ ఉపయోగపడకపోయినా అప్పులు చేసి కొడుకు పెళ్ళి చేసిన సోమయాజులు పాత్ర కొంచెం అసహజంగా వుంది.

– నరెడ్ల అచ్యుతరామం
అల్లిపూడి 533 407.

## మనసునుదోచిన మనోవిశ్లేషణ

**(ఐదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)**

'పిచ్చోడు' నవల ఆద్యంతం, ఆసాంతం కదలకుండా చదివింపజేసిన రచన. చాలా కాలం తర్వాత ఓ మంచి రచన చదివాననే తృప్తిని అందించింది. హృద్యంగా మనసుకు హత్తుకునేలా కళ్లు చెమర్చేలా అత్యంత సహజంగా ఉన్నదీ నవల. సాధారణంగా ఏ లోపమూ లేని పిల్లలు కూడా తల్లిదండ్రులు, సమాజం చూసే చూపులో ఏదో తెలియని వెలితిని, బాధను పొందుతారు.

పరువు-ప్రతిష్ఠలకు పోతూ, భేషజాలకు లోనవుతూ ఆర్థిక స్థోమత అంతంత మాత్రంగా గల కుటుంబ వ్యవస్థలో సాధారణంగా బాల్యంలో పిల్లలు అనుభవించే మానసిక సంఘర్షణను, దానికి తోడు మూగతనం అనే మరో లోపం కూడా ఉన్న కృష్ణ పాత్ర ను చాలా సహజంగా నడిపారు. అతని తల్లి అసహాయత, మాతృత్వ మమకారం వంటి లక్షణాలు కూడా స్త్రీ సహజంగా మలచబడ్డాయి.

ధర్మారావు, జానకమ్మ, శారదలాంటి వాళ్లు ఉండబట్టే మన సమాజంలో అంగవికలులకు, అవిటివారికి స్వచ్ఛంద సేవా సంస్థలు, పాఠశాలలు నడపబడుతున్నాయి నేడు. మురళిలాంటి స్వార్థపరులు, కిరణ్ లాంటి స్వార్థపరులు కోకొల్లలు. ఒక బ్యాంక్ మానేజరుగా పనిచేసే అరుంధతి మాత్రం రెండవ వివాహం చేసుకోవాలనుకోవటంలో ఔచిత్యం కనబడలేదు. కృష్ణని పావులాగా వాడుకోవటంలో మాత్రం సహజత్వం కనబడుతుంది. కృష్ణ డబ్బు సంపాదించడం ఏదో సినిమాలో చూపించినట్లు కాక నిరుద్యోగ యువతలో ఆలోచన రేకెత్తించేదిగా ఉంది. పిల్లల్లోని అభద్రతా భావం, పిరికితనం ఏవిధంగా ఉంటాయో తెలియజెప్పే పాత్ర చందన్. సహజత్వంతో ఉత్కంఠగా సాగిన ఈ నవల ఇటీవలి కాలంలో చాలా నచ్చిన నవల.

– సి. హెచ్.మహాలక్ష్మి
సికింద్రాబాద్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2003-RN1/32186/78





# రుచి పచి లేని రోజులకిక గుడ్ బై...

అసలైన సాంబారు రుచి, రసంలోని ఘుమఘుమలు మర్చిపోలేని గరంమసాలా ఘాటు. ఇప్పుడు మీ అభిమాన 'ప్రియ' అందిస్తోంది ఇవన్నీ. మెరుగైన నాణ్యత, మర్చిపోలేని రుచులతో వస్తున్నాయి 'ప్రియ' వారి సాంబారు, రసం, గరంమసాలా పొడులు. ఒక్కసారి వండిచూడండి.

మీ 'ప్రియ' రుచుల్ని ఆస్వాదించండి.






**priya**

*Masala Powders*

• సాంబారు పొడి • రసం పొడి • గరంమసాలా పొడి